# చతుర

జనవరి 2009

రూ.10/-

సి.యస్.రావు

సమాగమం


ఆరోగ్య ప్రపంచంలో ఒక విప్లవం







✦ మోకాళ్ళ నొప్పి ✦ మెడ , నడుము నొప్పి
✦ సంతాన లేమి ✦ థైరాయిడ్ సమస్యలు
✦ ఆస్తమా , అలర్జి ✦ సెక్స్ సమస్యలు

హోమియోకేర్ ఇంటర్‌నేషనల్

హోమియోపతిలో ప్రప్రథమ ఎంపిక

ఉచిత కన్సల్టేషన్ :
9246 22 6666 | 9394 77 7077
బేగం పేట్, అబిడ్స్, జూబ్లి హిల్స్, కూకట్ పల్లి
www.homeocare.in

## ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన కేరళ వారి ప్రత్యేక చికిత్సలు!!

## ఇది నమ్మలేని నిజం! షుగర్‌కు ఇక శెలవ్!!

షుగర్ (DIABETES MELLITUS) అతి మూత్రము (DIABETES INSIPIDUS) వ్యాధి బాధితులకు శుభవార్త!! 35 సం॥రాల సుదీర్ఘకాల పరిశోధనా ఫలితం! అన్ని వయసుల వారికి ఎన్ని సంవత్సరముల నుండి షుగర్ వ్యాధి ఉన్నా, (TYPE-II DIABETES. NON INSULIN DEPENDENT DIABETES MELLITUS. (NIDDN) 30 రోజులలో నియంత్రణలోకి వస్తుంది. (TYPE-1 DIABETES. INSULIN DEPENDENT DIABETES MELLITUS. (IDDN) 60 రోజులలో నియంత్రణలోకి వస్తుంది. ఆహార నియమాలు యోగ, నడక, శరీర, వ్యాయామాలు లేకుండా పంచదార, బెల్లం, తేనె, ఖర్జూరము లాంటివి తీసుకుంటూ వ్యాధిని తగ్గించుట ఈ మందు యొక్క ప్రత్యేకత. షుగర్ పేషంట్లకు మానని పుళ్ళు, గాయములు, గాంగ్రీన్ లాంటివి 30 రోజులలో మాన్పించవచ్చును.

(PER MONTH Rs. 2000/-) TYPE-II COURSE 3 MONTHS. TYPE-1 COURSE 6 MONTHS.

## త్రాగుడు మానండి! మాన్పించండి!! STOP ALCOHOL!!

మీరు అనుకోకుండా బానిసలుగా మారిన త్రాగుడును ఆల్కహాల్‌ను (Alcohol), గంజాయి (Bang), నల్లమందు (Opium) (Morphine), బీడి, సిగరెట్, గుట్కా, కల్లు, సారాయి, మైకం పొగ (Cannabis), (Heroin) మొదలగు మత్తుమందులు (Tobacco-Pipe) పొగాకు పొగ పీల్చుట మా ఆయుర్వేద మందు ద్వారా మానవచ్చును, లేదా వ్యసనపరుడైన వ్యక్తిని తీసుకురాకుండా మరియు అతనికి తెలియకుండా మాన్పించవచ్చును. **Course: 2 months.**

## బట్టతల!! Baldness! నెరిసిన జుట్టు!! Grey Hair!

చుండ్రు, జుట్టు రాలుట, పేను కొరుకుడు, జలుబు, కళ్ళ మంటలు, దీర్ఘకాల తలపోటు, మాడుపోటు, పార్శ్వపు నొప్పి, మెదడును చల్లబరుచుట, సుఖనిద్రను కలిగించి జ్ఞాపకశక్తిని వృద్ధిపరిచి తలలోని పేలను వదలగొట్టి, జుట్టును నల్లగా ఒత్తుగా, పొడవుగా పెంచి బట్టతల నెరసిన జుట్టును శాశ్వతంగా నివారించును. **Kerala Herbal Hair Tonic (Oil) 100 ml, 250 ml ; Kerala Herbal Shampoo 100 ml; 250 ml; Herbal Hair Capsules 60 - Course: 6 Months.**

## సంతానం లేని (Infertillity - Sterillity) దంపతులకు శుభవార్త!!

సంతానోత్పత్తి కణాలు తక్కువగా వున్న మగవారికి కణాలలో కదలిక లేని వారికి కణాలు పూర్తిగా లేనివారికి (Azoosperimia) వెరికోసిల్‌వీన్స్ (Varicoseviens) Course: 3 months, స్త్రీలకు అండాశయముల నుండి అండములు విడుదలకాకపోవుట, అండవాహికలు మూసుకొనిపోవుట (Fallopian Tubes Block), గర్భాశయ పొరలకు వ్యాధి సోకినా, ప్రొలాక్టిన్ హార్మోన్ ఎక్కువ శాతములో ఉన్నా, లోపలి ద్రవాల్లో అమ్లగుణము (Acid) ఎక్కువగా వున్నా, ఎండోమెట్రియాసిస్, అండములు చాలా చిన్నవిగా వున్నా రసాయన వాజీకరణ పద్ధతుల ద్వారా ప్రత్యేక చికిత్స చేయబడును. **Course: 3 months.**

## ఉబ్బసం (Asthma) ఎలర్జీ (Allergy) వ్యాధులకు ప్రత్యేక చికిత్స!!

జలుబు, దగ్గు, ఆయాసం, తుమ్ములు, పిల్లికూతలు, కళ్లు, ముక్కునుండి నీరు కారుట, ఊపిరి ఆడకపోవడము, సైనసైటిస్ (Sinusitis) ఇస్నోఫీలియా (Eosinophilia) దుమ్ము, ధూళి, ఏసి, ఐస్‌వాటర్, మంచు చల్లగాలుల వల్ల కలుగు ఎలర్జీ వ్యాధులకు **Asthma Sanjivini 200 ml Course: 9 months.**

❖ నూతన యవ్వనశక్తికి, శీఘ్రస్కలనము, హస్తప్రయోగము **(Masturbation)**: నపుంసకత్వము **(Impotency)** అంగస్తంభన సరిగా లేకపోవుట, లైంగిక వాంఛ లేకపోవుట **(Libido)**, రతి మధ్యలో అంగము మెత్తబడి చిన్నగా ముడుచుకొనిపోవుట, వృషణములు కుష్కించిపోవుట **(Atrophy of Tests)**, ప్రొస్టేటు గ్రంధి వాపు **(Enlarge Prostate) Course: 3 months** ❖ సుఖవ్యాధులు **(Venereal Diseases)**: వ్రణములు, పుండ్లు, సవాయి, కొరుకుడు గనేరియా సిఫిలిస్, గ్లీట్, షాంక్రాయిడ్, **Course: 3 Months:** ❖ హెర్పిస్ సింప్లెక్స్ **(Herpes Simplex)** హెర్పిస్ జోష్టర్ **(Herpes Zoster) Course: 3 months.** ❖ స్తనముల బిగువుకు: జారిన (వాలిన) స్తనములను చిన్నగా, మెత్తగా వున్న స్తనములను సైజును పెంచి, గట్టిగా గుండ్రముగా చేసి స్త్రీలను అందముగా కనబడునట్లు చేయును. స్తనముల సైజును తగ్గించుటకు **(Decrease) Course: 3 months.** ❖ స్త్రీలకు పొత్తికడుపు మీద గోకిన గీతలు, చారలు పోవుటకు **(Screch Marks) Course: 3 months.** ❖ మలబద్ధకము **(Constipation): Course: 1 month.** గ్యాస్ట్రబుల్, ఎసిడిటి, అల్సర్, అజీర్ణము **(Dispepsia)**, ఆకలి లేకపోవుట, కడుపులో నొప్పి, మంట **(Gastritis)** జీర్ణాశయములో ఆసిడ్ ఎక్కువై చాతిలో మంట **(Acidity)**, జీర్ణాశయములో పుండు **(Peptic Ulcer)** అంత్రమూలములో పుండు **(Duodenal Ulcer) Course: 3 months** ❖ రక్త మొలలు, అర్శమొలలు **(Piles) Haemoroids**, ఆసనములో చీలిక పుండ్లు **(Fissers)** (ఆపరేషన్ లేకుండా) **Course: 3 months** ❖ పులిపిర్లు **(Warts)**, ఆనెలు **(Corns)** ❖ సోరియాసిస్ **(Psoriasis) Course: 3 months :** ❖ బొల్లి **(Leucoderma), Course: 3 months.** ❖ స్థూలకాయము **(Obesity)**: అధిక బరువును, లావును తగ్గించుటకు **(No Diet, No Exercise) Course: 3 months** ❖ సన్నగా బలహీనముగా నుండువారు, బరువు పెరిగి, లావుకావటానికి ఎత్తు పెరుగుటకు, (21 సం॥లోపు వారు) **Course: 3 months** ❖ కీళ్ళు కండరాల నొప్పులకు: **(Rheumatis arthritis)** నరముల వాపు **(Neuritis) (Backache)**, నడుము నొప్పి **(Lumbago)**, మెడనొప్పి వెన్ను నొప్పి **(Spinalcord)**, తుంటి నొప్పి సయాటిక ఆపరేషన్ లేకుండా **Course: 3 months** ❖ పక్షవాతము **(Paralysis) Course: 3 months.** ❖ మూర్ఛ అపస్మారకము **(Fits) (Epliepsy)** పిచ్చి ఉన్మాదము **(Mania)** హిస్టీరియా **(Hysteria)** జ్ఞాపకశక్తి తగ్గిపోవుట **(Loss of Memory)** నిద్రపట్టకపోవుట **(Insomnia), Course: 3 months.** ❖ చెవిపోటు **(Ear ache)**: చెవినుండి చీము కారుట, చెవుడు, చెవిలో హోరు శబ్దము ఆపరేషన్ లేకుండా, **Course: 3 months.** ❖ నత్తిని తగ్గించుటకు **(Stammering): Course: 3 months** ❖ స్త్రీల శరీరంపై వచ్చు అవాంచిత రోమములు తిరిగి మొలవకుండా చేయుటకు: **Course: 1 month.**

**HIV / AIDS, CANCER / LUKEMIA, MAIGRANE, HEPATITIS, HERPES.**

**అన్ని రకముల దీర్ఘకాల వ్యాధులకు సంప్రదించండి. మాకు మరెక్కడా బ్రాంచీలు లేవు.**

10 A.M. TO 8 P.M.

# కేరళ ఆయుర్వేద వైద్యశాల

10 A.M. TO 8 P.M.

ఓడియన్ 70 ఎంఎం థియేటర్ ఎదురుగా, రేమాండ్స్ & Fantoosh Showroom ప్రక్కన, రూపాని టెక్స్‌టైల్స్ పైన,
చిక్కడపల్లి మెయిన్‌రోడ్, హైదరాబాద్ - 20. ఫోన్: 65526109, 9866155109, 9392355590

Note: పోస్ట్ ద్వారా కూడా చికిత్స కలదు. ఉత్తరాల ద్వారా మీ సమస్యలను తెలియచేసి, మీ దగ్గర ఉన్న రిపోర్టు పంపి ఫోన్ ద్వారా సంప్రదించి చికిత్స పొందవచ్చును. మందు ఖరీదు మరియు పోస్టల్ ఛార్జీ రూ॥ 80/- కలిపి మనియార్డర్ లేదా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా మీ ఫోన్ నెంబరుతో సహా పంపించండి. ఫోన్ ద్వారా సంప్రదించువారు 10A.M. - 2 P.M. & 5 P.M. - 8 P.M




భారతీయ సాహిత్యంలో
సమున్నతం జ్ఞానపీఠం!
సాహితీకృషీవలుల అవిశ్రాంత
అక్షరసేద్యానికి
అజరామర పురస్కారం జ్ఞానపీఠం!!
ప్రారంభించిన నాటినుంచీ నేటివరకూ
దాదాపుగా ఏడాదికో సాహితీరత్నాన్ని
అక్కున చేర్చుకుందీ పీఠం!
ఈ పీఠాన్ని అధిరోహించిన ఎందరో
అక్షర నిర్మాతలు
మనకు సదా స్ఫూర్తిదాతలు...

**త్వరలో మీకోసం చతుర లో**
**మరో కొత్తశీర్షిక**





# రచయితలకు సూచనలు

**నవ్యనవలా వేదిక 'చతుర'కు రచనలు పంపేవారు ఈ కింది సూచనల్ని గమనించాలి.**

---

★ చతురకు నవలలు పంపేవారు సామాజిక సమస్యలపై దృష్టి పెట్టాలి. హాస్య, వ్యంగ్య తదితర ఏ ఇతివృత్తమైనా ఎంచుకోవచ్చు. ఏ మాండలికమైనా రాయొచ్చు. వైవిధ్య కథా వస్తువులకు ప్రాధాన్యం ఉంటుంది. నవ్యతకే పెద్దపీట.

★ బొమ్మలు, వివిధ శీర్షికలు, ప్రకటనలు పోను 'చతుర' నవల అచ్చులో 80-85 పేజీలు ఉంటుంది. దీన్ని దృష్టిలో పెట్టుకుని రచయితలు తమ నవలల్ని అచ్చులో 85 పేజీలు మించకుండా రాసి పంపాలి.

★ ఒక పాత 'చతుర' సంచిక తీసుకుని అందులో ఉన్న నవలలో ఒకటి లేదా రెండు పూర్తి పేజీలను తమ దస్తూరితో రాసి చూసుకుని ఆ మేరకు తమ నవల రాతప్రతి ఎన్ని పేజీలలో రాయవచ్చో అంచనాకు రావడం సులభం. ఏదేమైనా అచ్చులో 80-85 పేజీలకు మించకుండా లేదా తక్కువ కాకుండా ప్లాన్ చేసుకుని పంపడం మంచి పద్ధతి.

★ ప్రచురణకు స్వీకరించని నవలలు/రచనలు తిప్పిపంపేందుకు వీలుగా స్టాంపులు అంటించిన సొంత చిరునామాగల కవరు జతపరచడం మరువకండి. రాతప్రతులు పోస్ట్‌లో పోతే 'చతుర' బాధ్యత వహించబోదు.

★ స్టాంపులు అంటించిన సొంత చిరునామాగల కవర్లు జతపరచని వారి రచనలు తిరస్కారానికి గురైతే ట్రాష్‌లోకి వెళ్లిపోతాయి. వాటి గురించి ఉత్తరప్రత్యుత్తరాలకు తావులేదు.

★ సాధారణంగా నవలలు కార్యాలయానికి అందిన 4 - 8 వారాలలోగా పరిశీలించి ప్రచురణార్హమైతే ఆ విషయం తెలియపరుస్తాం. కాకుంటే తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రచురితమైన ప్రతి నవలకు రూ. 6000/- పారితోషికం ఉంటుంది. నవల ఏ నెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటి వారంలోనే పై మొత్తానికి రచయితకు చెక్కు అందుతుంది.

★ 'కొత్తగాలి' శీర్షికకు చిరుకవితలు పంపేవారు నాలుగు/ఐదు పంక్తులు మించకుండా పంపాలి. స్పార్క్‌కే మార్కు అన్న విషయం గుర్తించాలి.

**చతుర**


చిరునామా :

ఎడిటర్, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్-500082

# చతుర

సంపుటి -31
సంచిక - 12
జనవరి 2009
372వ సంచిక



సేకరణ : ఎం.కావ్య
ముఖచిత్రం : నివేదిత
ఛాయాగ్రాహకుడు : రాఘువేంద్ర
ముఖపత్రాలంకరణ : రాజుయాట



'నా బిడ్డమీద నా ఛాయ అయినా పడకూడదు' అందామె. అంతేకాదు.. 'మీకు పెళ్లి కాలేదన్నారు కాబట్టి, ఈ బిడ్డను తీసుకెళ్లి పెంచుకోండి' అని అతడిని కోరింది. ఇరవై ఒక్క సంవత్సరాల తర్వాత ఆ బిడ్డనే పెళ్లి కూతురిగా చూసినప్పుడు ఆమె కన్నపేగు కదిలింది.. కానీ అదే అనూహ్య పరిణామాలకు దారితీసింది. ఏమిటా పరిణామాలు?

**సి.యస్.రావు**

## సమాగమం

14 వ పేజీలో

బొమ్మలు: బాలు



ఫిట్‌నెస్ ట్రైనర్ యాస్మిన్ కరాచీవాలాతో

# కాంచన శిల్పం కరీనా

సినీరంగంతో నాలుగు తరాల అనుబంధం ఆమె కుటుంబానిది. ఆమె ముత్తాత, తాత, తండ్రి, తల్లి, సోదరి అంతా ఒకప్పుడు వెండితెర వెలుగులే. ది గ్రేట్ లెజెండ్ అండ్ షోమ్యాన్ రాజకపూర్‌కు ఆమె సాక్షాత్తూ మనుమరాలంటే ఆమె ఎవరో మీకీపాటికే తెలిసిపోయి ఉంటుంది. అవును! కచ్చితంగా ఆమె మీరనుకునే వెండితెర మెరుపు కరీనాకపూరే! ఇరవై ఎనిమిదేళ్ల ఆ ముద్దుగుమ్మ దాదాపు ముప్పై హిందీ సినిమాల్లో నటించింది. నాలుగుసార్లు ఫిల్మ్‌ఫేర్ అవార్డులను దక్కించుకుంది. కభీ ఖుషీ కభీ ఘమ్, చమేలీ, దేవ్, ఓంకార్ తదితర సినిమాల్లో ప్రదర్శించిన నటనకు విమర్శకుల ప్రశంసలు పొందింది. తన అందం, ఆరోగ్యం గురించి ఏం చెబుతుందో చూడండి..

✦ నా శరీర సౌష్టవం, అందం, ఆరోగ్యం వెనుక వ్యాయామ శిక్షకురాలు యాస్మిన్ కరాచివాలా కృషి ఎంతో ఉంది.

✦ ఎవరైనా బరువు తగ్గాలంటే ఆషా మాషీగా కొన్ని తేలికపాటి వ్యాయామాలు చేస్తే సరిపోదు. దానికోసం ఓ పద్ధతి ప్రకారం సీరియస్‌గా వ్యాయామం చేయాలి. నా వరకు ప్రతిరోజూ 100 సూర్యనమస్కారాల్ను, 500 కపాలభట్టీలు చేస్తుంటాను.

✦ వ్యాయామం విషయంలో రాజీపడే ప్రశ్నేలేదు. చాలా నిక్కచ్చిగా ఉంటాను. ముంబైలో ఉన్నప్పుడల్లా జిమ్‌కు వెళ తాను. ఒక్కొక్క అంగానికీ వ్యాయామం కల్పిస్తూ మొత్తం శరీరాన్నంతా అదుపు లోకి తెచ్చుకుంటాను. మా శిక్షకురాలి

ఆధ్వర్యంలో కొన్నిసార్లు అవసరాన్ని బట్టి విభిన్నమైన అంశాలు చేస్తుంటాను.

✦ మీరెలా తయారవ్వాలనుకుంటు న్నారో నిర్ణయించుకుంటే దానికనుగుణంగా సరైన వ్యాయామాన్ని ఎంపిక చేసుకో వచ్చు. అలాగే ఆయావ్యక్తుల శరీర తత్వం, అప్పటి వారి దైహిక స్థితిని బట్టి కూడా తాము చేయాల్సిన వ్యాయామాలు మారు తుంటాయి.

✦ ఆహారపు అలవాట్లలో కూడా ఆయా వ్యక్తులను బట్టి వారు పాటించాల్సిన జాగ్ర త్తలు, నియమాలు మారుతుంటాయి. అందరికీ ఒకే సూత్రం ఉండదు.

✦ ఇక అందానికి వస్తే సహజ సౌంద ర్యంతో తొణికిసలాడేవారిని పనిగట్టుకుని తీర్చిదిద్దాల్సిన అవసరం అంతగా ఉండదు. ఆరోగ్యం, అందం గురించి ప్రతి మనిషీ తప్పకుండా శ్రద్ధ తీసుకోవాలి.

✦ ప్రతిరోజూ రెండుగంటలపాటు జిమ్ లోనే గడుపుతాను. ఎప్పుడైనా బిజీగా ఉండి వెళ్లడం పడకపోతే ఆ తర్వాతైనా ఏదో సమయంలో ప్రయత్నించి జిమ్‌కెళ తాను తప్ప ఎగనామం పెట్టను.

✦ యోగ, ప్రత్యేక ఆహారం మనకెంతో మేలుచేస్తాయి. ముఖ్యంగా లావెక్కే శరీర తత్వం గలవాళ్లు అనేక జాగ్రత్తలు తీసుకోక తప్పదు.

✦ ప్రతి ఒక్కరూ రోజుకు కనీసం ఒక గంట వ్యాయామం చేయాలి. సమతుల ఆహారాన్ని తగినంత మోతాదులో తీసుకోవడం అవసరం.

✦ మా ఆహారనిపుణురాలు రుజుతా దివేకర్ సలహా పాటిస్తూ ఎంతో పరిశ్రమ చేయడంవల్లనే నా ఆకారాన్ని సరైన రీతిలో మలచుకున్నాను.

✦ మా ప్రత్యేక యోగా శిక్షకుడు పాయల్ గిద్వానీ ఆధ్వర్యంలో యోగానభ్య సిస్తూ జీరో సైజ్ సాధించాను.

✦ ఫిట్‌నెస్‌కోసం మనం తినే ఆహా రంలో మాంసపు కృత్తులు, పిండిప దార్థాలు, కొ వ్వులు తగినంత మోతాదులో ఉం డాలి. భోజనా నికీ భోజనానికి మధ్య కొబ్బరి నీళ్లు, పళ్లు తది తర పదార్థాలను తీసుకోవచ్చు.



✦ రెండేళ్లుగా మాంసాహారాన్ని పూర్తిగా మానేశాను. దీంతో నిగనిగలాడే చర్మంతో నాజూకుగా తయారయ్యాను. శాకాహా రంతో సంపూర్ణ ఆరోగ్యం లభిస్తుంది. అలాగే ఎక్కువగా నీరు తాగటం కూడా చర్మానికి మేలు చేస్తుంది.

✦ ఉదయం పరోటా, పెరుగు, పాలు, అరటి పండు తీసుకుంటాను.

మధ్యాహ్నం, రాత్రిళ్లు రోటీ, సబ్జీ, పప్పు తింటాను. రోజులో మధ్యమధ్యలో పెరుగు, సోయా పాలు, మజ్జిగ, సాండ్‌వి చ్‌లు తీసుకుంటాను.

✦ చిరుతిళ్లు తినడం అలవాటు చేసుకో కూడదు. అది చాలా హాని చేస్తుంది.

✦ బరువు తగ్గాలంటే క్యాబేజీలు, ఆపిల్ లాంటివి తీసుకోవచ్చు. జీరో కేలరీల ఆహారంగా పేర్కొనేవాటిని తినడం మంచిది. దీంతో స్థూలకాయ సమస్య ఏర్ప డదు.

✦ ముఖ్యంగా యువత- సినీతారల నుంచి వచ్చే రకరకాల అంశాలు విని తాము కూడా అలాగే ఆహారపుటలవాట్లు పాటించాలనుకుంటారు. గుడ్డిగా ఇతరు లను అనుకరించడం అంత మంచిది కాదు. ఆహారం, వ్యాయామం, ఆరోగ్య సూత్రాలను నిపుణుల పర్యవేక్షణలో చేస్తేనే మంచిది. ఎందుకంటే ఇవి వ్యక్తికీ వ్యక్తికీ మారుతుంటాయి. ©

అపార్ట్‌మెంటాలజీ-12

# శంకరమూర్తి... కారు రిజిస్ట్రేషన్



యర్రంశెట్టి సాయి

(గత సంచిక తరువాయి...)

"అదుగో! ఆయనే మా ఆర్టీఏ.. లంచ్ కెళ్తున్నాడు. కంప్లెయింట్ చేసుకో ఫో"

మేమిద్దరం ఆర్టీఏ దగ్గరకెళ్తూంటే బ్రోకర్ చిరునవ్వుతో ఎదురొచ్చాడు.

"నేను చెప్పాను కద్సార్- ఆఫ్టాల్ అయిదు వేల కోసం చూసుకుంటే పాపం అనవసరంగా బిపి తెచ్చుకుంటారు. ఆ తరువాత డిప్రెషన్- ఆ తరువాత మీలో మీరే మాట్లాడుకోవటం, తిట్టటం లాంటివి మొదలవుతాయ్-"

"అలాగా! నీ మీద కూడా ఆర్టీఏకి కంప్లెయింట్ ఇస్తా- మీ బ్రోకర్స్ వల్లే అసలీ అరాచకాలన్నీ జరుగుతున్నయ్-"

సరిగ్గా అప్పుడే ఆర్టీఏ మా దగ్గరకొచ్చేశాడు.

"గుడ్ మాణింగ్ సార్" అన్నాడు శంకరమూర్తి.

అతను మావంక కూడా చూడకుండా బ్రోకర్‌ని పిలిచాడు.

"ఏమోయ్ నర్సింహా! ఇలారా!"

బ్రోకర్ పరుగుతో ఆయన దగ్గర కొచ్చాడు.

"చూడు నా రూమ్‌లో మా బామ్మర్ది ఉన్నాడు. అతనికి అర్జంటుగా కారు రిజిస్ట్రేషన్ చేయాలి. మనవాళ్ళతో చెప్తే నాలుగు రోజులు న్యూసెన్స్- అందుకని నువ్వే ఆ పనంతాచేసి నీ ఆ మామూలేదో తీసుకో" అన్నాడు తను.

"అలాగే సార్" అన్నాడు బ్రోకర్ వినయంగా.

"ఇంక మనం కంప్లెయింట్ చేయటం అనవసరం" అన్నాన్నేను. ఒప్పుకున్నాడు శంకరమూర్తి

బ్రోకర్ ఆర్టీఏ వెనుకే నడుస్తూ "సార్- ఓ చిన్న రిక్వెస్ట్ సార్"

"ఏమిటది?"

"మా చిన్నాన్న టూరిస్ట్ బస్‌ని మొన్న మన ఆర్టీఏ ఇన్‌స్పెక్టర్ నిజాముద్దీన్ సీజ్ చేశాడు సార్-"

"ఎందుకు?"

"ఒకటే నెంబర్ ప్లేట్‌తో రెండు బస్‌లు తిరుగుతున్నయ్ సార్-"

"రెండు వరకూ నేను పర్మిషనిచ్చాను, గానీ మీరు నాలుగు తిప్పుతున్నారని నిజాముద్దీన్ అంటున్నాడుగా మరి?"

"మైగాడ్ సార్- కొన్నాళ్ళు మూడు

తిప్పిన మాట నిజమేగానీ ఒకటి చెడి పోయి వారం రోజుల నుంచీ గారే జ్‌లో ఉంది-"

"సరే- ఒక నాలుగు లక్షలు తెచ్చి వ్వండి- వదిలేస్తాను"

"రెండు లక్షలు చేసుకోండి సార్"

"నీకు తెలీందేముంది నర్సింహా! రెండు లక్షలు మినిస్టర్ గారికే ఇవ్వాలి"

"సరే సార్- రేపే తెచ్చిస్తాం"

ఆర్టీఏ వెళ్లిపోయాడు.

"ఎంత దారుణం!" అన్నాడు శంకర మూర్తి గుండెలు బాదుకుంటూ.

"ఇంకేం చేస్తాం- పద ఇంటికెళ్ళి రేపు వద్దాం" అన్నాన్నేను.

ఇద్దరం ఇంటికి బయల్దేరాం

కొద్ది దూరం వెళ్ళేసరికి మళ్ళీ అదే కానిస్టేబులూ, ఇన్‌స్పెక్టర్ కనిపించారు రోడ్ పక్కనే.

"స్టాప్" రోడ్డుకడ్డంగా నిలబడి అరిచాడు కానిస్టేబుల్. కారాపాం!

"సార్! ఇది మనం వార్నింగిచ్చినా కూడా ఇంకా కర్నాటక రిజిస్ట్రేషన్‌తోనే తిరుగుతోంది" అన్నాడు హేపీగా.

త్వరలో కోసుకు తినబోయే కోడిని చూసి నట్లు ఇన్‌స్పెక్టర్ మావేపు చూశాడు.

"ఏంటి? లోకల్ రిజిస్ట్రేషన్ అవందే తిరక్కూడదని చెప్పినా కూడా తిరుగుతు న్నారా? "

"నిన్న ఆదివారం కదండీ! ఇవాళే మండే! ఆర్టీఏ ఆఫీసుకే వెళ్ళి వస్తున్నాం!"

"మరి రిజిస్ట్రేషన్ అయిందా? "

"రేపు రమ్మన్నారు సార్ వాళ్ళు"

"అంటే ఇవాళ, రేపూ కూడా ఈ కారేసుకుని తిరుగుతూనే ఉంటారన్న మాట! కమాన్ ఫైన్ కట్టండి!" అన్నాడు రసీదు బుక్ తీస్తూ.

"ఆ? మళ్ళీ ఫైనా? మేము ఫైన్ కట్టింది నిన్నే కదా సార్? "



"చూడు మిస్టర్- నువ్ నిన్న అన్నం తిన్నావా? "

"తిన్నా"

"ఇవాళ? "

"ఇవాళ కూడా తిన్నా"

"మరి ఫైన్ మాత్రం నిన్నకడితే సరిపో తుందా? తియ్.. మూడొందలివ్వు!"

"సార్- వీళ్ళు లంచాలు ఇచ్చే టైప్ కాదంట సార్- వీళ్ళకి రసీదు కావాలంట" కానిస్టేబుల్ మా వేపు కసిగా చూశాడు.

"ఓహో రసీదు కావాలా? అంత బుల బాటంగా ఉంటే తీసుకోండి!" అంటూ బర బర రసీదు రాసి చేతిలో పెట్టాడు.

ఆ రసీదు చూసి శంకరమూర్తి ఉలిక్కిప డ్డాడు.

"ఆ! ఆరొందలు ఫైనా? " అన్నాడు కోపంగా.

"రసీదంటే ఇలాగే ఉంటుంది మరి- కమాన్ కట్టు డబ్బు"

"ఇదన్యాయం సార్"




"నీలాంటి వాళ్ల దగ్గర న్యాయం- ఏం పనికొస్తుంది? కమాన్- డోంట్ వేస్ట్ అవర్ టైమ్"

గత్యంతరం లేక డబ్బు కట్టాం.

"మన పోలీసులు ఎప్పటికయినా లండన్ పోలీసుల్లాగా నీతిగా నిజాయితీగా, పీపుల్ ఫ్రెండ్లీగా తయారవగలరంటావా? " అడిగాడు శంకరమూర్తి దార్లో.

"నన్నడిగితే మన పోలీసులే బెటర్- లండన్ పోలీసులయితే ఆరొందల రూపాయలు కాదు- ఆరొందల పౌండ్లు ఫైన్‌గా వేస్తారు"

మర్నాడు ఉదయమే ఇద్దరం ఆర్టీఏ ఆఫీసుకి చేరుకున్నాం. మా టర్న్ వచ్చాక శంకరమూర్తి డాక్యుమెంట్స్ అన్నీ అతనికి హేండోవర్ చేశాడు.

"ఇది రెసిడెన్స్ ప్రూఫ్- ఇది ఫొటో అయిడెంటిటీ. ఇవి ఫిలప్ చేసిన ఫామ్స్-"

అతనవి చూసి వాటిని మళ్లీ శంకరమూర్తివేపు విసిరాడు.

ఫొటో అయిడెంటిటీ ఓకేగానీ రెసిడెన్స్ ప్రూఫ్ అది పనికిరాదు- ఎన్ఒసి లేదు- సెల్ఫ్ అడ్రస్ ఎన్వలప్ లేదు- అన్నీ కరెక్ట్‌గా తీసుకురండి"

"ఇవి కరెక్ట్‌గా లేవని నిన్న ఎందుకు చెప్పలేదు? " కోపంగా అన్నాడు.

"మీరు నిన్నెందుకు అడగలేదు? "

"అందుకే డాక్యుమెంట్స్‌ని చెక్ చేయమంటే లంచ్‌టైమ్ అన్నారు"

"లంచ్‌టైమ్‌ని లంచ్‌టైమ్ అనక 'టీ' టైమ్ అంటారా? సరే సరే సరే- ఇంతకూ అడ్రస్ ప్రూఫ్ ఇది పనికి రాదు"

"అంటే- ఎందుకు పనికి రాదిది? "

"ఎన్‌క్వయిరీ అక్కడ-"

"ఏంటండీ ఈ న్యూసెన్స్- ఇక్కడికొస్తే అక్కడ అంటారు- అక్కడికెళ్తే ఇక్కడ అంటారు- ఏమంటారు దీన్ని? "

"ఆర్టీఏ ఆఫీసంటారు- నెక్ట్స్"

"సరే ఎన్ఒసి అన్నారు- ఏంటది? "

"చ చ ఛ! ఎన్ఒసి అంటే ఏంటో కూడా తెలీదా? ఏం జనాభారా నాయినా! ఎందుకు పుడతారో తెలీదు"

"చూడు మిస్టర్- ఎవర్నంటున్నావ్? "

"పబ్లిక్‌ని- ఎన్ఒసి అంటే నో అబ్జెక్షన్ సర్టిఫికెట్-"

"ఎవరిస్తారది? "

"ఆర్టీఏ-"

"ఆర్టీఏ ఇదే కదా? "

"కర్నాటకలో ఆర్టీఏ-"

"ఆ! ఒక ఆర్టీఏతోనే ప్రాణాలు పోతుంటే రెండింటితో తలకొరివి పెట్టుకోవాలా? "

"పెట్టుకోవాలి! అది తెచ్చాకే రిజిస్ట్రేషన్-"

"అంటే ఇప్పుడు నేను కర్నాటక ఆర్టీఏ కెళ్ళాలా? "

"వెళ్ళకపోతే మానేయ్-"

" దొరికే వరకూ రిజిస్ట్రేషన్ అవకపోతే-

పోలీసులతో అంతవరకూ ఎలా? రోజు ఫైన్ కడుతూండాలా?

"వాళ్ళకు బాగానే దొబ్బ బెట్టుకుంటారు దొంగనాయాళ్ళు - మేము నా(రూపాయల డిగితే గిలగిలలాడి ఛస్తారు- బాడుకావ్లు"

మా ఇద్దరికి కోపం వచ్చింది.

"ఏయ్ మిస్టర్- ఎవర్నంటున్నావ్? "

"పబ్లిక్‌నండీ! ఇంకెవడ్నంటే ఏ సాలేగా దూరుకుంటాడు? "

నేను శంకరమూర్తితో లోపాయికారీగా మాట్లాడాను.

"చూడు బ్రదరూ! మనం ఇలా గొడవపడుతూంటే- వాడిలా మనల్ని నెలల తరబడి ఆ సర్టిఫికెట్ తీసుకురా, ఇది తీసుకురా- అంటూ తిప్పుతూనే ఉంటాడు. అందుకని ఈసారికి లంచం ఇచ్చేద్దాం-"

"మరి మన ప్రిన్సిపుల్స్ మాటేమిటి? "

"ప్రిన్సిపుల్స్‌ని కొంచెం మారుద్దాం!"

"అంటే ఎలా? "

"లంచాలు మనం తీసుకోవద్దుగానీ- ఇలా తప్పనిసరి డిపార్ట్‌మెంట్స్‌తో పనిపడినప్పుడు ఇద్దాం- ఆర్టీఏ, రిజిస్ట్రార్ ఆఫీసులు, మున్సిపల్ కార్పొరేషన్‌లు, ఎక్సయిజ్‌లు, ఫైర్‌సర్వీస్‌లు, ప్రభుత్వ ఆసుపత్రులు"

"సరే" ఒప్పుకున్నాడు శంకరమూర్తి.

వెంటనే ఇద్దరం ఆ క్లర్క్‌తో మాట్లాడాం.

"చూడండి- ఈ గొడవలేమీ లేకుండా- వెంటనే రిజిస్ట్రేషన్ అయ్యే దారేమయినా ఉంటే చెప్పండి! ఫార్మాలిటీస్ అన్నీ మేము చూసుకుంటాం!"

"మరామాట నిన్నే చెప్తే పోయేదిగా! ప్రతి ఆఫీస్‌కి రెండు గేట్లుంటాయ్. ఫ్రంట్ గేట్- బాక్‌గేట్- మీలాంటి జెంటిల్మెన్ బాక్‌గేట్ ద్వారా రావాలి"

"ఓకే" అని ఇద్దరం బాక్‌గేట్‌ని వెతుకుతూ ఆఫీస్ వెనక్కు వెళ్ళాం. అక్కడ అదే క్లర్క్ మాకోసం ఎదుర్చూస్తూ నిలబడి ఉన్నాడు. మమ్మల్ని చూడగానే చిరునవ్వు



నవ్వాడు.

"ఎంతో కాదు- అఫీషియల్- అనఫీషియల్ అన్నీ కలిపి ఆరువేలివ్వండి! సరిపోతుంది"

ఇద్దరం ఉలిక్కిపడ్డాం-

"ఆరువేలా? కొంచెం కన్సెషన్ ఇవ్వకూడదూ? "

"ఇందులో కన్సెషనేముంటుందండీ! మా షేరు- కర్నాటక ఆర్టీఏ షేరు- అక్కడా ఇక్కడా ఇన్‌స్పెక్టర్ల షేరు- గుమాస్తాలు! ప్యూన్లు, బ్రోకర్లు..."

"హలో-" నేను అడిగింది షేర్‌హోల్డర్స్ లిస్ట్ కాద్సార్- కన్సెషన్"

"ఒక్క పైసా కూడా తగ్గదు- మా దగ్గర అన్నీ ఫిక్స్‌డ్ రేట్లే"

"ఓకే- అయితే తీసుకోండి" అంటూ శంకర మూర్తి ఆరువేలు ఇవ్వబోయాడు.

"అహహా- మంచిగున్నారు సార్- ఇలా



డైరక్ట్‌గా ఇవ్వకూడదు- మన రాష్ట్రం ఇలాంటి విషయాల్లో చాలా స్ట్రిక్ట్! నిఘా కెమెరాలుంటాయ్- త్రూ ప్రాపర్ చానెల్ ఇవ్వాలి-"

"త్రూ ప్రాపర్ చానెల్ అంటే"

"మీ వెనుకే ఉంది- చూస్కోండి"

మేము వెనక్కు తిరిగేసరికి బ్రోకర్ చిరునవ్వుతో ఓ చేతిలో మందుగ్లాసూ, ఇంకో చేతిలో సెల్‌ఫోన్తో కనబడ్డాడు.

"చూశారా సార్- అయిదువేలిమ్మంటే నీలిగారు- ఇప్పుడు ఆరువేలిస్తున్నారు- చాలా సిగ్గుగా లేదూ? "

శంకరమూర్తి నవ్వాడు.

"పిచ్చివాడా! మీ ఆఫీస్‌కి రాకముందు సిగ్గూ, శరం ఉండేది. ఇప్పుడు మొత్తం వదిలేశాము. అయినా నువ్ ఒరిజినల్‌గా అడిగింది అయిదువేలు కాబట్టి అయిదు వేలే ఇస్తాం-"

"ఇప్పుడది హైలెవల్ కెళ్ళిపోయింది గద్వాల్- నేనేం చెయ్యలేను"

నేను జోక్యం చేసుకోక తప్పలేదు- "చూడవోయ్! మేము ఓడిపోయాం. అస్త్ర సన్యాసం చేసేశామనుకో"

వాడు చిరునవ్వు నవ్వాడు.

"భలేవారే సార్! ఓడడానికి మీరెవరు, గెలవడానికి మీరెవరు? ఓడించేవాడినీ, గెలిపించేవాడినీ- అన్నీ నేనే! మన దేశంలోనే కాదు, ప్రపంచం మొత్తంమీద కూరగాయల నుంచీ కాల్‌గాళ్స్ వరకూ.. అంతా మా బ్రోకర్స్ మహాత్మ్యమే!

జర్మన్ సబ్‌మెరైన్లు, స్విస్ రైలింజన్లు, ఫ్రాన్స్ విమానాలు, బోఫార్స్‌గన్స్‌లో- అన్నీ మా బ్రోకరేజ్‌ని బట్టే కొనుగోళ్ళు, అమ్మకాలు జరుగుతూంటాయ్. ఈ సృష్టి రహస్యం తెలుసుకోలేని మీలాంటి అజ్ఞానులెంతోమంది నానా అల్లరి చేసి, చివరకు వాళ్ళే అభాసుపాలయి, అన్యాయం అయిపోతూంటారు. ఇలా ఆఖరుకు అస్త్రసన్యాసం చేస్తారు"

హఠాత్తుగా అతను మందుగ్లాస్ పట్టుకుని శ్రీకృష్ణుడి ఫోజులో నిలబడ్డాడు. అతని నోటివెంబడి శ్లోకం-

"బహూని మేవ్యతీతాని, జన్మాని తవచార్జున!

తాస్యహం వేద సర్వాణి, సత్వం వేత్థపరస్తప!

భూమి తన చుట్టూ తాను తిరుగుతూ సూర్యుని చుట్టూ తిరుగుతోంది. అందువలన చీకటి వెలుగు కలుగుచున్నవి. అంతేగానీ సూర్యునిలో ఏ మార్పు లేదు.

అలాగే నేను నిత్యమై, శాశ్వతమై ఏ మార్పులూ లేకుండా ఉన్నాను. నా ఉనికి అందరికీ నిత్యానుభవమే! సూర్యకాంతిని గుర్తించక వారికే స్వయంగా ఈ కాంతి ఉన్నట్లు భ్రమపడుతున్నారు"

ఆ ఆర్టీప భగవద్గీత వినేసరికి తరించిపోయిన ఫీలింగ్ కలిగింది మాకు. ©

# మంచులో ఐరోపా



ఆసియాలో ఎండలు మండిపోతే వార్త. యూరప్‌లో చలి పెరిగితే వార్త. 1962 డిసెంబర్ నుంచి 1963 మార్చిదాకా యూరప్ ఖండం అంతవరకూ కనీవినీ ఎరగని భయం కరమైన చలిని ఎదుర్కొంది.

బ్రిటన్, ఫ్రాన్స్, స్వీడన్, సిసిలీ, ఇటలీ త దితర అనేక దేశాలు మంచులో కూరుకుపో యాయి. థేమ్స్, రైన్, డాన్యూబ్ లాంటి పెద్ద నదులతోపాటు చిన్నాచితకా నదులు, చెరు వులు గడ్డకట్టుకుపోయాయి. సముద్రపు



అలలు కూడా గడ్డకట్టుకుపోవడంతో ఆ వింత దృశ్యాన్ని చూడటానికి వేలమంది బీచ్ లకు తరలి వెళ్లారు.

మంచు తీవ్రం కావడంతో రవాణా మార్గాలు, వార్తా ప్రసార సౌకర్యాలు స్తంభిం చిపోయాయి. దాంతో పరిశ్రమలకు అందా ల్సిన ఇంధనం, ముడి పదార్థాలు అందక పరిశ్రమలన్నీ మూతపడ్డాయి. మూడురోజుల పాటు రైళ్లన్నీ ఆగిపోయాయి. ప్రయాణికు లకు స్థానికులు తమ ఇళ్లల్లో వసతి ఇచ్చారు. కొన్ని మూతపడ్డ పరిశ్రమల్లో కూడా ఆగిపో యిన రైళ్లలోని ప్రయాణికులు బసచేశారు.

లండన్‌లోని టూరిస్ట్ అట్రాక్షన్ ట్రఫాల్గర్ స్క్వేర్‌లోని ఫౌంటెన్ గడ్డకట్టుకుపోయింది. ఆ అరుదైన దృశ్యం ముందు వందలాది మంది ఫొటోలు తీయించుకున్నారు.

సముద్రపు చేపలపై బతికే నార్వే, డెన్మా ర్క్‌లలో ఆహార సమస్య తలె త్తింది. రోడ్డుప క్కన ఉన్న ఇసుక కుప్పలు కూడా గడ్డక ట్టాయి. దాంతో ముఖ్య కట్టడాలను ఆపడం ఇష్టంలేక ఇసుక కుప్పలకు మంటపెట్టి, అందులో కురిసిన మంచును నీరుగా మార్చుకున్నాక పారలతో చటుక్కున వర్కర్స్ లోపలకు తీసుకెళ్లేవారు. ఆలస్యం చేస్తే మళ్లీ ఇసుక గడ్డకట్టుకుపోయేది. ఒకతను న డుస్తుంటే కాలికింద ఏదో గట్టిగా తగిలింది. తవ్వి చూస్తే మంచుకింద ఓ కారు టాపు బయటపడింది. అందులోని ఇద్దరు మరణిం చారు. డాక్టర్లు కాలినడకనే రోగుల ఇళ్లకి వెళ్లి తగిన మందులు ఇచ్చేవారు. దినపత్రికలు, ఉత్తరాల బట్వాడాలు ఆగిపోయాయి.

డెన్మార్క్‌లో ద్వీపాల మధ్య పడవల బదులు బస్సులు నడిచాయి. గ్రామాలకు హెలికాప్టర్లలో మందులు, ఆహార పదా ర్థాలను సంఘసేవకులు అందజేశారు. ఇక యూరప్‌లోని పావురాలు, ఇతర పక్షులన్నీ ఆ చలికి మరణించాయి. అలాగే మాంసంకోసం పెంచే అన్ని జంతువులూ ఆ చలికి తట్టుకో లేక ఫామ్ హౌసుల్లో మరణించాయి.

అంతటి భయంకర వాతావరణంలో కూడా స్కేటింగ్ ప్రియులు ఆ మంచు మీద స్కేటింగ్ చేస్తూనే ఉన్నారు. రకరకాల బహుమతులు, పోటీలులాంటివి వాళ్లకి వినో దంగా ఉండేవి.

యూరప్‌లోని అన్ని దేశాల్లో కలిపి ఆ శీతాకాలంలో మొత్తం రెండువేల మందికి పైగా చలి బాధవల్ల మరణించారు. ఇళ్లల్లో తక్కువగా, వీధుల్లో ఎక్కువగా ప్రజలు మర ణించారు. కార్లలో మరణించినవారి సంఖ్య వీరిలో అధికం.

ఎండాకాలం వచ్చింది. దాంతో మంచు కరిగి క్రమంగా నదులు, కాలువలు పొంగి పొర్లడంతో మరికొంత జన, ఆస్తి నష్టం సంభవించింది. ఐరోపావాసులు రెండో ప్రపంచ యుద్ధం తర్వాత అధికంగా బాధ లకు గురయింది ఈ చలివల్లనే.

ఒకటీ రెండూ కాదు.. రెండు దశాబ్దాల తర్వాతే శ్రావణికి తన తల్లి ఎవరో తెలిసింది. తన గురించి నలుగురిలో చెప్పుకోలేని ఆ తల్లి దీనావస్థను అర్థం చేసుకుంది. అంతేకాదు.. 'అమ్మంటే ఆమే... త్యాగ మూర్తి, గర్వకారకురాలు' అని అందరి ముందూ ప్రకటించింది. అమ్మని అమ్మ అని చెప్పడానికి వెన కాడనని తేల్చిచెప్పింది. ఈ విషయంలో తాను దేనికీ భయపడనంది. ఆ మాటల పూర్వాపరాలే మిటి? అక్షరాక్షరంలో ఆసక్తిని రేకెత్తించే సుప్రసిద్ధ రచయిత సి.యస్.రావు **సమాగమం** చతుర పాఠకులకు నూతన సంవత్సర కానుక!

# సమాగమం

## సి. యస్. రావు



'సాయంకాలమయ్యింది.

కాలేజీ మెయిన్ హాల్లోని గోడ గడియారం నాలుగు గంటలు కొట్టింది. మెయిన్‌హాల్లో చేరిన బి.ఎ. విద్యార్థులు, ఎం.ఎ. విద్యార్థులు, బి.ఎస్సీ విద్యార్థులు, ఎమ్మెస్సీ విద్యార్థులు వారి వారి స్థానాల్లో కూర్చున్నారు. ఆ హాల్లో కూర్చున్న విద్యార్థుల్లో దాదాపు అమ్మాయిలూ, అబ్బాయిలూ దగ్గర దగ్గరగా సమంగానే ఉన్నారు. ఇద్దరు లెక్చరర్స్ స్టేజి ముందు నిలబడి విద్యార్థులను చూస్తున్నారు. ఏ పక్కనుంచి విద్యార్థులు కాస్త బిగ్గరగా మాట్లాడుతున్నారో అటు చూస్తున్నాడు లెక్చరర్ రంగనాథం. ఆ చూపుల్లో కోపం లేదు. చిరునవ్వుతో గట్టిగా మాట్లాడవద్దనే వినతి ఉంది. ఆయన చూపుతోటే విద్యార్థుల్లోని కలకలం సద్దుమణుగుతోంది. వారందరూ అక్కడ సమావేశమై ఎదురుచూస్తున్నది ఆ కళాశాల ప్రిన్సిపాల్ డాక్టర్ రామకృష్ణ కోసం. డాక్టర్ రామకృష్ణ ఆ కళాశాలకి ప్రిన్సిపాల్ మాత్రమే కాదు. ఆ పట్టణంలోనే మంచి పేరున్న వక్త, పేరున్న వ్యక్తి. విద్యాశాఖలో క్రమశిక్షణకు మారుపేరన్న కీర్తిని గడించుకున్న వ్యక్తి, విద్యార్థులందరికీ ఆయన అంటే భక్తి. స్టాఫ్ అందరికీ ఆయనంటే గౌరవం. వారందరికీ కూడా తమకు తెలిసిన దానికంటే ఆయనకు తెలిసినది ఎంతో ఎక్కువని నమ్మకం. అందుకే ఆయనంటే వారందరికీ గౌరవం.

కాస్త దూరం నుంచి బూట్ల చప్పుడు వినపడింది. ఆ చప్పుడు కాలేజీ స్టూడెంట్స్‌కి, లెక్చరర్లకి కూడా సుపరిచితమే. డాక్టర్ రామకృష్ణ మెయిన్ హాల్లో ప్రవేశించి ఒక్కసారి విద్యార్థులందరి వైపు చూసారు. విద్యార్థులందరూ ప్రిన్సిపాల్ ఎందుకు ఈ సమావేశాన్ని ఏర్పాటు చేసారో, ఏ విషయం గూర్చి మాట్లాడతారో తెలుసుకోవాలని ఎదురుచూస్తున్నారు.

రామకృష్ణ విద్యార్థులందరిని చూసి పలకరింపుగా చిరునవ్వు నవ్వారు. ఎవరితో మాట్లాడినా, ఎవరిని మందలించినా ఆ చిరునవ్వు ఆయన పెదవుల నుంచి దూరంకాలేదు. అది ఆయనకు ఆభరణమే కాదు ఆయుధం కూడా. "వెల్, మైడియర్ స్టూడెంట్స్ అండ్ మెంబర్స్ ఆఫ్ ది స్టాఫ్.. ఐ వెల్‌కమ్ యు ఆల్ ఫర్ దిస్ ఇమ్‌పార్టెంట్, మీటింగ్. గతంలో మనకి అంతర్ కళాశాలల సాంస్కృతిక పోటీలు జరిగేవి. యూనివర్శిటీ స్థాయిలో ఫైనల్స్ జరిగేవి. వాటిలో నాటకాలు, నృత్యాలు, సంగీతం లాంటి పోటీలు జరిగేవి. అది మీకందరికీ తెలుసు. స్టూడెంట్స్ యూనియన్ సలహాదారులుగా వ్యవహరించే లెక్చరర్లు స్టూడెంట్స్‌ని గైడ్ చేసేవారు. శిక్షణనిచ్చేవారు. కాని నేటి పరిస్థితిలో కొంత మార్పు వచ్చింది. ప్రధానంగా సబ్జెక్ట్స్‌కి ఎక్కువ ప్రాధాన్యమిస్తూ, ర్యాంకులకు ఎక్కువ ప్రాధాన్యమిస్తూ, మార్కులకు ఎక్కువ ప్రాధాన్యమిస్తూ మొత్తం మీద ఎకడమిక్ ఎక్సలెన్స్‌కి ప్రాధాన్యం పెరిగింది. ఈ సాహితీ సాంస్కృతిక రంగాల పట్ల విద్యార్థుల ఆసక్తి తగ్గింది.

ఏ మహానుభావుని ఆలోచనో తెలియదు కాని ఒక వినూత్నమైన సాహితీ సాంస్కృతిక కార్యక్రమాన్ని ప్రత్యేకంగా కాలేజీ, యూనివర్శిటీ విద్యార్థుల కోసం రాష్ట్రస్థాయిలో ఏర్పాటు చేశారు. ఇది కార్యక్రమం అనటంకంటే కూడా ఒక పోటీ అనడం సమంజసం. కళాత్మకమైన పోటీ, యువతలోని సృజనాత్మక సామర్థ్యాన్ని వెలికి తెచ్చే పోటీ. ఇది నిజంగా గొప్ప ఆలోచన. నేటి యువతలో ఎంతో క్రియేటివిటీ వుంది. సామర్థ్యం వుంది. దాన్ని వెలికితీసే ప్రయత్నం ఎవరు చేసినా వారిని అభినందించాల్సిందే"

విద్యార్థులలో ఆ పోటీ ఏమిటో అని తెలుసుకోవాలనుకునే కుతూహలం పెరగటంతో అటు అమ్మాయిలలోనూ, ఇటు అబ్బాయిలలోనూ కూడా చిన్న కలకలం బయలుదేరింది. ఆ కలకలం ప్రశాంతంగా ఉన్న కోనేటిలో ఒక పువ్వో, ఆకో రాలితే చిరు అలలుగా వ్యాపించే కలకలం.

ఆ కలకలాన్ని గ్రహించిన రామకృష్ణ "ఆ పోటీ ఏమిటో మీకందరికీ వివరించడం కోసమే ఈ సమావేశాన్ని ఏర్పాటు చేశాను" అన్నారు. హాలంతా నిశ్శబ్దమయ్యింది. "ఈసారి పోటీ కేవలం నాటకాల్లోనో, నృత్యాల్లోనో, లలిత సంగీతంలోనో, శాస్త్రీయ సంగీతంలోనో కాదు. ఈ పోటీలో ఒక వ్యక్తి తనే పాట అల్లుకోవాలి. ఆ పాటను తనకు నచ్చిన ట్యూన్‌లో పాడగలగాలి. ఎందుకంటే పాట రాసేది చదవడం కోసం కాదు, పాడటం కోసం. పాట రాసే రచయిత మనసులో ఓ విధంగా పాడుకుంటూ పాట రాస్తాడు. అక్కడితో పోటీ ఆగిపోలేదు. ఆ పాటకి అనుగుణంగా అభినయిస్తూ నర్తించే నర్తకి కావాలి. ఇదంతా ఆశువుగా జరగాలి. దీనికి రిహార్సల్స్ కాని, ప్రాక్టీసు కానీ ఉండదు. ఇది ప్రాథమిక స్థాయిలో అభ్యర్థులను ఎంపిక చేయటానికి ఇచ్చిన విషయం? "

ఒక అమ్మాయి లేచి "ఇటీజ్ రియల్లీ ఛాలెంజింగ్ సార్ అంది".

"రామకృష్ణ నవ్వుతూనే "అప్పటికప్పుడు పాట ఆశువుగా రాసుకొని పాడటం ఛాలెంజింగా? ఆ పాటకు అనుగుణంగా నర్తించటం ఛాలెంజింగా? " అన్నాడు.

వేణూ లేచాడు. అతను ఎం.ఎ ఫస్టియర్‌లో ఉన్నాడు. "మాత్రాబద్ధంగా పాట రాయటమూ ఛాలెంజింగే. రాసిన పాటను పాడటమూ ఛాలెంజింగే సార్. ఒక కవి గాయకుడు కాకపోవచ్చు కదా సార్" అన్నాడు.

## కొత్తగాలి...

**ఒక్క చేతి కష్టంతో**
**నలుగుర్ని పెంచాడు, నాన్న**
**నలుగురు సంపాదిస్తున్నా**
**ఆయన అనాథాశ్రమంలోనే!**

*-కన్నోజు లక్ష్మీకాంతం, హైదరాబాద్*

రామకృష్ణ వేణుని పరిశీలనగా చూస్తూ "మిస్టర్ వేణూ మీకందరికీ ఓ చారిత్రక సత్యాన్ని చెబుతాను. వాగ్గేయకారుల పేరు విన్నావా ఎప్పుడైనా? " అని ప్రశ్నించాడు.

"విన్నాను సార్, తామే రాసుకుని తామే పాట పాడుకునేవారే వాగ్గేయకారులు" అన్నాడు వేణు.

"గతంలో మన కవులు చాలామంది వారు రాసిన కవిత్వాన్ని వారే శ్రావ్యంగా చదవగలిగేవారు. అందుచేత ఒకరు పాట రాయడం, మరొకరు దానికి స్వరకల్పన చేయటం, వేరొకరు దానిని పాడటం ఈనాడు వచ్చాయి కానీ గతంలో లేవు. అందుకే ఈ ప్రక్రియ ద్వారా ఈనాటి యువతలో ఎందరు వాగ్గేయకారులు ఉన్నారో వెలికితెచ్చే ప్రయత్నమిది"

"నిజంగా గొప్ప ఆలోచన సార్. సమస్య సృష్టిస్తే కదా ఎవరైనా ఆలోచించేది పరిష్కారానికి. ప్రశ్న వేస్తేకదా సమాధానం కోసం వెతికేది" అన్నాడు వేణు.

రామకృష్ణ వేణుని అభినందిస్తున్నట్టుగా చూశాడు. "యూ ఆర్ రైట్" అన్నాడు.

ఆ తర్వాత రామకృష్ణ "ఇది ప్రాథమిక పరీక్ష మాత్రమే. ఇలా కాలేజ్ స్థాయిలో ఎంపికయినవారు యూనివర్సిటి స్థాయి పోటీలో పాల్గొంటారు. ఒకొక్క యూనివర్సిటీ నుంచి ఫస్ట్ అండ్ సెకండ్ టీమ్స్‌ని ఎంపిక చేస్తారు. అలా యూనివర్సిటీలో

ఎంపికయిన బృందాలను హైదరాబాద్ పంపిస్తారు.

రాష్ట్రంలో విశ్వవిద్యాలయాలన్నింటి నుంచీ ఎంపికయిన టీమ్స్ మధ్య ఫైనల్ పోటీ జరుగుతుంది. బహుశ అది రామోజీ ఫిలిం సిటీ ఆవరణలో అను కుంటా. నిష్ణాతులైన న్యాయనిర్ణేతల సమ క్షంలో వివిధ విశ్వవిద్యాలయాల విద్యా ర్థుల మధ్య ఈ పోటీ నిర్వహించి బెస్ట్ టీమ్స్‌ను ఎంపిక చేస్తారు. ఫస్ట్ అండ్ సెకెండ్ టీములకు విలువైన బహుమతు లను ఇస్తారు. పోటీకి ఎంపికైన విద్యార్థుల ఖర్చులన్నీ ఆయా యూనివర్శిటీలు భరి స్తాయి. పోటీలో పాల్గొన్న అన్ని టీము లకు సర్టిఫికెట్స్ ఇస్తారు. విష్ యూ బెస్ట్ ఆఫ్ లక్ మైడియర్ స్టూడెంట్స్" అని సభ ముగించి వేదిక దిగాడు రామకృష్ణ.

రామకృష్ణ వెళ్ళిపోగానే ఆడిటోరియంలో కలకలం బయలుదేరింది. ఎవరిమటుకు వారే చాలా కష్టమైన పోటీ అనుకున్నారు.

★ ★ ★

ఉదయం తొమ్మిది గంటలు కావ స్తోంది. రామోజీ ఫిలిం సిటీ మెయిన్ గేట్‌కి ఇరుపక్కలా రెండు పెద్ద బ్యానర్లు రెపరెపలాడుతున్నాయి. "ఆంధ్రప్రదేశ్ విద్యార్థి కళాకారులకు స్వాగతం, ఆంధ్రప్ర దేశ్ ఉన్నత విద్యాశాఖ" బ్యానర్ ఒక పక్కన ఉంది. మరోపక్క "వివిధ విశ్వవి ద్యాలయాల కళాకారులకు స్వాగతం. హైదరాబాద్ యూనివర్శిటీస్ విద్యార్థి సంఘాలు" అనే బ్యానర్ ఉంది. మధ్యాహ్నం ఒకటిన్నరకు వివిధ యూనివ ర్శిటీల నుంచి వచ్చిన పార్టిసిపెంట్స్ అందరూ డైనింగ్ హాలుకు రావాలని, భోజనాలు అయిన తరువాత రెండు గంట లకు ఆహ్వాన సంఘం అధ్యక్షులు కార్య క్రమం గూర్చి వివరిస్తారని ఎనౌన్స్‌మెం ట్‌లో చెప్పారు.

విద్యార్థులందరూ గబగబా తయారయ్యి భోజనానికి సంసిద్ధమయ్యారు. వారికోసం గైడ్స్‌గా వ్యవహరిస్తున్న హైదరాబాద్ విద్యార్థుల సహకారంతో అందరూ డైనింగ్ హాలుకు చేరుకున్నారు. అందరూ యువతీ యువకులే. ఎంతో ఉత్సాహం, ఏదో తెలి యని ఆనందం. నవ్వులు, కేరింతలు, ఎక్కడా లేని హడావుడి. చాలామందిలో తమను ఎదుటివారు గుర్తించాలనే తపన. అదొక అందమైన పెళ్ళిసందడిలాగా ఉంది. కానీ ఈ సందడిలో పెద్దలు తక్కువ, యువతే ఎక్కువ. ఆ యువతీ-యువకుల కదలికను చూస్తే యవ్వనం ఓ ప్రవాహంలా కదులుతున్నట్టుంది. అందరూ వచ్చి భోజనానికి కూర్చున్నారు. హోస్ట్ చేస్తున్న విద్యార్థి వాలంటీర్లు, హైద రాబాద్ వంటకాల పేర్లు చెబుతూ కొసరి కొసరి వడ్డన చేయిస్తూ తమ తోటి విద్యా ర్థులందరినీ సంతృప్తిగా భోజనం చేయ మని ప్రోత్సహించసాగారు. అందరూ భోజనాలు చేసి ఆడిటోరియంలోకి వచ్చారు.

ఆ సమయంలో ఫుల్ సూట్‌లో ఉన్న వ్యక్తి డయాస్ మీదకు వచ్చి నిలబడ్డాడు. అప్పటిదాకా విద్యార్థులందరికీ ఆహ్వాన సంఘం తరఫున సదుపాయాలు ఏర్పాటు చేసిన రమేష్ డయాస్ మీదకు వచ్చి ఆడి టోరియంలో విద్యార్థులనుద్దేశించి "డియర్ ఫ్రెండ్స్. ఐ నో యు ఆర్ ఆల్ ఈగర్ టు నో ఎబౌట్ యువర్ నెక్స్ట్ ప్రోగ్రామ్. నౌ అవర్ సెక్రటరీ, డిపార్టుమెంట్ ఆఫ్ ఎడ్యుకేషన్, ఆంధ్రప్రదేశ్ గవర్నమెంట్, శ్రీ రమణ, ఐ.ఎ.ఎస్. విల్ అడ్రస్ యు" అన్నాడు తన చేతిలోని మైకు ఆయన చేతికిస్తూ.

రమణ ఉపన్యాసాన్ని ప్రారంభిస్తూ "ఈరోజున మీకు పోటీలు లేవు. రేపు ఉదయం బ్రేక్‌ఫాస్ట్ తరువాత పదిన్నర

# తెలుసుకోవాల్సిన నిజాలివీ!




★ 1890లో విల్ కెయిత్ కెల్లోగ్ తన సోదరుడైన డాక్టర్ జాన్ హార్వే కెల్లాగ్‌తో కలిసి కార్న్‌ఫ్లేక్స్‌ను మొక్కజొన్న విత్తనాలనుంచి కనిపెట్టాడు.

★ తన రచనను టైప్‌చేసి ఎడిటర్‌కు పంపిన తొలి అమెరికన్ రచయిత ఎవరో తెలుసుకుంటే ఆశ్చర్యపోతారు. అతడు విశ్వ



విఖ్యాత హాస్య, వ్యంగ్య రచయిత మార్క్ ట్వైన్. అందుకాయన ఉపయోగించిన టైప్ రైటర్ పేరు రెమింగ్టన్ నెంబర్ 1.

★ సగటున ఓ ఆవు రోజుకు నలభైవేల సార్లు నములుతుంది.

★ పుట్టగానే ముళ్లపందికుండే ముళ్లు ఎంతో మృదువుగా ఉంటాయి. అయితే కొన్నిగంటల్లో అవి గట్టిపడి గుచ్చుకునేలా తయారవుతాయి. ఇలాంటి అద్భుతాలు జీవుల్లో అనేకం ఉన్నాయి.

★ 1998లో సోనీ కంపెనీ పొరపాటున ఏడులక్షల కేమ్ కార్డర్స్‌ను అమ్మింది. దుస్తుల్లోంచి చర్మాన్ని చూడగల ప్రత్యేకత వాటికుంది. అదో సెన్సేషన్ అయింది.

★ సరీసృప ప్రాణి మెదడు బరువు దాని శరీరంలో ఒక్కశాతం.

★ నేడు విస్తృతంగా ధరిస్తున్న బ్రాలకు కప్‌ను తొలిసారిగా ఏ దుస్తుల కంపెనీ వారో కనిపెట్టారనుకుంటే పొరపాటు. వార్నర్ బ్రదర్స్ సినిమా కంపెనీ కాస్ట్యూమ్స్ శాఖ కనిపెట్టింది. అయితే ప్రపంచమంతటా అన్ని బ్రాల తయారీదారులు ఇప్పుడు దాన్ని వాడుతున్నారు.

★ శాన్‌ఫ్రాన్సిస్కోలోని స్ట్రాస్ అండ్ కంపెనీ వారి మ్యూజియంలో 1890లో తయారు చేసిన జీన్స్ పేంట్ ఉంది. జీన్స్‌కు ఇంత చరిత్ర ఉందా అనిపిస్తుంది కదూ!

★ జేమ్స్ ఎకాఫ్ అనే దుస్తుల డిజైనర్ 1930లో నల్లకళ్లజోడును కనిపెట్టాడు.

★ పెన్సిల్‌తో 35 మైళ్ల పొడవుగల గీతని గీయవచ్చు

★ మనదేశంలో పోషకాహార లోపంతో లక్షలాది మంది పిల్లలు ఐదేళ్లలోపే చనిపోతున్నారు. అదే అభివృద్ధి చెందిన దేశమైన అమెరికాలో 1-4 ఏళ్ల మధ్యగల పిల్లల మరణానికి ప్రధాన కారణం కార్లు ఢీకొనడం. వామ్మో.. ఎన్ని ప్రమాదాలు జరుగుతున్నాయో అని నివ్వెరపోవడం ఖాయం కదూ?

★ మొదట్లో కుట్టు యంత్రాలను తమ ఉద్యోగాలు పోతాయన్న భయంతో వర్కర్స్ తగలబెట్టారు.

★ జిగ్సాపజిల్స్‌ను మ్యాపులు తయారుచేసే జాన్ స్పిన్స్‌బరీ కనిపెట్టాడు.

## కొత్తగాలి... 

**అమ్మతనం ముందు**
**కమ్మదనం**
**కోల్పోయింది...**
**అమృతం**

—లోగిశం లక్ష్మీనాయుడు, సింహాచలం

దగ్గరనుంచి ఒంటిగంట దాకా ఒక సెషన్ జరుగుతుంది. మళ్ళీ సాయంత్రం నాలుగు గంటల నుంచీ ఏడున్నర గంటల దాకా రెండో సెషన్ జరుగుతుంది" అని వివరించారు.

విద్యార్థుల్లో నుంచి ఒక అమ్మాయి నిలబడింది.

రమణ ఆమెవైపు ఏమిటన్నట్టు చూశాడు. "ఈ పోటీల స్వభావ స్వరూపాలు ఏంటో కొంచెం వివరిస్తారా సార్? " అడిగిందామె.

"నీ పేరేమిటమ్మా? " అడిగాడు రమణ.

"శ్రావణి సార్. ఆంధ్రా యూనివర్సిటీ స్టూడెంట్‌ని. లా చేస్తున్నాను" అంది.

ఆడిటోరియంలో ఉన్న విద్యార్థులందరూ నిశ్శబ్దంగా రమణ ఇచ్చే వివరణ వినటానికి సిద్ధమయ్యారు.

"ఇక్కడకు వచ్చిన యువతీ యువకులందరూ ఆంధ్రప్రదేశ్‌లో ఏదో ఒక యూనివర్సిటీ స్థాయిలో ఎంపికై వచ్చినవారే కదా. ప్రతి యూనివర్సిటీ నుంచీ ఎంపికై వచ్చిన మీలో రెండ్రెండు టీమ్స్ ఉన్నాయి. ఆశువుగా పాట అల్లుకొని వారే ట్యూన్ కట్టుకొని పాడే టీమ్ ఒకటయితే, ఎటువంటి పాటకైనా ఆశువుగా అభినయిస్తూ నర్తించే టీమ్ మరొకటి. ఈ టీమ్స్‌కి వారి వారి నాయకులుండొచ్చు. అంటే పాడే టీమ్‌లో ఒక ప్రధాన కవి గాయకుడు, ఆడే టీంలో ఒక ప్రధాన నర్తకి. ఇపుడు మొత్తం మనకి వచ్చిన విద్యార్థులలో పాడే టీమ్, నర్తించే టీమ్ ఉన్నాయి కదా. రేపు పోటీ ప్రారంభం కావటానికి ఓ గంట ముందు ఈ టీమ్‌లకు నెంబరు ఇస్తారు. ఉదాహరణకి ఆంధ్ర యూనివర్సిటీ నుంచి రెండు టీమ్‌లు వస్తే పాడే టీమ్‌కి నెంబరు ఒకటి, నర్తించే టీమ్‌కు ఆల్ఫాబెట్ 'ఎ', ఇస్తారు. అలా అన్ని యూనివర్సిటీల్లోనుంచి వచ్చిన పాడే టీములకు నెంబర్లూ, నర్తించే టీములకు ఎ, బి, సి, డి లెటర్స్ ఇవ్వబడతాయి. ఇప్పుడు నెంబర్లు అన్నీ ఒక బాక్స్‌లో వేస్తారు. లెటర్స్ అన్నీ మరో బాక్స్‌లో వేస్తారు. అప్పుడు అసలైన గేమ్ ప్రారంభమవుతుంది. నెంబర్లు ఉన్న బాక్స్‌ని బాగా షేక్‌చేసి ఒక్కో చీటి తీయిస్తారు. అలాగే నర్తించే టీమ్ బాక్స్‌లోంచి ఒక స్లిప్ తీయిస్తారు. పాడేవాళ్ళ టీములోంచి 'త్రీ' వచ్చింది అనుకోండి, నర్తించే వాళ్ళ టీమ్‌లోంచి 'యస్' అనుకోండి. ఈ రెండు గ్రూప్‌లు ఒక టీమ్‌గా ఏర్పడుతారు. ఇప్పుడు నెంబరు మూడు కాకతీయ యూనివర్సిటీలో పాడే టీమ్ కావచ్చు. 'యస్' లెటర్ సెంట్రల్ యూనివర్సిటీలో నర్తించే టీమ్ కావచ్చు. అలా కలిసి పోటీ పడవలసిన టీమ్స్ నిర్ణయించబడతాయి. అందువల్ల ఏ యూనివర్సిటీ టీమ్ ఆ యూనివర్సిటీ టీమ్‌తో కలిసి పాడటం, ఆ పాటకు నర్తించటం జరగదు. ఈ రకంగా వివిధ యూనివర్సిటీ విద్యార్థుల మధ్య ఈ పోటీని నిర్వహించడంతోపాటు ఈ పద్ధతి ద్వారా ఒక సమైక్యతా భావాన్ని పెంపొందించటం, కొత్తవారితో కూడ కలిసి ప్రదర్శన ఇచ్చే ఓ సంఘీభావాన్ని ప్రోత్సహించడం సాధ్యమవుతుంది. ఈ ప్రక్రియ ద్వారా ఈనాటి యువతలో ఉన్న సృజనాత్మక శక్తిని, సమయస్ఫూర్తిని, తక్షణం నిర్ణయం తీసుకునే సామర్థ్యాన్ని వెలికి తీయటానికి ఓ ప్రయత్నం జరుగుతుంది.

ఇలా టీమ్స్ ఎంపిక చేసిన తరువాత లాట్స్‌లో వచ్చిన నెంబరుకు, ఎలాట్ చేయబడిన లెటర్ గల టీమ్‌ని ఒక టీమ్‌గా గుర్తిస్తారు. అంటే నెంబరు 'త్రీ' లెటరుకు 'యస్' జత అవుతుంది. ఇలా చదువుకుంటూ పోతే 'ఒకటి' డి, 'నాలుగు' వై, త్రీ 'యస్' అలా వస్తాయి టీమ్స్. దీంతో ఒక టీమ్‌కి మరో టీమ్ కొత్తే. అనుకోకుండా ఒకే యూనివర్సిటీ టీమ్స్ రెండు వస్తే చెప్పలేముగానీ సాధ్యమయినంత వరకూ పాడే టీమ్‌కి నర్తించే టీమ్‌కి ఒకరికొకరు కొత్తవారే జత అవుతారు. ఇప్పుడు ఇలా ఎంపికైన ఒక్కొక్క టీమ్‌ని ఒక్కొక్క గదిలోకి తీసుకెళ్ళి ఉంచుతారు. మీ దగ్గర ఉన్న సెల్‌ఫోన్స్ తీసేసుకుంటారు" అన్నాడు రమణ.

విద్యార్థులందరూ నవ్వారు.

నవ్వుతూనే మళ్ళీ రమణ వివరణ మొదలెట్టారు. "ఏ విషయం గురించి పాడే టీమ్ తమ పాటను ఆశువుగా అల్లుకోవాలో.. ఆ విషయాన్ని ప్రతి టీమ్‌కి స్టేజ్‌మీదకి వచ్చి ప్రదర్శించబోయే సమయానికి పదిహేను నిమిషాల ముందు మాత్రమే తెలియజేయబడుతుంది. అన్ని టీమ్స్‌కి ఒకే విషయం ఇవ్వబడుతుంది. ఆ విషయం మీదే అన్ని టీమ్స్ పాట అల్లుకోవాలి, అన్ని టీమ్స్ నర్తించాలి. ఏ టీమ్ అయితే విషయం చెప్పారో ఆ టీమ్‌ని పదిహేను నిమిషాలు కాగానే స్టేజీ దగ్గరకు తీసుకువెళతారు. అప్పుడు మరొక గదిలో ఉన్న రెండవ టీమ్ విషయాన్ని వివరిస్తారు. స్టేజి దగ్గరకు వెళ్ళిన మొదటి టీమ్ స్టేజి మీద 'ఫెర్‌ఫార్మెన్స్' ప్రారంభిస్తుంది. పాడటం తదనుగుణంగా నర్తించడం. ఏ పాటా ఏడెనిమిది నిమిషాలు మించి ఉండదు కనుక పదిహేను నిమిషాలలో మొదటి టీమ్ కార్యక్రమాలు అయిపోతాయి. పాట సాగకపోతే అయిదు నిమిషాలలోనే అయిపోవచ్చు. పాటకు తగ్గట్టు నర్తించలేకపోయినా కూడా మధ్యలోనే ఆగిపోవచ్చు. పాట, నృత్యం, సమ ఉజ్జీగా సాగితే ప్రారంభించి అయిదు నిమిషాలు కాగానే సౌండ్ 'డిస్టబెన్స్' లేకుండా వార్నింగ్ రెడ్ లైట్ వెలుగుతుంది. అంటే ప్రదర్శన పూర్తిచేయమని సిగ్నల్.

మరో నిమిషం తరువాత లైట్స్ ఆఫవుతాయి. టైం అయిపోయిందని అర్థం. అయితే మీరు వినియోగించుకున్నా వినియోగించుకోకపోయినా స్టేజీ మీద అవసరమైన ఆర్కెస్ట్రా తదితరాలు ఏర్పాటు చేయబడతాయి. వీటిలో డోలక్, తబల, మృదంగంలాంటి వాయిద్య పరికరాలు.. వీణ, హార్మోనియం, వయోలిన్, గిటార్‌లాంటి స్ప్రింగ్ ఇన్‌స్ట్రుమెంట్స్, కీబోర్డు కూడ వుంటాయి. నా వివరణ మీ అందరికీ అర్థమవుతోంది కదా" అన్నాడు.

వేణు లేచి "చక్కగా అర్థమవటమే కాదు. చాలా ఇంట్రస్టింగ్‌గా కూడా వుంది. నిజంగా ఎంతో ఆలోచించి ఏర్పాటుచేసిన పోటీలా వుంది" అన్నాడు.

"యువర్ గుడ్ నేమ్ యంగ్‌మాన్" అన్నాడు రమణ.

"అయామ్ వేణు. ఎం.ఎ. ప్రీవియస్, ఫ్రం గవర్నమెంట్ ఆర్ట్స్ అండ్ సైన్స్ కాలేజ్, రాజమండ్రి".

మళ్ళీ రమణ వివరణ ప్రారంభించాడు. "అలా ఈ వచ్చిన ఇరవై టీమ్స్ నుంచో లేకపోతే ఎన్ని టీమ్స్ పాల్గొంటే అన్ని టీమ్స్ నుంచి మూడు టీమ్స్ ఎంపిక చేయబడతాయి. ఇంకో విషయం. ప్రదర్శన ఇచ్చేసినవారు.. అంటే పాడినవారు, నర్తించినవారు కూడా ఆడిటోరియంలో కూర్చుని మిగిలిన ప్రదర్శనలు చూడచ్చు. కాకపోతే వారికి తమకంటె ముందు జరిగిన ప్రదర్శనలను చూడ్డానికి మాత్రమే అవకాశం వుండదు. మళ్ళీ విషయానికి వస్తున్నాను.

చివరిగా ఎంపికైన మూడు టీమ్స్‌ను హోటల్‌లో వేరు, వేరు గదులలో పెడ తారు. ఈసారి మొదటి టీమ్‌కి ఒక అర గంట ముందు ఏ విషయాల గురించి పాట అల్లుకుని పాడాలో తెలియచేయబడు తుంది. నర్తించే టీమ్‌కు కూడా. ఇక్కడ మీ అందరికీ ఒక వివరణ అవసరం. ఇప్పుడు ఒక పాటను లలిత సంగీతంలో పాడి సాధారణ అభినయ నృత్యంతో నర్తించడం జరిగిందనుకోండి.. అదే పాటను జానపద రీతిలో పాడితే జానప దరీతిలోనే నర్తించాలి. ఆ తరువాత అదే పాటను శాస్త్రీయ సంగీత బాణిలో పాడితే శాస్త్రీయ నృత్యంలోనే మేళవించాలి" అని ఆగాడు రమణ.

విద్యార్థులలోంచి శ్రావణి లేచి "ఇది నిజంగా గొప్ప సాహితీ సాంస్కృతిక పరీక్ష. ఇంత చక్కటి కార్యక్రమాన్ని ఊహించి రూపుదిద్దిన వారికి ధన్యవా దాలు. ఈ కార్యక్రమాలు రూపుదిద్దిన వారెవరో ఆఖరులోనైనా తెలియజేస్తే వారికి కృతజ్ఞతలు తెలుపుతాం" అంది.

నవ్వుతూ శ్రావణిని చూసి "ఇది ఒక్కరి ఆలోచన కాదమ్మా. కొందరి ఆలోచనాప రుల ఆలోచన. ఈ తరం కోసం ఆ తరం చేసిన ఆలోచన. ఆ తర్వాత ఈ మూడు టీమ్స్‌లోను న్యాయనిర్ణేతల చేత ఎంపికై ప్రథమ స్థానాన్ని గెల్చుకొన్నవారికి, అలాగే రెండు, మూడు స్థానాల్లో నిలిచిన వారికి బహుమతి ప్రదానం ఉంటుంది. ప్రెస్ మీట్ ఉంటుంది. విస్తృతమైన మీడియా కవరేజి వుంటుంది" అన్నాడు రమణ. అందరూ చప్పట్లు కొట్టారు.

సాయంత్రం ఐదు గంటలయ్యింది.

చల్లగాలి పెరిగింది. మీటింగ్ అయిన తరువాత రూమ్స్‌కి వచ్చి కాసేపు విశ్రాంతి తీసుకున్న విద్యార్థి కళాకారులు సైట్ సీయింగ్‌కి సిద్ధమవుతున్నారు. సితార హోటల్ రూమ్స్‌లో ఉన్న విద్యార్థులు కొంతమంది బిలబిలమంటూ కిందకు దిగారు. రమణ అడ్రెస్ చేసిన మీటింగుకు హాజరయిన యువ కళాకారులు అప్పుడే తమ యూనివర్శిటీ టీమ్‌లోని వారితోనే ఉండకుండా ఇతర యూనివర్శిటీ విద్యార్థు లతో కూడా మాటలు కలిపి పరిచయాలు చేసుకున్నారు.

అమ్మాయిలు, అబ్బాయిలూ గమ్మత్తయి న రంగుల్లో కన్పిస్తున్నారు. మారుతున్న రంగులు, వెలుగునీడల్ని వేణు ఆసక్తిగా పరిశీలిస్తున్నాడు. అలా కొంత దూరం నడిచేక ఒక సెలయేటి ప్రవాహం వచ్చింది. సెలయేటి ప్రవాహంలోని నీటి గలగలలు గమ్మతైన శబ్దం చేస్తున్నాయి. వేణు మరికొందరు విద్యార్థులు ఆ సెల యేటిని దాటారు. వారి వెనకే వస్తున్న మరో ముగ్గురమ్మాయిలు చెప్పులతో నీళ్ళల్లో దిగలేక, చెప్పులు విప్పలేక మొత్తం మీద అక్కడక్కడ ఉన్న రాళ్ళమీద అడు గులు వేసుకుంటూ ఒకరికొకరు సహాయప డుతూ సెలయేటిని దాటారు. అలా వస్తున్న వారికి సహాయపడాల్సిన అవ సరం వస్తుందేమోనని ఒడ్డున నిలబడిన వేణు చూస్తూ నిలబడ్డాడు. చివరికి ఒక అడివి పువ్వును చేతబట్టుకొని వేళ్ళ మధ్య తిప్పుకుంటూ అక్కడికి చేరుకున్న శ్రావణి, ఆమె వెనక మరో ఇద్దరబ్బాయిలున్నారు. అబ్బాయిలిద్దరూ సెలయేరుదాటి వేణు పక్కకొచ్చి నిలబడ్డారు. శ్రావణి ఒకతే మిగి లింది. చీర, జాకెట్టుతో అచ్చ తెలుగమ్మా యిలా ముస్తాబై వస్తున్న శ్రావణి చీర కుచ్చిళ్ళు కొంచెం పైకెత్తి పట్టుకొని హైహీల్స్ చెప్పులతో సెలయేరు దాటటా నికి ప్రయత్నిస్తోంది. జారితే పడతానేమో నన్న అనుమానం వచ్చిందామెకి. ఒక్క సారి చుట్టూ చూసింది. అమ్మాయిలూ, అబ్బాయిలూ అక్కడక్కడ నిలబడి ప్రకృతి

## కొండలపై పట్టుచీరలు

కొండలపై పట్టుచీరలు
ఆరేసినట్లున్న
ఈ దృశ్యం చూస్తే మది
పులకిస్తోంది కదూ?
పశ్చిమ, నైరుతి అమెరికా
సంయుక్త రాష్ట్రాల్లోని
కొన్నికొండలు లక్షలాది
సంవత్సరాలుగా
గాలివానలకు
ఎదురు నిలిచి కోతలకు
గురవడం వలన
ఏర్పడిన ప్రకృతి
సౌందర్యాలివి



సౌందర్యాన్ని చూస్తున్నారు. దగ్గరలో వేణుతోపాటు మరో ఇద్దరబ్బాయిలు మాత్రమే ఉన్నారు. శ్రావణి ఒక్క క్షణం ఆలోచించి కాళ్ళకున్న హైహీల్స్ చెప్పులు విప్పి చేత్తో పట్టుకుంది. పువ్వు పట్టుకున్న చేత్తో కుచ్చిళ్ళు పట్టుకొని సెలయేరులో ఉన్న రాళ్ళమీద అడుగువేసింది. అడుగు తడబడింది.

అది చూసిన వేణు రెండడుగులు శ్రావణి వైపు నడిచి 'మే ఐ హెల్ప్‌యూ?' అన్నాడు చెయ్యిచాపి. శ్రావణి అతని కళ్ళలోకి చూసింది. ఏదో కొంటె ఆలోచన వచ్చి 'ష్యూర్' అంటూ తన చేతిలో ఉన్న హైహీల్స్ చెప్పుల జతను అతని చేతికి అందించింది. అతను ఏవిధమైన సంకోచం లేకుండా శ్రావణి చెప్పుల జతను అందుకున్నాడు. ఈ సంఘటన గమనిస్తున్న విద్యార్థినీ విద్యార్థులు ఈలలు వేస్తూ చప్పట్లు కొట్టారు. శ్రావణి తనలో తను నవ్వుకుంది. శ్రావణి అలా నవ్వుతూనే వేణుకి చెయ్యి అందివ్వకుండా ఒడ్డుకు చేరింది. ఒక విద్యార్థి వేణు దగ్గరకు వచ్చి 'మీరు ఆ అమ్మాయికి చెయ్యి అందిద్దామనుకుంటే మీ చేతికి చెప్పులందించింది. అమ్మాయిలు తెలివి మీరిపోయారు గురూ' అన్నాడు.

'మే ఐ హెల్ప్ యూ అంటూ మీరు చేయి చాచినప్పుడు ఆ అమ్మాయి మీకు చెయ్యి అందిస్తుందనుకున్నారు కదూ మీరు' అన్నాడు కొంటెగా మరో అబ్బాయి. ఓ అమ్మాయి గబగబ శ్రావణి దగ్గరకి వచ్చి 'మిస్టర్ వేణు! చీర కట్టుకుని వచ్చిన శ్రావణి ఎంతో నెమ్మదస్తురాలు, మర్యాదస్తురాలు అనుకుంటున్నారు. షి ఈజ్ వెరీ నాటీ! ఏ డ్రెస్సులైనా వెయ్యగలదు... ఎంతమందినైనా ఆట పట్టించగలదు. సాయం చేస్తానన్న మీకు చెయ్యి ఇవ్వటానికి బదులు చెప్పులు ఇచ్చిందంటే ఎంత నాటీయో ఆలోచించండి' అంది.

ఆ మాటకు మరి కొందరు నవ్వారు.

వేణు తనలో తానే నవ్వుకున్నాడు. అందరిని ఒకసారి పలకరించాడు. శ్రావణిని ఒకసారి చూశాడు. శ్రావణి నవ్వుకొని ముఖం తిప్పుకుంది.

"మీరందరూ ఈ సంఘటనని ఎందుకిలా ఊహించుకుంటున్నారో నాకర్థం కావటం లేదు. నేను చెయ్యి చాచింది అవసరమయితే చెయ్యందించి ఆమె పడిపోకుండా సహాయపడి సెలయేటిని దాటించటానికి. రేపు మనందరం పోటీలలో పాల్గొనబోతున్నాం. కాలు బెణికినా, దెబ్బ తగిలినా నృత్యం చెయ్యాలంటే ఇబ్బందే కదా. ఆ అమ్మాయి నా చేతికి చెప్పులిచ్చినందుకు నేనేమి ఫీలవలేదు".

శ్రావణి కూడా సిగ్గుపడింది. అతని పక్కనే నడుస్తూ అతనికే వినిపించేలా "ఐయామ్ వెరీసారీ మిస్టర్ వేణూ" అంది.

"మీరు తప్పు చేశాననుకుంటున్నారా?" అన్నాడు వేణు. అవునన్నట్లు తలూపింది. ఆమె చూపుల్లో పశ్చాత్తాప ఛాయల్ని వేణు స్పష్టంగా చూసాడు.

★ ★ ★

మొదటి టీమ్ స్టేజ్ ఎక్కింది.

న్యాయ నిర్ణేతలుగా ముగ్గురు వ్యక్తులు ప్రత్యేక ఆసనాల్లో కూర్చున్నారు. ఒకరు గీత రచనలో అటు సాధారణ జనాన్ని, ఇటు పండిత జనాన్ని సమంగా మెప్పించి, ఒప్పించగల ప్రతిభాశాలి సుందర రామ్మూర్తి.

రెండవ న్యాయ నిర్ణేత ఎటువంటి గీతానికయినా, అటు సాంఘికమయినా, ఇటు పౌరాణికమయినా, జానపదమయినా చారిత్రకమయినా స్వరకల్పన చేయగల సంగీత దర్శకులు యశోనాథ్.

మూడవ న్యాయ నిర్ణేత నృత్యబాణీలను, కొత్త పోకడలను ప్రవేశపెట్టి ప్రేక్షకులను

ఆకట్టుకుంటున్న అర్జున్.

మొదటి టీమ్ ప్రదర్శన ప్రారంభించింది. ఆ టీంలోని గాయకుడు-

'నీ నవ్వే సిరిమల్లెల జల్లు
నీ చూపే వెన్నెల విల్లు
నీ రూపే హరివిల్లు
నువ్వెవరికోసం దాచేవిన్నాళ్ళు'

అనే పల్లవి పాడాడు. వెంటనే ఆడిటోరియం నుంచి రెస్పాన్స్ వచ్చింది. ప్రేక్షకులు చప్పట్లు కొట్టారు.

న్యాయ నిర్ణేతలు ఒకరి ముఖాలు ఒకరు చూసుకొని ప్రశంసాపూర్వకంగా నవ్వుకున్నారు. తదనుగుణంగా నృత్య కళాకారిణి అభినయంతో నర్తించి జవాబు చెప్పాల్సింది. జవాబు కూడా గాయకుడే రచించి ఇవ్వాలి కదా.. అంటే ఆశువుగా పాడాలి కదా. జవాబు ఏమిటోనని అందరూ బీజియమ్స్ సాగుతుంటే ఎదురు చూస్తున్నారు.

"నా నవ్వులు మల్లెల జల్లయినా
నా చూపులు వెన్నెల విల్లయినా
నా రూపే హరివిల్లయినా
ప్రకృతిలోని అందాలే, స్త్రీ అందాలే
అవి ప్రకృతి అందాలే, వీచేదీ, వేచేదీ
పురుషుని కోసమే
పుణ్య పురుషుని కోసమే'

నర్తకి అదే పాటను అంటూ అభినయిస్తూ నర్తించటంతో ఆడిటోరియం ఎంతో ఉత్సాహంగా ఆస్వాదించింది. ఆ తరువాత అదే పాటను జానపద, శాస్త్రీయ బాణీలలో పాడటానికి ప్రయత్నించినపుడు పాట, ప్రదర్శన కూడా తేలిపోయాయి. ప్రేక్షకులు కళాకారుల ప్రయత్నానికి కొంత వరకూ అభినందించినా తర్వాత ఆస్వాదించలేకపోయారు. ఆ టీమ్ స్టేజీమీంచి దిగిపోయింది.

అయిదు నిమిషాల వ్యవధి.

తరువాత రెండో టీమ్ స్టేజీ మీదకు వచ్చింది. రెండవ టీమ్ జానపద బాణీలో

**కొత్తగాలి...**

**ఏం అంటాం**
**ఏం వింటాం**
**చెడ్డాకే చెప్పింది**
**నిజమనుకుంటాం- కాదా?**

**- ఖమ్రుద్దీన్, కమలాపురం, ఖమ్మం జిల్లా**

ఉన్న జానపదగీతం పల్లవితో ప్రారంభించి మిగిలిన చరణాలు సొంతంగా గాయకుడు అల్లుకొని పాడాడు. నృత్య కళాకారిణి నర్తిస్తూ ప్రేక్షకులను మెప్పించింది.

అదే పాటను లలిత సంగీత బాణీలో గాయకుడు పాడటానికి ప్రయత్నించాడు. నర్తకి తన బృందంతో నర్తించడానికి ప్రయత్నించింది. జానపదంలో వచ్చిన ఊపు లలిత సంగీతంలో రాలేదు. జానపదం జానపదమే అనుకున్నారు ప్రేక్షకులు. శాస్త్రీయ పద్ధతిలో మరీ తేలిపోయింది. అలా ప్రతి అరగంటకీ ఒక టీము చొప్పున ఏడు టీములు వేదికమీదికి వచ్చి ప్రదర్శనలు ఇచ్చారు. వారి వారి శక్తి సామర్థ్యాలు, సమయస్ఫూర్తి ప్రదర్శించారు. నేటి యువతరంలో సృజనాత్మశక్తి ఎంతో వుందన్న విషయం ప్రేక్షకులకు, న్యాయ నిర్ణేతలకు కూడా స్పష్టమైంది.

'ఎనిమిదవ టీము ఆఖరి టీము.. వేణు అండ్ శ్రావణి కాంబినేషన్‌లో వస్తున్న టీము' నిర్వాహకుడు ఎనౌన్స్ చేశాడు.

ఆ టీములో నలుగురే ఉంటారు. వేణుతో మరొకతను రాజా. శ్రావణితో మరొక అమ్మాయి రాణి. నలుగురూ చూట్టానికి అందంగానే ఉన్నారు. ఆటపాటలు ఎలా ఉంటాయో చూడాలని ప్రేక్షకులు తహతహలాడుతున్నారు.

వేణూ వాయిద్యకారులకు ఏదో వివరణ ఇచ్చాడు. వారు సరేనన్నారు. సరళమైన



చక్కటి తెలుగులో అందరికీ తెలిసిన 'పలుకే బంగారమాయెనా' అతని పల్లవి. ఆ పల్లవి ఆధారంగా మిగిలిన చరణాలు ఒక అందమైన భావం వచ్చేలా అల్లుకున్నాడు.

"నువ్వు పలికితే సంగీతం
నీ నవ్వులే జల తరంగిణులు
నీ కదలికలే అలల నడకలు
ఓ లలనా"

అని భావం వచ్చేలా చరణాలు అల్లుకున్నాడు. శ్రావణి ఆ పాటలోని భావానికి అభినయంతో నర్తిస్తూ ప్రేక్షకుల మన్నన పొందింది.

అదే పాటను లలిత సంగీత బాణీ నుంచి మార్చి అక్కడక్కడ జానపద బాణీని అద్ది, 'పలుకే బంగారమాయెనా' అన్న పల్లవికి ముందు 'ఓ బుల్లి, నా వల్లీ నీ పలుకే బంగారమయ్యిందా' అని మొదలుపెట్టి పాట నడకలో వేగాన్ని జొప్పించి పాడాడు. అంతే వేగంగానూ జానపద నృత్య భంగిమలతో శ్రావణి నర్తించింది. ఎక్కడా అధునాతన తత్త్వాన్ని, నాగరికతను రానీయకుండా జాగ్రత్తపడుతూ పమిట కొంగును బిగువుగా నడుముకు



బిగించి మొలలో దోపుకోవటంతో జాన పద నాయకి లక్షణాలు సొంతం చేసుకొం దనిపించింది. అందరూ చప్పట్లు కొట్టారు.

చివరి ఘట్టం అతి క్లిష్టమైన ఘట్టం. శాస్త్రీయ సంగీత నృత్యరీతిలో ఈ పాటను వేణు పాడతాడు. శ్రావణి ఎలా నర్తించబోతోంది అనేది ప్రేక్షకులందరికీ ఎదురైన ప్రశ్న.

వేణు, శ్రావణితో మాట్లాడాడు. తనకు తెలుసన్నట్లు తలూపింది. ఆర్కెస్ట్రావారికి ఏదో సూచనలు ఇచ్చాడు. తనూ తాళం వేస్తూ వివరించాడు. త్యాగరాయ కృతి బాణీలోనే 'పలుకే బంగారమాయెనా' అనే పల్లవికి 'సీతమ్మ తల్లీ' అని కలుపుకు న్నాడు. ఆలాపన చేసి పల్లవి పాడసా గాడు. చక్కటి శాస్త్రీయ సంగీత కచేరీ వాతావరణం చోటుచేసుకుంది ఆడిటోరి యంలో.

మిగిలిన చరణాలలో కూడా అంతే శాస్త్రీయంగా పాడుతూ 'సీతమ్మ తల్లీ నా మొర శ్రీరామునికి విన్పించడానికి నీ పలుకే బంగారమాయెనా' అని అభ్యర్థిస్తూ అన్వయించి ముగించాడు.

ఆడిటోరియంలో అందరూ నిలబడి

చప్పట్లు కొట్టారు.
కార్యక్రమం పూర్తయింది.
న్యాయ నిర్ణేతలు తమ నిర్ణయాన్ని తెలియజేయటానికి ఎంతోసేపు పట్టలేదు. అయిదు నిమిషాల్లో సభ ప్రారంభమయింది. సభలో న్యాయనిర్ణేతలు ఇచ్చిన జడ్జిమెంటు కవరును ఎడ్యుకేషన్ సెక్రటరీ రమణ ఓపెన్ చేసి వివరించేలోపునే ప్రేక్షకుల్లోంచి శ్రావణి, వేణు టీమ్ ఫస్ట్ అన్నారెవరో.
పోటీలో ప్రథమ బహుమతి పొందిన వేణు, శ్రావణిల టీమ్ ప్రెస్‌మీట్‌కు సిద్ధమై కూర్చున్నారు. వివిధ టి.వి. ఛానల్స్, పత్రికల వారు వారిరువురినీ ప్రశ్నలు వేయటానికి సిద్ధంగా ఉన్నారు.
వేణు, శ్రావణిలతోపాటు ఆ టీమ్స్‌లో సహాయకులుగా పాల్గొన్న రాజా, రాణి కూడా వెనుక వరుసలో కూర్చున్నారు. మరోపక్క ముగ్గురు న్యాయనిర్ణేతలు కూర్చున్నారు.
"మీకు కవితలు రాసే అలవాటుందా? " మీడియా ప్రశ్న.
వేణు ఒక్క క్షణం ఆలోచించాడు.
"మా కాలేజీలో కూడా వార్షికోత్సవాలకు, నేనే స్వయంగా పాట రాసుకుని పాడుతూ ఉండేవాణ్ణి. మా తెలుగు లెక్చరర్ మంచి పండితులు. ఆయన పద్య రచనకు కావలసిన ఛందస్సు, పాటకు కావలసిన మాత్రా ఛందస్సు నాకు నేర్పేరు. వచన కవితకు, గీతానికి తేడాలను నేర్పారు" అన్నాడు వినయంగా.
"మీ ఇంట్లో వారి ప్రభావం దీనిమీద ఏమైనా ఉందా? "
"చాలా వుంది. మా తాతగారి ప్రభావమే నా మీద ఎక్కువగా"
"మీ తాతగారి పేరు? "
"వేణుగోపాలరాయుడు!"
"మీ పేరు మీ తాతగారి పేరేనా!"
"అదే కానీ పూర్తిగా కాదు"
"అదేంటి!"
"నా పేరు వేణుగోపాల్ మాత్రమే. నా పేరు చివర రాయుడు లేదు"
"మొరటుగా ఉంటుందనా"
"కాదు వేణుగోపాల్ చివర పొల్లు ఉంటే మంచిదన్నారు"
"రాయుడు అంటే అర్థం" అడిగాడు విలేఖరి.
"రాయి కాదమ్మా రాయుడే వాడు! అని తన తల్లితో తను కలగన్న భీమేశ్వరుని గురించి చెప్పింది ఓ నర్తకి. రాయుడు అంటే మగాడు, మగసిరి పుష్కలంగా ఉన్నవాడనే అర్థమని మా తాతగారు చెప్పినట్టు గుర్తు"
"మీ తాతగారు ఎంతవరకూ చదువుకున్నారు"
"ఆయన 1955 నాటికే గ్రాడ్యుయేట్"
"ఏం ఉద్యోగం చేసి రిటైరయ్యారు"
"ఆయనేం ఉద్యోగాలు చెయ్యలేదు. మా కుటుంబం సంపన్న కుటుంబం కావడంతో మా వూళ్లో ఉన్న వ్యవసాయాన్నే చూసుకున్నారు. మా వూళ్లోనే ఉన్న మా వేణుగోపాలస్వామి ఆలయానికి ధర్మకర్తగా వ్యవహరించారు. ఆ ఆలయంలో జరిగే కార్యక్రమాలకు మా తాతగారి వెంట నేనూ హాజరయ్యేవాడిని. సంగీత కచేరీలు, హరికథా కాలక్షేపం, తోలుబొమ్మలాటలు, పురాణ పఠనం అక్కడ జరిగేవి. అది వినటం మూలంగా ఎన్నో పురాణ గాథలు నాకు తెలిశాయి. అంతేకాకుండా మా తాతగారు భారత, భాగవత, రామాయణాలు రోజూ తనలో తను కాకుండా బయటికి చదివేవారు. నా చిన్నతనం నుంచీ ఆయన కావ్యపఠనం వినటం జరిగింది. అంతేకాకుండా ఆయన గ్రాడ్యుయేట్ కావటంతో ఇంగ్లీషు సాహిత్యంలో కూడా ఆయనకు మంచి పరిచయముంది.

షేక్స్పియర్‌ని కోట్ చేసేవారు. ఆ రకంగా నాకు పునాది మా తాతగారే!"

"మీ నాన్నగారి పేరు"

"సీతారామయ్య"

"అది మీ ముత్తాతగారి పేరా? "

"అంతేగా మరి"

"ఈ బహుమతి వచ్చినందుకు మీకేమ నిపిస్తోంది? "

"ఆనందంగా వుంది. మా తాతగారి ద్వారా నేను ఆకళింపు చేసుకున్న మన సాహితి, సాంస్కృతిక సంప్రదాయాలే నా విజయానికి మూలాలని నేను నమ్ముతు న్నాను.

ఆ తర్వాత మీడియా వారికి సమా ధానం చెప్పడం శ్రావణి వంతయ్యింది.

"మేడమ్ మీ నేటివ్ ప్లేస్ ఏది? "

"ఢిల్లీ"

"ఢిల్లీలో వుంటూ ఇంత చక్కటి నృత్యాన్ని, జానపద నృత్యాన్ని ఎలా చేస్తున్నారు? "

"మేము తెలుగువాళ్ళమే. ఢిల్లీలో సెటిల య్యారు మా నాన్నగారు. పెరిగింది ఆంధ్రాలోనే. సుప్రీం కోర్టు న్యాయవాదిగా ఢిల్లీలో స్థిరపడటం చేత నేను ఢిల్లీలో పెరి గాను. పదవతరగతి తరువాత నా ఎడ్యు కేషన్ అంతా ఆంధ్రాలోనే" అంది శ్రావణి.

"ఎందుకని? "

"మా నాన్నగారు గోదావరి జిల్లా ప్రాంతాల్లో పుట్టి పెరిగారు. తెలుగంటే మా నాన్నగారికి ఇష్టం. ఢిల్లీలో ఉన్నా టెన్త్‌క్లాస్ వరకూ తెలుగు ఒక సబ్జక్టుగా నేను నేర్చుకున్నాను. అక్కడ మన తెలుగు మేనేజిమెంటు రన్ చేసే స్కూల్లోనే చదు వుకున్నాను"

"మీరు ఆంధ్ర యూనివర్సిటీలో 'లా' చదువుతున్నారు కదా ఇప్పుడు"

"అవును"

"మీరు లాయరు కావాలనుకుంటు న్నారా? లేక నృత్య కళాకారిణి కావాలను

**కొత్తగాలి...**

**అభిమానం పంచు**
**సమాజం శ్లాఘిస్తుంది!**
**అసమానత తుంచు**
**సమాజాదరణ లభిస్తుంది!**

**-తోపుగుంట బాబు, నెల్లూర్**

కుంటున్నారా"

"లాయర్ చేస్తూ నృత్యం చెయ్యకూ డదా? లేక నృత్యం చేస్తూ లాయర్ చేయ కుడదా? అలా నిషిద్ధాలేమయినా వు న్నాయా" అంది నవ్వుతూ శ్రావణి.

"అది కాదు. ఈ రెండింటిలోనూ ఏది ఇష్టం. అంటే ఫస్ట్ ఓటు దేనికి? " అన్నాడు విలేఖరి.

శ్రావణి ఓ క్షణం ఆలోచించింది.

"'లా' అభ్యసించటం. లాయరుగా ప్రాక్టీసు పెట్టడం సామాజిక అవసరం. నృత్యం, సంగీతం లాంటి కళలు మానసిక ఉల్లాసానికి, మనోవికాసానికి. చేసేవారికి చూసేవారికి కూడా ఆహ్లాదం కలిగించే ప్రక్రియలు"

"నర్తకిగా గాని, కొరియోగ్రాఫర్‌గా గాని సినిమారంగానికి వెళ్ళే ఉద్దేశం ఉందా? "

"నేను ఇంతవరకు ఆ విషయం గురించి ఆలోచించలేదు. ఆలోచించే అవసరమూ పడలేదు"

"ఒకవేళ అవసరం పడితే"

"అప్పుడు ఆలోచిస్తాను. ఏ వ్యక్తి ఒక్కరు కాదు కదా. ప్రతివ్యక్తి ఓ కుటుంబ సభ్యుడు. ప్రతి కుటుంబం సమాజంలో ఓ యూనిట్. అంచేత ఒక వ్యక్తి ఓ నిర్ణయం తీసుకునేముందు ఇవన్నీ పరిగణనలోనికి తీసుకోవాల్సి ఉంటుంది"

"అంటే మీ నాన్నగారి ఇష్టమా... మీ ఇష్టమా? "

"అఫ్‌కోర్స్ ఇంతవరకూ అంతే"

"పోనీ డాన్స్ స్కూల్ పెడతారా"

శ్రావణి చిరునవ్వు నవ్వింది. మా యూనివర్సిటీ స్థాయిలో నేను ఎంపికై ఈ పోటీలలో పాల్గొనటం చేత ఈ పోటీలలో వేణుగారితో పాటు ఈ ప్రథమ బహుమతి పంచుకోవడం చేత ఈ ప్రశ్నలన్నీ ఉదయించాయి కదా. ఎప్పుడు ఏ పరిస్థితి వస్తుందో, ఏ పరిస్థితులల్లో ఏ ప్రశ్న పుడుతుందో? ఏ ప్రశ్నకి ఏం సమాధానమో కాలమే నిర్ణయించాలి"

"అయితే ఫ్యూచర్ ప్లాన్స్ ఏమీ లేవన్న మాట"

"సర్ మీ మొత్తం ప్రోగ్రామ్, ఇంటర్వ్యూ అంతా నేనే ఫొటోలు తీసాను. ఆ ఫొటోలన్నీ ఆల్బమ్‌లో ఒక ఆర్డరులో పెడితే అది 'ఎ ఫొటో స్టోరీ ఆఫ్ మిస్టర్ వేణు అండ్ మిస్ శ్రావణిల డాన్స్ పర్‌ఫార్మెన్స్ అండ్ ఇంటర్వ్యూ' అవుతుంది. మీరు ఎప్పుడు ఇక్కడ నుంచి ప్రయాణమవుతున్నారో చెబితే ఆల్బమ్ మీకు అందజేస్తాను"

"ఓకే ఎంతవుతుంది!? "

"ఆల్బమ్‌లో ఉన్న ఫొటోలను బట్టి. ఫర్ ఈచ్ ఫొటో పదిహేను రూపాయలు. క్వాలిటీ బాగోలేదనిపిస్తే తీసేయవచ్చు. ఫర్వాలేదు.. రికార్డుకు పనికొస్తుందంటే ఉంచుకోవచ్చు" అన్నాడు ఫొటోగ్రాఫర్.

## కరుణశ్రీ చతురోక్తులు



**క**రుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి జగమెరిగిన మధురకవి. అలతి అలతి పదాల్లో అనల్పార్థాన్ని ఇమిడ్చి చెప్పడంలో మహాదిట్ట. ఏది చెప్పినా చమత్కారంగా చెప్పడం ఆయనకు వెన్నతో పెట్టిన విద్య. ఉదాహరణకు- కవితా లక్షణం ఉండాలే కానీ పద్యం, గద్యం, గేయం.. ఏదైనా ఒకటే అనడాన్ని రమణీమణుల శిరోజ అలంకరణతో పోల్చారాయన. 'ఒకరికి ముడేసుకోవడం ఇష్టం. ఇంకొకరికి విరబోసుకోవడమంటే మక్కువ. మరొకరికి వాలుజడ ప్రీతి. అసలు జుట్టంటూ ఉంటేనే ఏ అలంకారమైనా చేయొచ్చు. అలాగే కవిత్వం అంటూ ఉండాలేగానీ పద్యమైనా గేయమైనా ఏదైనా రాయొచ్చు' అనేవారు.

వేణూ అభినందనపూర్వకంగా నవ్వి "మీరు తీసుకున్న శ్రద్ధకి, పడే శ్రమకు, పైగా మేము ఇక్కడ నుంచి వెళ్ళేలోపలే ఆ ఆల్బమ్ నాకు అందచేయాలనే మీ ఆలోచనకు నేను మీకు ఏమిచ్చినా తక్కువే అవుతుంది. ఆల్బమ్ తయారు చేసి తీసుకు రండి. మీకు రీజనబుల్‌గానే పే చేస్తాను" అన్నాడు వేణు.

"ఉండచ్చు. ఉన్నా అన్నీ మీకు చెప్పాల్సిన పనిలేదు కదా!" అంది నవ్వుతూ.

ప్రెస్‌మీట్ ముగిసింది.

ఇంతసేపూ టి.వి. కెమెరాలు రికార్డు చేస్తూనే వున్నాయి. కెమెరాలు ఫొటోలు తీస్తూనే వున్నాయి.

ఇంటర్వ్యూ హడావుడి పూర్తికాగానే మెడలో ఓ కెమెరాతో ఓ నలభైయేళ్ళ మనిషి వేణు దగ్గరకూ వచ్చాడు.

'థాంక్యూ సర్! రేపు ఎప్పుడు వెళుతున్నారు? '

'సాయంత్రం నాలుగింటికి బయలుదేరుతాం ఇక్కడ్నించి.'

ఇంతలో శ్రావణి కలగచేసుకొని, 'నేనూ అదే బస్సులో వెడతాను. నా ఫొటోలు కూడా ఒక ఆల్బమ్ చేసి ఇవ్వగలరా? ' అంది.

'తప్పకుండానమ్మా' అన్నాడు ఫొటోగ్రాఫర్.

# వృద్ధ క్షురకురాలు

ఫిలడెల్ఫియాలోని హేర్ డ్రస్సర్ లూసీ అమెరికాలోని అతివృద్ధ క్షురకురాలు. 88ఏళ్ల ఆమె పెన్సిల్వేనియా రాష్ట్ర బ్యూటీషియన్ లైసెన్స్‌కోసం గత అరవై ఏళ్లుగా ప్రతి ఏటా 15 డాలర్లు చెల్లిస్తోంది.



ఆమె క్షవరం చేయటానికి ఎనిమిది డాలర్లు తీసుకుంటుంది. 28వ ఏట ఈ వృత్తిలోకి వచ్చాక మళ్లీ అందులోంచి విరమించుకోలేదు. ఆమె దగ్గరికి వచ్చేవారు కూడా వృద్ధులే. వారి వయస్సు 65నుంచి 92 ఏళ్లదాకా ఉంటుంది. ఆమెకు ముని మనవరాళ్లు కూడా ఉన్నారు. 1940నుంచి ఒకేచోట అవే పరికరాల్ని ఉపయోగిస్తూ ఫిలడెల్ఫియాలో క్షవరశాలని నిర్వహిస్తోంది. ఆమె ఖాతాదారులు దాదాపు యాభై మంది దాకా ఉన్నారు. వారిలో పద్నాలుగు మంది తరచూ పనిలేకపోయినా కాలక్షేపానికి ఆమె సెలూన్‌కు వచ్చి కబుర్లలో పాల్గొంటారు. ఓ జర్నలిస్టు లూసీని ఇంటర్వ్యూ చేస్తూ, "ఇంత లేటు వయసులో కూడా ఎందుకు పనిచేస్తున్నారు?" అని అడిగితే ఆమె ఇచ్చిన జవాబిది- "దీనికి అనేక కారణాలు ఉన్నాయి. నా మెడికల్ ఇన్సూరెన్సు ప్రీమియం కట్టటానికి నా లాంటి వృద్ధురాలికి డబ్బులు ఎక్కడినుంచి వస్తాయి? ఎంతోకొంత సంపాయిస్తుంటే ఆత్మగౌరవంతో ధైర్యంగా తలెత్తుకుని బతికేందుకు సాధ్యమవుతుంది. నాకు చేతనయినంత వరకూ పని చేయాలనుకున్నాను. అంతేకాకుండా నేను ఈ వృత్తినుంచి విరమించుకుంటే నా ఖాతాదారులు మాట్లాడే గాసిప్‌ను కోల్పోతాను. పైగా నా ఖాతాదార్లు నాకు అలవాటుకావడంతో పనిచేయించుకోవటానికి నన్నే కోరుకుంటున్నారు" అంటుందామె.



## కొత్తగాలి...

**కలవడానికి మూడు ముళ్లు**
**బతకడానికి**
**నాలుగురాళ్లు**
**జీవితానికి**
**పునాదిరాళ్లు**

– యం.లక్ష్మణరాజు, తాడేపల్లిగూడెం

'ఎంతవుతుంది?' అంది శ్రావణి.

ఫొటో గ్రాఫర్ సమాధానం చెప్పేలోపే "మీరు మా ఇద్దరి ఆల్బమ్స్ తయారుచేసి తీసుకురండి. పేమెంట్ రేపు డిసైడ్ చేసి పే చేస్తాం" అన్నాడు వేణు.

ఆ ధైర్యంతో ఫొటో గ్రాఫర్ 'ష్యూర్ సార్' అంటూ వెళ్ళిపోయాడు.

'కొంటెవాడే' అనుకుంది శ్రావణి తనలో.

★ ★ ★

వేణు తన సూట్‌కేస్‌తో వచ్చి బస్సు ఎక్కేడు.

ఆ వెనకే శ్రావణి, రాణి వచ్చి బస్సె క్కేరు.

శ్రావణి వేణుని చూసి నవ్వింది.

వేణూ నవ్వి రాణితో 'మీ రాజా ఎక్కడ?' అన్నాడు నవ్వుతూ

రాణి నవ్వుతూనే 'మా రాజా ఏమిటి? రాజా మీ టీమ్ అయితే మీ రాజా అవుతాడు. లేకపోతే మనరాజా అవుతాడు' అంది రాణి.

'మీరు భలే సరదాగా మాట్లాడతారే' అన్నాడు వేణు.

'నేను పాడగలను కూడా. మీకు పోటీ ఎందుకని పాడలేదు' అంది రాణి కొంటెగా నవ్వుతూ.

'పాడాల్సింది మరి. మీరు పాడితే నే ఆడేవాడిని' అన్నాడు.

వస్తున్న నవ్వును ఆపుకుంటూ 'ఈ ప్రోగ్రామ్ సికింద్రాబాద్ ఫ్లాట్‌పామ్ నెం. ఒకటిలో ఏర్పాటుచేస్తే జనం అంతా చూస్తారు కదా' అంది శ్రావణి.

అందరూ నవ్వుకున్నారు.

'నైస్ ఐడియా అలా చేద్దామా?' అన్నాడు వేణు, రాణి కళ్ళలోకి సూటిగా చూస్తూ.

'మా లీడర్ పర్మిషన్ ఇవ్వాలికదా' అంది రాణి శ్రావణిని ఓరకంట చూస్తూ.

శ్రావణి రాణి తొడమీద ఒక దెబ్బవేసి కావాలంటే బస్సులో మొదలెట్టు అంది.

చెమటలు కక్కుకుంటూ ఫొటోగ్రాఫర్ బస్సుడోర్ దగ్గర 'ఈ బస్సులో వేణుగారు ఉన్నారా అండీ?' అన్నాడు.

రాణి 'లేరండీ' అంది ఆటపట్టిస్తున్నట్లుగా, వేణూని చూస్తూ

'పోనీ శ్రావణిగారు ఉన్నారా అండీ'

'వేణూగారు ఉన్న బస్సులోనే వుంటారు' అంది రాణి.

'ఇద్దరూ ఉన్నారు.. రండి' అంది శ్రావణి ఎదురుగా డోర్ దగ్గర ఉన్న ఫొటో గ్రాఫర్‌తో.

ఆత్రుతగా ఉన్న ఫొటోగ్రాఫర్ శ్రావణీ, వేణూ బస్సులోనే ఉన్నారన్న వార్తవిని కర్చీఫ్‌తో మొఖం తుడుచుకుంటూ బస్సు లోకి వచ్చాడు.

ఎదరసీట్లో ఉన్న వేణుని చూడగానే ఫొటోగ్రాఫర్‌కి ప్రాణం లేచివచ్చింది.

'మీ బస్సు బయలుదేరే టైమ్‌కి ఆల్బమ్స్ ఎలాగైనా అందచెయ్యాలని, ఖాళీవికాదు.. మీమీ ఫొటోలు పెట్టి అందచేయాలని రాత్రంతా నిద్దురపోకుండా కడిగి, ప్రింట్స్ వేసి, ఫాన్ దగ్గర ఆరబెట్టి అవి ఆరేలోపున ప్రొద్దున్నే ఆల్బమ్స్ కొనితెచ్చి, మీమీ ఫొటోలు పెట్టి, సిటీ నుంచి ఈ స్టూడియోకి బయలుదేరి ఇప్పటికి చేరుకున్నాను. మీ బస్సు వెళ్ళిపోయిందేమోనని ఒకపక్క భయం. బస్సు కదిలేలోపు మిమ్మల్ని చేరాలని ఆత్రుత. మొత్తం మీద

కనపడ్డారు. బి.పి. నార్మల్‌కి వచ్చేసింది' అని ఆగాడు గాలిపీల్చుకుంటూ ఫొటోగ్రాఫర్.

'ఈ సంగీత, సాహితీ, సాంస్కృతిక పోటీలలో ప్రథమ బహుమతి పొందిన శ్రావణి, వేణూల ఫొటో ఆల్బమ్ తయారీ కథాసంగ్రహం ఎట్టిదనిన.. ఇట్టిదన్న మాట' అన్నాడు వేణూ ఫొటోగ్రాఫర్‌తో. అందరూ నవ్వుకున్నారు అతడు చెప్పిన పురాణగాథా ప్రవచనానికి.

'అవును మహానుభావా' అంటూ రెండు ఆల్బమ్స్‌లు వేణు చేతిలో పెట్టాడు ఫొటోగ్రాఫర్.

రెండు ఆల్బమ్స్‌ది ఒకటే సైజ్. ఒకే కవరు. కవరు మీద డిజైన్‌కూడా ఒక్కటే. మారిపోతే ఎవరి ఆల్బమ్ ఏదో గుర్తుపట్టలేనట్లు ఒకేవిధంగా ఉన్నాయి.

వేణూ తన జేబులోంచి ఇరవైఅయిదు వందలు తీసి ఫొటోగ్రాఫర్‌కి ఇచ్చాడు.

ఫొటోగ్రాఫర్ సంతోషించాడు. ఒట్టి బోళామనిషి.

వేణు, శ్రావణి విడివిడిగా ఆల్బమ్స్ తిరగేస్తూ ఫొటోలు చూడసాగారు. నిన్నటి ప్రదర్శనలోని సన్నివేశాలు చూస్తున్నప్పుడు ఆ జ్ఞాపకాలు వారిరువురిని ముసిముసి నవ్వులు నవ్వించాయి. బస్సు కదిలింది.

★ ★ ★

'కంగ్రాట్స్ మిస్టర్ వేణూ', అంటూ షేక్‌హ్యాండ్ ఇచ్చి భుజంమీద చెయ్యివేసి ఆప్యాయంగా వేణుని తనతో ఛాంబర్‌లోకి తీసుకెళ్ళాడు ప్రిన్సిపాల్ రామకృష్ణ.

వేణుకి తను గెల్చుకున్న కిరీటం కంటె తమ ప్రిన్సిపాల్ అభినందన ఎంతో ఆనందాన్ని, అనుభూతిని కలిగించింది. జవాబు చెప్పకుండా ఆయన ముందు నిలబడ్డాడు. కూర్చోమన్నా కూర్చోలేదు. తను తెచ్చిన బ్రీఫ్‌కేసు తెరిచి, తను గెలుచుకున్న కిరీటాన్ని ఆయన ముందు పెట్టాడు. ఆల్బమ్‌ని కూడా ప్రిన్సిపాల్ ముందు పెడుతూ 'ప్రోగ్రామ్ తాలుకూ ఫొటోగ్రాఫ్స్ సార్' అన్నాడు వినయంగా.

రామకృష్ణ కిరీటాన్ని తన చేతుల్లోకి తీసుకొని వేణు ముఖంలోకి చూసాడు.

వేణు మెరిసే కళ్ళతో ఒక్కసారి రామకృష్ణ ముఖంలోకి చూసి కనులు వాల్చి నిలబడ్డాడు.

తన చేతిలోకి తీసుకున్న కిరీటాన్ని రామకృష్ణ వేణు శిరస్సుకు అలంకరించాడు. వేణు రెండు భుజాలు పట్టుకొని అతని మొఖంలోకి చూసి దగ్గరికి తీసుకుని కౌగిలించుకున్నాడు రామకృష్ణ.

'ఐ అండ్ అవర్ కాలేజ్ ఈజ్ ప్రౌడ్ ఆఫ్ యూ, మైడియర్ యంగ్ మాన్!' అన్నాడు.

వేణు కళ్ళలో ఆనందబాష్పాలు ఉప్పొంగాయి.

రామకృష్ణ పరిస్థితికూడా అదే.

గురుశిష్య సంబంధానికి, అనుబంధానికి, ఆప్యాయతకు ప్రతీక ఆ సమాగమం.

శిష్యుని విజయాన్ని తన విజయంగా ఆనందించే మాధుర్యాన్ని ఆ క్షణంలో రామకృష్ణ పొందాడు. అనిర్వచనీయమైన ఆనందంతో వేణు ఎంతో వినయంతో ఒదిగిపోయి నిలబడ్డాడు ఆయన ముందు.

"సాయంత్రం మీటింగ్ హాల్లో మనం కలుద్దాం. నీ క్లాసుకు వెళ్ళు ఈ కిరీటం, ఆల్బమ్ నా దగ్గర వుంచు" అన్నాడు రామకృష్ణ.

థాంక్యూ సర్ అని జేబులోంచి కర్చీఫ్ తీసి కళ్ళు ఒత్తుకొని నవ్వుతూ వెళ్ళిపోయాడు వేణు ప్రిన్సిపాల్ గదిలోంచి.

ఇటువంటి ఆహ్వానమే లా కాలేజీ ప్రాంగణంలో శ్రావణికి లభించింది. శ్రావణి తన ఆనందోద్వేగాలను మనసులో దాచుకోలేకపోతోంది. తన కిరీటం,

# 'చతుర'తో అనుబంధం మధురం



సి.యస్.రావు

'చతుర' విజయప్రస్థానం నా నవల 'కమలమ్మ కమతం'తో మొదలవడం ఇప్పటికీ తీపి గుర్తే. నాడు '78 ఫిబ్రవరి జ్ఞాపకం నేటికీ నా మనసులో తాజాగానే అన్పిస్తుంది. ఇప్పటి ఈ 'సమాగమం' ఆరోది. ఇంతకుమునుపు 'రవళి', 'ప్రేమ మజిలీలు', 'శివగంగ' తదితర నవలలొచ్చాయి. సినీ, టీవీ, రంగస్థలాలకూ సేవలందించిన అనుభవం ఉంది. ఇంతవరకు 15 పైగా నవలలు, 100 దాకా కథానికలు పలు పత్రికల్లో వచ్చాయి. ఆకాశవాణికి పాతిక, స్టేజీకి ఇరవై, చిన్నితెరకు పదిహేను నాటకాలు రాశాను. కొన్ని సినిమాలకు దర్శకత్వం వహించాను, నటించాను, కథలు-సంభాషణలు అందించాను. జాతీయ చలనచిత్ర అభివృద్ధి సంస్థ స్క్రిప్టు ప్యానల్ సభ్యుడిని. రచయితలు, కళాకారులు ఏం మాట్లాడినా, ఏది రాసినా, ఎటువంటి ప్రయోగం చేసినా జనంలో అది ఆలోచన పెంచేదిగా ఉండాలని నమ్ముతాను.

చిరునామా: సి.యస్.రావు
409- మంజరి అపార్ట్‌మెంట్స్
రాజ్‌భవన్ రోడ్, సోమాజీగూడ
హైదరాబాద్-82

ఆల్బమ్‌ను కాలేజీకి తీసుకువచ్చినా, ఆల్బమ్‌ను మాత్రం లేడీస్ వెయిటింగ్ రూమ్‌లో దాచి, కిరీటాన్ని ప్రిన్సిపాల్‌కి చూపించింది.

'మీ ప్రోగ్రామ్, ప్రెస్‌మీట్‌లను టీవీ ఛానల్స్‌లో చూసాం శ్రావణి' అన్నాడు ప్రిన్సిపాల్.

'మై హార్టీ కంగ్రాచ్యులేషన్స్. టైమ్ చూసుకుని నిన్ను వి.సి. దగ్గరకు తీసుకు వెళతాను. బైదిబై నీ పక్కన పాడిన ఆ సింగర్...'

'మిస్టర్ మేణూ ఫ్రమ్ గవర్నమెంట్ ఆర్ట్స్ కాలేజ్ రాజమండ్రి'

'వెరీనైస్, చాలాబాగా పాడాడు'

'హైలీ టాలెంటెడ్ సార్. ఆయన ఆశువుగా అల్లుకున్న పాటది'

'ఓ రియల్లీ ఫెంటాస్టిక్. మీ ప్రోగ్రామ్ ఎవరైనా రికార్డు చేశారా' అన్నాడు ప్రిన్సిపాల్.

'చేసేవుంటార్ సార్'

'ఏం లేదు సీడీ వుంటే టోటల్ ప్రోగ్రామ్‌ను మన స్టూడెంట్స్ అందరూ చూస్తారు కదా!'

ఆల్బమ్ వుందని చెబుదామని నోటి చివరదాకా వచ్చింది శ్రావణికి. కానీ అనలేదు. ఆల్బమ్ ఏదో తను గెల్చుకున్న కిరీటం కన్నా అపురూపంగా అనిపిస్తోంది శ్రావణికి. తనదిలా అనిపిస్తోంది. తనే మళ్ళీ మళ్ళీ చూసుకోవాలనిపిస్తోంది.

ష్యూర్ సర్, థాంక్యూ వెరీమచ్ అని చెప్పి ప్రిన్సిపాల్ గదిలోంచి తన కిరీటాన్ని తీసుకొని లేడీస్ వెయిటింగ్ రూంలోకి వచ్చింది. అప్పటికే అక్కడ ఉన్న అమ్మాయిలు శ్రావణి షెల్ఫ్‌లో దాచిన ఆల్బమ్‌ను తీసి ఒకొక్క పేజీని తెరిచి రకరకాల కామెంట్లు చేస్తూ వేణు, శ్రావణిల ఫొటోలు చూస్తున్నారు. నవ్వుకుంటున్నారు. కేరింతలు కొడుతున్నారు. లేడీస్ వెయిటింగ్ రూమ్ అల్లకల్లోలంగా ఉంది.

శ్రావణి పరుగులాంటి నడకతో వాళ్ల దగ్గరికి వెళ్లి ఆ ఆల్బమ్‌ను లాక్కుని 'నలిగిపోతుందర్రా' అంటూ మూసి గుండెలకు

హత్తుకుంది.

ఒకమ్మాయి 'నలిగిపోయేది ఆల్బమా లేక అందులో ఉన్న అబ్బాయా? మరి అంత గట్టిగా కౌగిలించుకోకు.. పాపం ఆ అబ్బాయికి ఊపిరి ఆడదు' అంది ఆట పట్టిస్తున్నట్టుగా. అమ్మాయిలందరూ నవ్వారు.

'ఫొటోలు చాలా బాగున్నాయి' అంది ఇంకో అమ్మాయి.

'అంటే మా పర్‌ఫార్మెన్స్ బాగాలేదనా?' అంది కొంచెం కోపంగా.

'పర్‌ఫార్మెన్స్ బాగా లేకపోతే నీనెత్తిన అబ్బాయి నెత్తిన కిరీటాలు ఎందుకు పెడతారు? టి.వి.లో చూశాంలే. ఒకరికొకరు తీసిపోకుండా పోటీపడ్డారు. సరిలేరు నీకెవ్వరూ -అన్నట్టు నీ చూపులంటుంటే, సరిరారు నీకెవ్వరూ- అన్నట్టు అతనిపాటుంది. అందుకే రక్తికట్టింది. ఇద్దరూ కలిసి ప్రైజ్ కొట్టారు. పోన్లే, కాని అడ్రస్సు, ఆటోగ్రాఫ్ లాంటివి తీసుకున్నావా?' అంది ఇంకో అమ్మాయి.

'మీకు ఇంకేమీ పని లేదా?' అంది శ్రావణి

ఇంతలో బెల్ మోగింది.

'పదండి టైమ్ అయ్యింది క్లాస్‌కి' అంటూ శ్రావణి ఆల్బమ్‌తో సహా వెళ్లబోతుంటే 'పద పద ఈ పీరియడ్‌ని ఆల్బమ్ సెషన్ చేద్దాం' అంది అదే అమ్మాయి.

అలా తమ కాలేజీలో వేణు, శ్రావణి కాలేజీలో శ్రావణి నాలుగైదు రోజులపాటు లెక్చరర్ల నుంచి, తోటి స్టూడెంట్స్ నుంచీ అభినందన పరంపరలు పొందుతూనే ఉన్నారు. విడివిడిగా ఒక్కరే ఉన్నప్పుడు గతానుభూతుల్ని ఎవరికివారు తమలో తల్చుకుంటూనే ఉన్నారు. మనసు తెరపై చూసుకుంటూనే ఉన్నారు. ఇద్దరూ చేసిన పొరపాటు ఒక్కటే. వారిద్దరికీ ఎవరెవరు ఏ కాలేజీలో చదువుతున్నారో తెలుసుకానీ ఇంటి అడ్రస్సులు కానీ, సెల్ ఫోన్ నెంబర్లు కానీ ఒకరికొకరు ఇచ్చి పుచ్చుకోలేదు. ఇంతలో వేసవి సెలవులు వచ్చాయి.

## 2

**వే**ణు ఆటోలో తన సూట్‌కేస్‌తో తమ లోగిలి ముందు దిగి, మెట్లెక్కి హాల్లోకి అడుగు పెట్టాడు. అతడ్ని కచేరీ బల్లమీద నున్న ఓ బస్తాను ఎత్తుకో పోతున్న చంద్రయ్య చూశాడు. చంద్రయ్యా చాలా కాలం నుంచీ ఆ ఇంటినౌకరు. వేణు తండ్రి వయసుకంటే నాలుగైదేళ్లు ఎక్కువే. పని చేయడానికి వీలుగా బిగించి కట్టుకున్న పంచె, దానిపై గుడ్డ బనీను, తలకి చుట్టుకున్న గళ్లతువాలు.. ఇదీ చంద్రయ్యా ఆహార్యం.

ఎదురుగా నిలుచున్న వేణుని చూసి ఆయన ముఖం వికసించింది.

'పెదబాబుగారూ.. చినబాబు వచ్చాడు. అమ్మగోరూ.. వేణుబాబూ వచ్చేసాడు' అంటూ లోగిలిలో మారుమూల ఉన్న వారికి కూడా వినిపించేలా పిలిచినట్టు అరిచాడు చంద్రయ్య. ఆయన ఆప్యాయతకు, హడావుడికీ వేణు నవ్వుకున్నాడు.

'బాగున్నావా చంద్రయ్య తాతా' అన్నాడు వేణు.

'బాగున్నాను బాబు. తమరే చిక్కిపోయారు' అన్నాడు చంద్రయ్య.

ఇంతలో చంద్రయ్య అరుపు విని వేణు తల్లి సీతాదేవి, తండ్రి సీతారామయ్య, మరో గదిలోంచి తాత వేణుగోపాల రాయుడు, నానమ్మ వరలక్ష్మి, చెయ్యి తుడుచుకుంటూ పనిమనిషి రాములమ్మ హాల్లోకి వచ్చారు.

వేణు వచ్చాడంటే అందరికీ ఆనందమే.

వేణుగోపాలరాయుడికి తన మనవుడు వంశోద్ధారకుడు వచ్చాడంటే ఎనలేని ఆనందం. తనపేరు నిలబెట్టేవాడనే గర్వం. వేణుని ముందుగా పలకరించింది తల్లి సీతాదేవి.

'బాగున్నావా నాన్నా' అందామె. వేణు చిన్నతనం నుంచీ 'ఏరా, ఒరేయ్' అని ఆమె పిలవలేదు అది తమ మామగారి పేరని. ఎప్పుడూ నాన్నా అనో, కన్నా అనో పిలిచేది.

'బాగున్నానమ్మా' అంటూ వేణు తల్లి దగ్గరకు వెళ్లగానే సీతాదేవి తనకంటే ఎత్తుగా ఉన్న కొడుకుని తృప్తిగా చూసుకొని ఒకసారి భుజాలు తడిమింది.

'వస్తున్నానని ఫోన్ చెయ్యకపోయావా తాతా.. చంద్రయ్యా స్టేషనుకు వచ్చేవాడుగా? ' అన్నాడు వేణుగోపాలరాయుడు.

'ఎందుకు తాతా సూట్ కేస్ ఒక్కటే కదా. స్టేషన్ దగ్గర ఆటోలు వున్నాయి. అందుకే ఫోన్ చెయ్యకుండా వచ్చేసాను తాతా' అన్నాడు వేణు.

'సరే లే, తర్వాత మాట్లాడుకోవచ్చు. వెళ్లి స్నానం చేసి బట్టలు మార్చుకో టిఫిన్ చేద్దువుగాని' అంది నానమ్మ వరలక్ష్మి.

తండ్రి సీతారామయ్యా చంద్రయ్యా వైపు చూసి 'అబ్బాయి సూట్ కేస్ తీసుకెళ్లి లోపల పెట్టు' అన్నాడు.

చంద్రయ్యా అందుకోబోతుంటేనే 'పట్టుకెళతాలే' అంటూ రాములమ్మ పోటీపడి సూట్ కేస్ తీసుకుని లోపలికెళ్లిపోయింది.

వేణు తాత దగ్గరకు వెళ్లి 'నీ కోసం, నానమ్మ కోసం చాలా తాయిలాలు తెచ్చాను' అన్నాడు నవ్వుతూ. వేణుగోపాలరాయుడు తనంత ఎత్తు వున్న మనవడి తల నిమిరి 'ఈ ఇంట్లో చిన్న పిల్లలం మేమే కదా. మాకు తాయిలాలు తేకపోతే ఎవరికి తెస్తావు? ' అన్నాడు.

'కాస్త మీ కబుర్లు ఆపి వాణ్ణి స్నానం చేసి టిఫిన్ తిననియ్యండి. ఆ తరువాత ఎలాగూ మీదగ్గరికే కదా వాడు వచ్చేది' అంది నానమ్మ వరలక్ష్మి.

వరలక్ష్మిని ఓ కంటితో చూసి మనవడితో 'దాంతో ఎక్కువ మాట్లాడవని మీ నానమ్మకు ఉడుకుమోత్తనం. వెళ్లు వెళ్లు త్వరగా వచ్చేయి' అన్నాడు వేణుగోపాలరాయుడు.

హాల్లోంచి ఎవరి పనుల మీద వాళ్లు వెళ్లిపోయారు.

చంద్రయ్యా, సీతారామయ్యా పొలం వెళ్లిపోయారు.

★ ★ ★

వేణు రెండు ప్యాకెట్లు, ఒక ఆల్బమ్ పట్టుకొని 'నానమ్మా తాత లేచాడా? ' అంటూ తాత, నానమ్మ ఉండే గదిలోకి వచ్చాడు.

'అసలు పడుకుంటే కదరా లేవడానికి. నువ్వు వచ్చినప్పటి నుంచీ నీ ఉంగరాల జుట్టు, నీ ముక్కు, నీ కళ్లు, నీ ఎత్తు, నీ మీసకట్టు వర్ణించటమే సరిపోయింది.. అబ్బాయి అమ్మాయిని చూసి వర్ణించినట్టు. చదువు అయ్యాక వచ్చేసి తన దగ్గరే ఉంటావుట. నువ్వు పెళ్లి చేసుకొని ఇక్కడే వుండిపోతే నిన్ను మీ ఆవిడ్ని చూసుకుంటూ కాలం గడిపేయచ్చనో.. ఇలా కబుర్లు చెబుతూ నన్ను కూడా నిద్రపోనివ్వలేదురా!' అంది.

'వాడు లేనపుడు మన పని నిద్రపోవడమే కదే. వాడొస్తేనే ఇంట్లో సందడి, సరదానూ' అన్నాడు రాయుడు.

'తాతా నీ కోసం జీడిపప్పు మిఠాయి తెచ్చాను. స్పెన్సర్ చుట్టలు తెద్దామనుకున్నాను. మానేస్తానని మాటిచ్చావు కదా మానేసి వుంటావని తేలేదు' అన్నాడు వేణు.

'నీకిచ్చిన మాట ప్రకారం చుట్టలు మానేశాడు' అంది నానమ్మ వరలక్ష్మి.

'నేను పొలం వెళ్లినపుడు ఓ చుట్ట కాలిస్తే నువ్వు చూడొచ్చావా? ' అన్నాడు రాయుడు వరలక్ష్మితో.

'నేను కాపురానికి వచ్చినప్పటి నుంచీ ఉన్న ఆ చుట్ట కంపు, చుట్ట మానేసేక పోయింది. మళ్లీ కాలిస్తే ఆ కంపు నే పసి గట్ట లేనా ఏమిటి? ' అంది వరలక్ష్మి.

'నువ్వు అసలు నా దగ్గిరికి రావటం ఎందుకు' అన్నాడు రాయుడు.

'నేనెందుకు వస్తాను మీ దగ్గిరకి. స్నానానికి వెళ్లేటపుడు తలకి నూనె రాయ మంటారా.. అప్పుడు దగ్గిరికి రాకుండా నూనె ఎలా రాయను. కొబ్బరినూనె ఒక గరిట్లో వేసి నెత్తి మీద వంచాలి. పోనీ తలకు నూనె రాసాక ఆ చేత్తో కాస్త కాళ్లు కూడా పామేయి అంటాడు మళ్లీ మీతాత' అంటూ ఫిర్యాదు చేసినట్టుగా మనవడితో చెప్పింది వరలక్ష్మి.

వేణు నవ్వుకొని 'మిమ్మలిద్దర్నీ. చూస్తుంటే కొత్త దంపతుల్లా ఉంటారు నానమ్మా' అన్నాడు వేణు.

'అందుకే మమ్మల్ని చూసి నీ పెళ్లాము నువ్వూ నేర్చుకుంటారనే త్వరగా పెళ్లి చేసు కోరా మనవడా అని మూడేళ్ల బట్టి బతి మాలుతున్నాను' అంది వరలక్ష్మి.

రాయుడు నవ్వుకున్నాడు. 'ఎం.ఎ. అయిపోయిందిగా, ఇంక చేసుకుంటాడులే' అన్నాడు.

'పి. హెచ్‌డి. చేద్దామనుకుంటున్న తాతా' అంటూ తాత మొహంలోకి చూసాడు.

"అఫ్‌కోర్స్ నిన్ను అర్జెంటుగా పెళ్లి చేసు కుని కాపురం చెయ్యమనటం లేదు. మనిషికి చదువు ఎంత ముఖ్యమో పెళ్లీ అంతే ముఖ్యం అని మర్చిపోకూడదు" అన్నాడు రాయుడు.

'సరేలే తాతా! పెళ్లి చేసుకుని పి.హె చ్‌డి. చెయ్యమంటావు, అంతేనా? ' అన్నాడు వేణు.

అదే నా ఒపీనియన్ అన్నాడు రాయుడు నవ్వుతూ.

'అది సరే కాని.. ఒరేయి నీపక్క ఇంకో పిల్ల వుందని, నువ్వు పాడుతుంటే ఆ పిల్ల ఆడిందని, ఇద్దరి సంగతులు టి.వి.లో చూళ్లేకపోయామంటూ మర్నాడు పొద్దున్నే వచ్చి మీ మామయ్య కూతురు దుర్గ నాతో చెప్పింది. నాతో చెబుతూ వుంటే దాని కళ్ళలో నీళ్ళు కూడా తిరిగాయి. ఆ పిల్ల ఫొటో కూడా ఇందులో వుందా' అని అడి గింది వరలక్ష్మి.

'చూడు నానమ్మా అన్నీ అందులో వున్నాయి' అన్నాడు

'అయితే చూడాలి' అంటూ ఆల్బమ్ తెరి చిందామె. రాయుడు, వరలక్ష్మి ఆల్బమ్ చూడటంలో నిమగ్నమైపోయారు. వేణు పక్కనున్న శ్రావణిని, ఆమె నృత్యభంగిమ ల్ని, వేణు పాడుతూ అభినయించిన రీతిని చూస్తూ ఇద్దరూ మురిసిపోయారు.

'రతీ మన్మధుల్లా ఉన్నార్రా. అమ్మాయి ఎవర్రా ఇంత బాగుంది? ' అన్నాడు రాయుడు

'తైతక్కలు నేను నేర్చుకోలేదు' అంది వరలక్ష్మి రాయుణ్ణి చూస్తూ.

'అందుకేగా నిన్ను పెళ్ళి చేసుకుంట' అన్నాడు రాయుడు

'ఆ నేను ఇప్పుడు మాట్లాడిన మాటలు వేణు గురించి, పక్కనున్న ఆ పిల్ల గురిం చి. నువ్వెందుకు మధ్యలో వచ్చేస్తావు? ' అన్నాడు రాయుడు.

'మరి ఆ పిల్ల బాగుందని ఎందుకన్నారు మీరు' అంది చిరుకోపంతో.

వేణు వచ్చే నవ్వు ఆపుకుంటూ 'తాత య్యకంటే నువ్వే బాగుంటావు నానమ్మా. ఆ పిల్ల నాకు బాగుందన్నాడు తాత, అం తే' అన్నాడు వేణు.

'మరి దుర్గ ఏమైపోతుందిరా? ' అంది వరలక్ష్మి.

'వాడేదో దుర్గని పెళ్ళాడి వదిలేసినట్లు మాట్లాడతావేంటి. మేనరికం కాబట్టి అనుకున్నారు. అనుకున్నవన్నీ జరగాలని ఎక్కడ వుంది. మనముగ్గురమే వున్నాము కాబట్టి చెబుతున్నాను. ఈ ఆల్బమ్‌లో ఉన్న పిల్లే బాగుంది' అన్నాడు రాయుడు.

వరలక్ష్మి ఏదో మాట్లాడబోతుంటే-

'ఇప్పుడు ఆ గొడవెందుకు నానమ్మా? మీ ఇద్దరూ ఆల్బమ్ పూర్తిగా చూడండి. నేను అలా గుడిదాకా వెళ్ళి వస్తాను!' అంటూ లేచి బయటకి వెళ్ళిపోయాడు వేణు.

★ ★ ★



శ్రావణి ఢిల్లీ చేరుకుంది. ఆనందనగర్ కాలనీలోని తన ఇంటిముందు టాక్సీ ఆగింది. లగేజీ తీసుకొని ఇంట్లోకి వెళ్ళింది. ఇంటిముందు టాక్సీ ఆగిన సంగతి గ్రహించిన మాణిక్యాంబ వీధి వాకిలివైపు చూసింది. లగేజీతో లోపలికొస్తున్న శ్రావణిని చూసి,

'ఫోన్ చేస్తే నాన్న స్టేషనుకొచ్చేవారే కదమ్మా' అంది మాణిక్యాంబ.

'అందుకే చెయ్యలేదు అత్తయ్యా. స్టేషను నుంచి బోల్డన్ని టాక్సీలు ఉంటాయి. నాన్న బిజీగా వుంటారు. ఇబ్బంది పెట్టడం ఎందుకని నేనే వచ్చేసాను' అంది శ్రావణి సామాను పక్కన పెడుతూ.

'నాన్నగారు కోర్టుకు వెళ్ళిపోయారా' అంది శ్రావణి తన తండ్రి కూర్చునే ఆఫీసు గదివైపు చూస్తూ.

'నాలుగు మెతుకులు నోట్లో వేసుకుని వెళ్ళిపోయాడు. వెళ్ళి అరగంటపైనే అవుతోంది. నువ్వు వస్తున్నావని ఫోన్ చేస్తే పనులన్నీ పక్కన పెట్టి స్టేషను కొచ్చేవాడు నీకోసం' అంది మాణిక్యాంబ.

మాణిక్యాంబ శ్రావణి మేనత్త. శ్రావణి తండ్రి భీమశంకరం. ఆయన సుప్రీంకోర్టులో న్యాయవాది. శ్రావణి చిన్నతనం నుంచీ మాణిక్యాంబ అన్న భీమశంకరం ఇంట్లోనే వుంటూ వచ్చింది. మాణిక్యాంబకు చిన్నతనంలోనే భర్తపోవటంతో అన్నగారి ఇల్లే ఆశ్రయం అయింది. శ్రావణి పెంపకం అంతా మాణిక్యాంబ చేతుల మీదుగానే జరిగింది. శ్రావణిని మాణిక్యాంబ కన్నకూతురు కంటే ఎక్కువగా చూసుకుంటుంది. శ్రావణి తల్లి తాలూకు జ్ఞాపకాలు, ఛాయలు ఆ ఇంట్లో ఏమీలేవు. ఒక్క ఫొటో కూడా లేదు. శ్రావణికి చిన్న



తనం నుంచీ తల్లి గురించి తెలుసుకోవాలన్న అవసరమూ రాలేదు. ఆలోచనా రాలేదు. కారణం తల్లినే అనిపించేలా శ్రావణిని పెంచుకుంటున్న మాణిక్యాంబ తీరు, కంటికిరెప్పలా చూసుకునే భీమశంకరం గారాబం.

మాణిక్యాంబ లంచ్ అవర్‌లో భీమశంకరం సెల్‌కి ఫోన్ చేసి శ్రావణి వచ్చినట్టు చెప్పింది. దానికి కారణం భీమశంకరం సాధారణంగా కోర్టుపని అయిపోయిన తరువాత క్లబ్‌కి కూడా వెళ్లి ఇంటికి లేటుగా రావటం పద్ధతి. కూతురు శ్రావణి వచ్చిందంటే త్వరగా ఇంటికి వచ్చేయడమే కాకుండా ఆమె ఇంట్లో ఉన్నన్నాళ్ళు ఎక్కువ సమయం ఆమెతోనే గడుపుతాడు. ఆ కారణం చేతనే శ్రావణికి న్యాయశాస్త్రంపట్ల ఆసక్తి, అభిరుచి పెరిగాయి. అందుకే 'లా' చేరింది. భీమశంకరం ఉదయాన్నే నిష్ఠగా స్నానం చేసి, పూజ చేసుకుంటాడు. పూజా కార్యక్రమంలో విష్ణు సహస్రనామం చదవటం భీమశంకరం అలవాటు. శ్రావణి హైస్కూల్ విద్యార్థిగా

ఉండగానే విష్ణు సహస్రనామం గూర్చి అడిగి తండ్రి ద్వారా అర్థాన్ని తెలుసు కుంది. అలా చాలా గంటలు శ్రావణికి ఊహ తెలిసినప్పటి నుంచీ ఆమెతో గడప టం, ఆమెకి చాలా విషయాలు తెలియచె ప్పటం, ఆమె అడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పటం అతని దినచర్య. ఢిల్లీలో హైస్కూల్ చదువు పూర్తయిన తరువాత శ్రావణిని ఆంధ్ర ప్రాంతంలోనే కాలేజీ చదువులకు చేర్పించాడు. దానికి కారణం భీమశంకరం రాజమండ్రి, కాకినాడ కళాశా లలో చదువుకోవడం. ఆ ప్రాంతం పట్ల, ఆ ప్రాంతంలోని కళలపట్ల అతనికి ఎంతో అభిమానం. అక్కడి పండుగలు, పబ్బాలు, ఉత్సవాలు, దైవకార్యాలు, తీర్థాలు, జాత రలు, పన్నెండేళ్ళ కొకసారి వచ్చే గోదావరి పుష్కరాలు, ద్రాక్షారామంలో భీమేశ్వర కళ్యాణం ఇవన్నీ అతనికి ఎంతో ఇష్టం.

శ్రావణి తన తండ్రి ఎప్పుడు ఇంటికి వస్తాడా అని ఎదురు చూస్తోంది. తన అనుభవాన్ని, జ్ఞాపకాలను, అనుభూతుల్ని, ఆనందాలను అతనికి వివరించి అతనితో పంచుకోవాలని ఆమె మనసు తహతహ లాడుతోంది.

ముఖ్యంగా తను ప్రాణప్రదంగా చూసు కుంటున్న తన ఆల్బమ్ తండ్రికి చూపించా లని అక్కడ జరిగిన పోటీ వివరాలు, ప్రెస్ మీట్ వివరాలు తండ్రికి చెప్పాలని, వేణు గురించి తన అభిప్రాయం తండ్రికి చెప్పి ఆయన కామెంట్స్ వినాలనే ఆలోచనలతో ఆయన రాకకోసం ఎదురు చూస్తోంది శ్రావణి.

సాయంత్రం ఆరున్నరకల్లా భీమశంకరం ఇంటికి వచ్చేశాడు. తన గౌనును హ్యాంగ ర్‌కి తగిలిస్తూ చెప్పులు పెట్టే చోట శ్రావణి చెప్పులు చూశాడు. ఇంట్లోనే వుందనుకు న్నాడు.

'శ్రావణి డియర్' అంటూ లోపలికి వెళ్ళాడు. తండ్రి పిలుపుకు పరిగెత్తే సెల యేరులా ఒక్కపరుగున వచ్చి కౌగలించు కుంది శ్రావణి. ఆప్యాయంగా దగ్గరకు తీసుకుని భీమశంకరం ఆమె తలను ముద్దు పెట్టుకున్నాడు. ఈ సన్నివేశాన్ని చూసి మాణిక్యాంబకు ఎంతో ఆనందమ య్యింది. శ్రావణి అదృష్టవంతురాలను కొంది. శ్రావణి కారణంగా తన అన్న అదృ ష్టవంతుడనుకొంది.

'శ్రావణి ఇంట్లో వుంటే నువ్వు చిన్నపిల్లా డివి అయిపోతావురా అన్నయ్యా. అది లేనప్పుడు నువ్వు సీరియస్‌గా మొహం పెట్టుకుని వుంటే పలకరించాలంటేనే భయంవేస్తుంది' అంది మాణిక్యాంబ.

"నాన్నను చూస్తే నీకు భయం వేస్తుందా అత్తయ్యా? ".

"వాడు నీకు ఫ్రెండమ్మా. నాకు అన్న. చిన్నప్పటి నుంచీ వాడంటే నాకు భయమే" అంది మాణిక్యాంబ నవ్వుతూ.

★ ★ ★

ఇంటిముందు గార్డెన్‌లో ఛైర్‌లో కూర్చున్న భీమశంకరం దగ్గరకు వచ్చింది శ్రావణి. మరో ఛైర్ తండ్రికి దగ్గరగా లాక్కుని కూర్చుంది. తను కూడా తెచ్చిన ఆల్బమ్ తండ్రి ఒళ్ళోపెట్టి 'జాగ్రత్తగా చూడు నాన్నా. ఈ ఆల్బమ్ మ్యూజిక్ అండ్ డాన్స్ కాంపిటీషన్స్‌లో నేను ఫస్ట్ వచ్చేనని చెప్పాను కదా మీకు' అంది

"ఆ ఫోటోలా!" అంటూ శ్రావణి ఇచ్చిన ఆల్బమ్ తిరగేస్తూ చూడసాగాడు భీమశం కరం.

"నువ్వు టి.వి.లోనూ, పేపర్లలోనూ ఈ కాంపిటీషన్ గురించి మా ప్రెస్ మీట్ గురించి చూళ్ళేదా నాన్నా" అడిగింది శ్రావణి.

"లేదమ్మా రీజనల్ న్యూస్‌లో ప్రామినెం ట్‌గా ఇచ్చింటారు. ఢిల్లీకి వచ్చేసరికి అది ఏ మూలో వేస్తారు. 'ఈనాడు' తెప్పించు

కుంటేనో ఇంటర్నెట్‌లో చూస్తేనో తప్ప ఈ రీజనల్ న్యూస్ గురించి వివరంగా తెలీదు. అంతటైమ్ నాకు లేదు. సారీ రా ఐ మిస్‌డ్ దట్ న్యూస్!"

"దట్స్ ఆల్‌రైట్. ఆల్బమ్ జాగ్రత్తగా చూడు. ఆల్బమ్ చూస్తే ఆ ఫొటోలన్నీ పిక్చర్ ప్రోగ్రామ్‌గా ఎరేంజ్ చేసి ఉన్నాయి. కనుక నీకు మొత్తం కథ అర్థం అవుతుంది" అంటూ తండ్రి పక్కనించి లేచింది శ్రావణి.

"నువ్వెక్కడికమ్మా. నువ్వు నా పక్కనే కూర్చుని నేను ఒకొక్క ఫొటో చూస్తుంటే నువ్వు యాంకర్‌పర్సన్‌లా కామెంట్రీ చెప్పాలి" అన్నాడు భీమశంకరం.

"అది ఆర్డినరీ వ్యూయర్స్‌కి..నీలాంటి ఇంటిలిజెంట్ వ్యూయర్ బొమ్మలు చూస్తూ కథ అల్లేసుకుంటాడు. ఎంజాయ్ యువర్‌సెల్ఫ్, నీకు నాకు కాఫీ తెస్తాను ఈ లోపల"

"అత్తను కూడా రమ్మను చూస్తుంది" అన్నాడు.

"అత్త ఇంక చూడక్కరలేదు. భోజనం చేసింది మొదలు నువ్వు వచ్చే దాకా అత్త ఈ ఆల్బమ్‌ను ఒక్కక్షణం వదల్లేదు" అని లోపలికి పరిగెత్తింది శ్రావణి.

భీమశంకరం ఒకొక్క ఫొటోనే చూస్తూ తన కూతురి ప్రతిభకు మురిసిపోయాడు.

ఇంతలో కాఫీ కప్పుతో ప్రవేశించింది శ్రావణి. తండ్రికి ఓ కప్పు అందించింది. కప్పు అందుకుంటూ శ్రావణి మొహంలోకి చూసి "ఎవరమ్మా ఈ వేణు? " అన్నాడు భీమశంకరం.

"ఆయన పేరెలా తెలిసింది నీకు" అంది శ్రావణి.

భీమశంకరం నోటితో సమాధానం చెప్ప కుండా ఆల్బమ్ అట్ట తిప్పి ఫస్ట్ పేజీ చూపించాడు. ఫొటో స్టోరీ ఆఫ్ మిస్టర్ వేణూ అండ్ మిస్ శ్రావణి ఇన్ స్టేట్ లిట రరీ మ్యూజిక్ అండ్ డాన్స్ కాంపిటీషన్స్



**కొత్తగాలి...**

**మనసులోంచి**
**కాగితం మీదకి**
**అక్షరాల నయాగరా**

– ప్రతాప వెంకట సుబ్బారాయుడు,
సికింద్రాబాద్

ఆఫ్ ఆంధ్రప్రదేశ్ అని చూపించారు. అందులో ప్రత్యేకంగా మిస్టర్ వేణు అండ్ మిస్ శ్రావణి అన్న పేర్లు పెద్దవిగా, బ్రైట్‌గా కనపడుతున్నాయ్.

శ్రావణి తెల్లబోయి "అసలు ఈ పేజీయే చూడలేదు నాన్నా నేను" అంది.

"చూడకపోతే పోన్లే. ఈ అబ్బాయి పేరేనా గుర్తుందా? " అన్నాడు కొంటెగా భీమశంకరం కూతురుతో ఆల్బమ్‌లో ఒక ఫొటోని చూపిస్తూ.

"పో నాన్నా" అంది గోముగా శ్రావణి.

"వేణూ బాగున్నాడు కదూ!" అన్నాడు భీమశంకరం.

"బాగోటమే కాదు డాడీ.. హీ ఈజ్ జీనియస్, హైలీ టాలెంటెడ్, అంతేకా కుండా మంచిమనిషి" అంది చిరునవ్వుతో.

"అయితే నువ్వు ధరోగా స్టడీ చేశావు" అన్నాడు కూతురు ముఖంలోకి చూస్తూ భీమశంకరం.

"మేము మొత్తం కలిసున్నది టూ, త్రీ అవర్స్ నాన్నా అతని గురించి నాకు తెలి సింది మీకు చెప్పాను" అంది.

"క్వాలిఫికేషన్స్"

"ఎం.ఎ. ఫైనలియర్ డాడీ"

"బాగుంది. అతనికి 'లా' చెయ్యాలనే వుద్దేశం వుందా" అన్నాడు భీమశంకరం.

"నేను ఆ డీటేల్స్ అడగలేదు కానీ, నీకు నచ్చిన వాళ్ళందరూ లాయర్స్ కావాలా డాడీ? "

"నీకు కూడా నచ్చాడనుకొని అడుగుతు

న్నానమ్మా? "

ఆ మాటకు శ్రావణి సిగ్గుపడి "పో నాన్నా" అంటూ లోపలికి వెళ్ళబోయింది.

"కాదమ్మా. అబ్బాయి బాగున్నాడు, ప్రజ్ఞావంతుడు. నచ్చడంలో తప్పేముంది. లవ్ మే బి బ్లైండ్. ఐనో యువార్ నాట్ బ్లైండ్, మై చైల్డ్" అన్నాడు ఫ్రెండ్లీగా భీమ శంకరం.

"నిజమే నాన్నా.. ఐ లైక్ హిమ్" అంది తల వంచుకుని.

"దెన్ ఐ ప్రొసీడ్. మిగిలిన విషయాలు నేను మాట్లాడతాను" అన్నాడు భీమశం కరం.

★ ★ ★

భీమశంకరం తన గదిలో పడుకుని ఏకాంతంగా మరోసారి ఆల్బమ్ చూసాడు. శ్రావణిని చూస్తూ పక్కనే వేణుని చూస్తూ చాలాసేపు ఆలోచిస్తూనే వున్నాడు. ఒక్కసారి లేచి బీరువాలో ఉన్న శ్రావణి చిన్ననాటి ఆల్బమ్ తీసాడు. రెండేళ్ళ పిల్లగా ఉన్నప్పటి ఫొటో తన చేతిలోకి తీసుకుని ఆల్బమ్‌లో ఉన్న శ్రావణి ఫొటోతో పోల్చి చూసుకున్నాడు. నవ్వుకున్నాడు. అందుకే ఆడపిల్లలు తోటకూర కాడల్లా ఇటు అటు చూసేసరికి ఎదిగిపోతారన్నారు పెద్దలు అనుకున్నాడు. శ్రావణి శారీరకంగా ఎదగటమే కాకుండా అన్ని విధాలా ఎదుగుతూ వచ్చింది.

ఏదో ప్రత్యేక ఆకర్షణ శ్రావణిలో ఉంది. ఆమె కళ్ళల్లో తెలివితేటలు కొట్టొచ్చినట్లు కనపడతాయి. ఆ అబ్బాయి పదేపదే మా శ్రావణి గురించి ఏమనుకున్నాడో, ఎలా ఆలోచిస్తున్నాడో! తను ఇలా ఊహించుకుంటున్నాడు కానీ అతని మనసులో ఏముందో? ఒకవేళ అతని పెద్దవాళ్ళు వేరే సంబంధాలు చూస్తున్నారేమో. ఇదివరకే ఏదైనా సంబంధం నిర్ణయించుకున్నారేమో, తనకి తెలీదు కదా. ఇదంతా తన పరంగానూ శ్రావణి పరంగానూ తను ఆలోచిస్తున్నాడు.

కాని ఏడాది పిల్లప్పుడు శ్రావణిని తన చేతుల్లో పెట్టి ఒక కోరిక కోరిన ఆ మనిషి అక్కడే వుందో, ఉంటే ఎలా వుందో? ఇరవై ఏళ్ళ క్రితం తను కలిసాడు. ఇరవై ఏళ్ళు గడిచిపోయాయి. మళ్ళీ ఎప్పుడూ ఆమెను తను కలవలేదు. నా విజిటింగ్ కార్డు తన దగ్గర ఉన్నా ఆమె కూడా ఫోన్ చెయ్యలేదు. నా గురించి, శ్రావణి గురించి తెలుసుకుందామన్న ప్రయత్నం కూడా చెయ్యలేదు. ఒక్కమాటకు కట్టుబడి బిడ్డ భవిష్యత్తును దృష్టిలో పెట్టుకుని బిడ్డనే మరచిపోయింది. బిడ్డను పెంచుతున్న వ్యక్తినీ మరచిపోయింది. మా ఉనికినే మరచిపోయింది. ఇలా నేను అనుకుంటున్నాను కానీ నిజంగా మమ్మల్ని మరచిపోయి ఉంటుందా? అసలు మా ఇద్దరినీ మరచిపోగలదా? నన్ను మరచిపోవడం కష్టంకాదు. శ్రావణిని మరచిపోవడం సాధ్యమా, ఇప్పటికి ఎంత ఎదిగి ఉంటుందో, ఎలా ఉంటుందో అన్న ఆలోచన ఒక్కసారి కూడా ఆ తల్లికి రాకుండా ఉంటుందా? ఆమె నన్ను ఎంత మంచివాడనుకున్నా, ఎంతనమ్మినా రెండుమూడు గంటల పరిచయంతో తన బిడ్డని బాగానే చూసుకుంటాననే నమ్మకంతో ఇన్నాళ్ళు బతుకుతోందా? అసలుందా? బతికి వుందా? వుంటే కాకినాడలో ఆ ఇంట్లోనే వుంటోందా? ఉంటే ఇప్పుడు ఎలా వుంటుందో? ఎలా వున్నా ఆమెను చూసి నేను గుర్తుపట్టగలనా, అన్ని పట్టణాల్లాగే ఆ పట్టణంలో కూడా ఎన్ని మార్పులు వచ్చుంటాయో? ఆమె ఉన్న ఇల్లు ఏ అపార్ట్‌మెంట్స్‌గా మారిపోయిందో, లేక ఆ ఇల్లు వదిలేసి ఆమె వేరే చోటికి వెళ్ళిపోయిందో? ఇలాంటి ఆలోచనలతో భీమశంకరానికి నిద్రపట్టలేదు. మనసును గత

జ్ఞాపకాలు వెంటాడుతున్నాయి. లేచి మంచం మీద కూర్చున్నాడు. ఆల్బమ్ తెరచి కిరీటాలు ధరించిన శ్రావణి, వేణూలను చూశాడు. ఇందులోంచి శ్రావణి ఫొటోని ఎన్‌లార్జి చేయించాలి. రెండేళ్ళ శ్రావణి ఫొటోతో పాటు ఇప్పటి శ్రావణి ఫొటోను జతచేసి ఆమెకు ఎలాగైనా చేరేలా చేయాలి. ఆమె అంటూ వుంటే, ఆమె ఎలా ఉన్నా ఈ ఫొటోలు చేరేలా చూడాలి. ఒక రకంగా అదే నా బాధ్యత. అది నాకొక తృప్తి. ఆమె నాకు అప్పచెప్పిన బాధ్యతను నేను నిర్వర్తించానని ఆమెకు తెలిసి ఆమె ఆనందిస్తే నాకు ఎంతో సంతోషం.

కానీ ఆమెకు ఈ ఫొటోలు చేర్చడమెలా? ఇరవైయేళ్ళ తరువాత కూడా ఇప్పటికీ అక్కడే వుందా? ఎక్కడ వుంది? ఉంటే ఎలా వుంది. నేను స్వయంగా వెళ్ళి తెలుసుకోవాలి. ఆ ఇంటినెంబరు అడ్రస్సు కూడా తెలీదు. ఆమె ఇంటిలో ఫోన్‌లేదు. వెళ్ళే తెలుసుకోవాలి అనుకున్నాడు.

ఇంతలో కాకినాడలో ఉన్న తన స్నేహితుడు శేషగిరిరావు గుర్తొచ్చాడు. అతను తన క్లాసుమేటు. అతను మంచి అడ్వకేట్. సుప్రీంకోర్టుకు అప్పీలుకొచ్చే కేసులు తనకు రిఫర్ చేస్తూ వుంటాడు. అతనికిక్కూడా ఇరవైయేళ్ళ క్రితం శ్రావణిని తనకు అప్పచెప్పిన మనిషి ఎవరో తెలీదు. ఏ పరిస్థితుల్లో ఎందుకు అప్పచెప్పిందో తెలీదు. తానూ చెప్పలేదు.

రేపతనికి ఫోన్ చేసి ఆమె అడ్రస్సు, పేరు, ఇంటి పరిసరాలు వివరించి కనుక్కోమని చెప్తాను. ఈ వయసులో నన్ను గురించి వేరే విధంగా అతను ఊహించే అవకాశం లేదు. ఏదో పనిబడి కనుక్కుంటున్నాననుకుంటాడు. శేషగిరిరావు నుంచి విషయాలు తెలియగానే ఈ రెండు ఫొటోలు పంపించాలి. రెండేళ్ళలోపు పాప ఫొటో చూస్తే ఇరవైయేళ్ళ శ్రావణి ఫొటోను చూసి గుర్తు పట్టకుండా ఎలా వుంటుంది? శ్రావణి ఎవరో కూడా తెలియచేస్తూ రెండు ముక్కలు రాస్తాను కదా అనుకున్నాడు భీమశంకరం. ఈ నిర్ణయానికి వచ్చిన తరువాత ఫ్లాస్కులో ఉన్న వేడి పాలను తాగి నిద్రపోయాడు.

★ ★ ★

వేణు వేసవి శెలవులకు వచ్చి పదిహేను రోజులు కావస్తోంది. వేణు వచ్చాక దుర్గ రాకపోకలు ఎక్కువయ్యాయి. పనిలేకపోయినా 'అత్తయ్యా, ఏం చేస్తున్నావు?' అంటూ సీతాదేవిని పలకరించి అమ్మమ్మ వరలక్ష్మిని, తాత రాయుడ్ని పలకరించేది. 'మామయ్య పొలం వెళ్ళాడా?' అని అడిగేది. వేణూ ఇంట్లోనే ఉన్నాడేమోనని నోటితో అడక్కుండా కళ్ళతోనే అడిగేది. వాళ్ళింట్లో వండిన కూరలు, పిండివంటలు పట్టుకొచ్చి అత్త చేతికిచ్చేది. సీతాదేవి దుర్గ రాకపోకలను గమనించి నవ్వుకునేది. ఓ రోజున వరలక్ష్మి దుర్గని తన దగ్గరకు పిలిచి పక్కన కూర్చోబెట్టుకుంది.

"ఇదివరలో మీ బావ ఇక్కడ లేనప్పుడు వారానికో పది రోజులకో వచ్చేదానివి. ఈ మధ్య నీ రాకపోకలు ఎక్కువయ్యాయి. పిల్లా ఏమిటి కథ?" అంది వరలక్ష్మి

"పో అమ్మమ్మా. ఏమీ తెలియనట్టు నన్నే అడుగుతావు" అంది దుర్గ. ఇంతలో ఆ గదిలోకి వేణు రావడంతో అమ్మమ్మ పక్కనించి ఆమె పారిపోబోయింది. వేణు చెయ్యి అడ్డుపెట్టి దుర్గని ఆపబోయాడు. చేతిక్రింద నుంచి దూరి పారిపోయింది. వేణూ నవ్వుకుని "చిన్నప్పటి నుంచి మన ఇంట్లో పెరిగిన పిల్లే కదా బామ్మా.. నన్ను చూస్తే దీనికి ఇంత సిగ్గెందుకు? పరుగులెందుకు?" అన్నాడు వేణు.

"కాబోయే మొగుడివనిరా" అంది వరలక్ష్మి.

"దాన్ని చేసుకుంటానని నేను ఎప్పుడు చెప్పాను? అదికాక పోయినా నేను పి. హెచ్.డి. అయ్యేదాక పెళ్ళి చేసుకోదలచుకోలేదు. అది మూడేళ్ళే పడుతుందో, నాలుగేళ్ళో పడుతుందో తెలీదు" అన్నాడు వేణు.

లోపల్నించి రాయుడు వచ్చి "దుర్గే కాదురా, వాళ్ళ అమ్మానాన్నా కూడా ఈ వేసవికాలం సెలవుల్లో మీ ఇద్దరి పెళ్ళి జరిపించేయాలని తొందర పడుతున్నారు" అన్నాడు.

సీతాదేవి అత్తగారికి, మామగారికి, వేణూకి కాఫీ తెచ్చి ఇచ్చి "ఆడపిల్ల గలవాళ్ళకి తొందర ఉండటం సహజం కదా? " అంది వేణుతో.

"అది కాదమ్మా దుర్గను నేను పెళ్ళి చేసుకుంటానని నా ఊహ తెలిసాక మీతో ఎవరితోనైనా అన్నానా? "

"అది పుట్టినప్పటినుంచీ పెద్దవాళ్ళం మేం అనుకున్నామురా" అంది వరలక్ష్మి.

"చిన్నప్పుడు తొంభై అనుకుంటాం నానమ్మా. అన్నీ అనుకున్నట్లు జరిగిపోతాయా నానమ్మా? " అమ్మ ముఖంలోకి ప్రశ్నార్థకంగా చూసాడు.

రాయుడు కలుగచేసుకుని "నీకు ఊహ తెలిసాక దుర్గని పెళ్ళి చేసుకుంటాననీ అనలేదు, చేసుకోననీ అనలేదు. పెద్దవాళ్ళ మాటల మూలంగా పదోక్లాసులో చదువు ఆపేసి, ఇంట్లో ఖాళీగా కూర్చున్న దుర్గ ఏవేవో ఊహించుకుంటూ నీమీదే ఆశలు పెంచుకుంది. నువ్వు వచ్చాక ఈ మధ్య రోజూ మన ఇంటికి వస్తోంది. అది పరాయిపిల్లేం కాదు. మనింట్లో పిల్లే. నీకు ఇష్టం వుంటే వుందని చెప్పు. ఇష్టం లేకపోతే లేదని చెప్పేయి. మీ మామయ్య ఇంకో సంబంధం చూసుకుంటాడు. దాని మనసూ కుదుటపడుతుంది".

మామగారి మాటలకు ఎదురుచెప్పటం ఇష్టంలేక సీతాదేవి అక్కడి నుంచి వెళ్ళిపోయింది.

కూర్చున్న చోట నుంచి వరలక్ష్మి లేచి "వాడికే కాదు, ఈ సంబంధం మీకూ ఇష్టం లేనట్టుంది!" అంటూ వెళ్ళిపోయింది.

తాతా మనవడే మిగిలారు.

ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు.

ఇంతలో సీతారామయ్య ఆ గదిలోకి రావడంతో వేణు బయటికి వెళ్ళిపోయాడు.

"ఏమిటి నాన్నా మనవాడు దుర్గని చేసుకోనంటున్నాట్ట? బావ ఏమనుకుంటాడు!" అన్నాడు.

"ఎవరు ఏమనుకున్నా ఇవి బొమ్మల పెళ్ళిళ్ళు కావు కదుటోయి. ఎదిగిన పిల్లలకి మెడలు వంచి పెళ్ళిళ్ళు చెయ్యగలమా? కూర్చోబెట్టి నచ్చచెప్పటానికి ప్రయత్నం చేద్దాం. కాదు, కూడదు అంటే బలవంతం చేయడం నాకిష్టం లేదు. ఎదిగిన కుర్రాడు. చదువుకున్నవాడు" అన్నాడు రాయుడు.

"అక్కకి, బావకి సమాధానం చెప్పాలి కదా నాన్నా" అని తలవంచుకున్నాడు సీతారామయ్య.

"వేణుతో మాట్లాడి వాళ్ళకి చెబుదాం. వాడు అంగీకరిస్తే గొడవేలేదు. కాదంటే అర్థం అయ్యేలా చెబుతాము. అర్థం చేసుకోవడం వాళ్ళ బాధ్యత. వాళ్ళకి ఒక్కపిల్ల. మనకీ ఒక పిల్లాడు. వాళ్ళ యోగక్షేమాలు

## కొత్తగాలి...

**భూకబ్జా, జలయజ్ఞం**
**పాపపు కాసుల చెరువులు.**
**దప్పికింకా**
**తీరనేలేదు!**

*– అంబల్ల జనార్దన్, ముంబై*

మనం కూడా చూడాలి కదా. వాళ్ళదీ ఏ లోటూలేని కలిగిన కుటుంబమే. మనదీ అంతే. అంతస్తుల దగ్గర తేడా వచ్చి కాదు కదా. పిల్లల ఇష్టాయిష్టాలు కారణం కదా.. పెళ్ళి జరగటం, జరగకపోవటం" అన్నాడు రాయుడు.

"నీ ఇష్టం నాన్నా, ఏం చెబుతావో నువ్వే వాళ్ళకి చెప్పు. వేణుక్కూడా నీ మాటంటేనే గురి కదా? " అని అక్కడ నుంచి వెళ్ళిపోయాడు సీతారామయ్య.

రాయుడు ఆలోచనలోపడ్డాడు. వేణు మనసు తనకు తెలుసు, దుర్గ ఆశలు తనకు తెలుసు. కాని ఇద్దరూ మనసుపడి చేసుకుంటేనే పెళ్ళికానీ, ఇద్దరిలో ఏ ఒక్కరికి ఇష్టంలేకపోయినా, పెళ్ళి పెద్దవాళ్ళు చేసినా అది పెళ్ళికాదు. బలవంత బంధమవుతుంది. ఎవరికి సుఖం? వేణుతో ఏకాంతంగా మాట్లాడాలి. వాడి మనసు తెలుసుకోవాలి అనుకున్నాడు.

★ ★ ★

వేసవికాలం కావటం చేత చాలా పెళ్ళిళ్ళు జరుగుతున్నాయి. దుర్గ తల్లి వర్ధనమ్మ కూతురు పెళ్ళి విషయమై తన భర్త ఆదినారాయణని తొందర చేస్తోంది.

"వేణూ ఊళ్ళోకి వచ్చాక కూడా మీరు వెళ్ళి పిల్లపెళ్ళి సంగతి మాట్లాడరేంటి? అతను కాలేజీలో ఉంటే.. రానీ వచ్చాక మాట్లాడతా.. అంటారు. ఊళ్ళోవుంటే పట్టించుకోరు" అంది కాస్త నిష్ఠూరంగా.

"అక్కడికి దుర్గ నీ ఒక్కదానికి కూతురైనట్టు నాకు కానట్టు మాట్లాడుతావేంటి. వేణూ పరాయిపిల్లాడా... సొంత మేనల్లుడు కదా. చిన్నప్పటి నుంచి దుర్గని వాడికే ఇచ్చి చేద్దామనుకున్నాము. రేపో ఎల్లుండో మంచిరోజు చూసుకుని మాట్లాడదాంలే" అని లేచి పొలం వెళ్ళిపోయాడు ఆదినారాయణ.

తల్లి, తండ్రి మాట్లాడుకున్న మాటలు పక్కగదిలోంచి విని దుర్గ హాల్లోకి వచ్చింది. వర్ధనమ్మ కూతురు దుర్గను చూసింది. దుర్గ ఎదిగింది. పెళ్ళీడుకొచ్చింది. అది ఓ ఇంటిది అయితే చూసి ఆనందించాలనుకుంది వర్ధనమ్మ. అంతేకాకుండా తమకూ ఉన్నది ఒక్కపిల్ల, దాని కడుపు పండితేనే తమ ఇంట్లోనూ పిల్లాపాపాను, ఏ తల్లికైనా ముందు కూతురు పెళ్ళికావాలని, ఆ తరువాత కూతురు తల్లి కావాలని, ఆ కూతురుకి పుట్టిన పిల్లల్ని చూసుకొని మురిసిపోతూ వాళ్ళతో ఆడుకోవాలని ఉండటం సహజం కదా అనుకుంది వర్ధనమ్మ.

ఉయ్యాలబల్ల మీద కూర్చుని మాలకడుతున్న దుర్గ దగ్గరకి వెళ్ళి ఆమె పక్కనే కూర్చుంది వర్ధనమ్మ. ఒకసారి కూతుర్ని చూసి "బావవచ్చాడు కదా, తాతయ్యా వాళ్ళింటికి వెళుతూనే వున్నావు. బావ నీతో ఏమైనా మాట్లాడాడా? " అని అడిగింది వర్ధనమ్మ.

"ఎప్పుడూ ఏదో పుస్తకం అడ్డుపెట్టుకుని కూర్చుంటాడు. అక్కడికీ నేను బావకి వినపడాలని గట్టిగా మాట్లాడినా పుస్తకం తీసి నా ముఖం చూడడు. తన ముఖం కూడా కనపడనివ్వడు" అంది దుర్గ.

"సిగ్గేమోనే పాపం" అంది వర్ధనమ్మ.

"చదువుకుంటున్న వాడికి సిగ్గేమిటమ్మా" అని అక్కడి నుంచి లేచిపోయింది దుర్గ. అతనికంటే దీనికే సిగ్గులావుంది. బావ మాటెత్తితే అటూ ఇటూ పోతుంది అనుకొని వంటింట్లోకి వెళ్ళిపోయింది వర్ధనమ్మ.

దుర్గ తనగదిలో ఏకాంతంగా కూర్చుంది. భావ ఆరడుగుల మనిషి, అందంగా వుంటాడు. చిన్నప్పట్నించి చలాకీగానే వుంటాడు. కవితలు రాస్తాడు. చక్కగా పాడతాడు. పెద్ద చదువు చదువుకున్నాడు. మరి తనో? పట్నం పంపడం

ఇష్టంలేక నాన్నా, అమ్మా పదోతరగతి తరువాత చదువు ఆపేశారు. తిని కూర్చోవడం కారణంగా కాస్త లావుగానే తయారైంది. అసలు బావకి తను నచ్చుతుందా? బావకి తను తగినదేనా అనుకుంది దుర్గ.

దుర్గ ఆలోచనలు అక్కడితో ఆగలేదు. చిన్నప్పటి నుంచీ పెళ్ళి, పెళ్ళి అంటూ ఆడపిల్ల చదువు సంగతి పెద్దవాళ్ళు పట్టించుకోరు. పల్లెటూళ్ళలో మరీను. ఆడపిల్ల చదువుకుంటే ఏం పోతుంది? చదువుకున్నా తరువాత ఇష్టమయితే పెళ్ళిచేసుకుంటారు లేకపోతే ఎవరికి నచ్చిన వాళ్ళని వాళ్లు చేసుకుంటారు. అలా కాకుండా చిన్నప్పట్నించి బావ నీ మొగుడు, బావ నీ మొగుడు అని ఇంట్లో అందరూ అంటూంటే వయసు వచ్చాక కూడా ఆ రూపమే మనసులో నిలిచిపోతుంది. అతని ఊహలతోనే కాలం గడుస్తుంది. అన్నీ సవ్యంగా జరిగితే ఫరవాలేదు కాని, జరక్కపోతే? మనసులో ఏర్పడిన జ్ఞాపకాలు, ముద్రలను ఎలా మరిచిపోగలం? ఎలా తుడిచెయ్యగలం అనుకుంది. అంతలో తల్లి పిలుపువిని లోపలికెళ్ళింది.

ఓ రోజు సాయంత్రపువేళ వర్ధనమ్మ, ఆదినారాయణ రాయుడు ఇంటికి బయలుదేరారు. ఆరోజు రాయుడు, సీతారామయ్య కూడా ఇంట్లోనే ఉన్నారు. వర్ధనమ్మ లోపల సీతాదేవితోనూ, వరలక్ష్మితోనూ మాట్లాడటానికి వెళ్ళింది.

"రావయ్యా రా" అంటూ ఆదినారాయణను ఆహ్వానించాడు రాయుడు.

"బావగారు ఊరికే ఎందుకొస్తారు నాన్నా? ఏదో పనుండే వచ్చివుంటారు" అన్నాడు సీతారామయ్య నవ్వుతూ.

"కొడుకుల్నికన్న తండ్రులు అలాగే మాట్లాడతారులే బావా. ఇంతకీ వేణు ఎక్కడ? " అని అడిగాడు ఆదినారాయణ.

"వాడు సాయంకాలం వేళ గుడికి వెళతాడు. అలా కాసేపు తిరిగిరావడం అలవాటు వూళ్ళో వుంటే" అన్నాడు రాయుడు. ఇలావాళ్ళు మాట్లాడుకుంటూ ఉండగా సీతాదేవే స్వయంగా కాఫీలు పట్టుకొచ్చి ఇచ్చింది.

"బాగున్నారా అన్నయ్యా" అంటూ పలకరించింది.

"బాగున్నానమ్మా" అని కాఫీ తాగటానికి ఉపక్రమించాడు. ఇంతలో రాయుడు ఇంటిముందు కారొకటి వచ్చి ఆగింది. ఇద్దరు పెద్దమనుషులు కారుదిగి "రాయుడుగారు ఇంట్లో ఉన్నారయ్యా? " అంటూ వీధివాకిట్లో నౌకరు చంద్రయ్యని అడిగారు. "ఉన్నారు బాబూ" అంటూ చంద్రయ్య వాళ్ళిద్దరికంటే ముందు పరు

## 'ఉంగరం'గ వైభవం

కరుణశ్రీ ఓ పెళ్లికి వెళ్లినపుడు, కొత్త దంపతులకు ఆశీస్సులందిస్తూ చక్కటి పద్యం చెప్పారు. దాని సారాంశమిది. సీతారాముల పెళ్లి వేడుకలో భాగంగా నాగవల్లి జరుగుతోంది. బిందెలో ఉంగరముంచారు. అది వధూవరుల్లో మొదట ఎవరి చేతికి చిక్కుతుందో వారే విజేత. ఉంగరం ముందుగా సీత చేతికే అందింది. అయినా తన రాముడు ఓడిపోకూడదని దాన్ని వెంటనే ఆయన చేతికి అందించింది. విజయహాసంతో అందరికీ చూపించాడాయన. గెలిచామంటూ వరుడి తరఫువారంతా కేరింతలు కొడుతుంటే, ఆమెలో ముసిముసి నవ్వులు. రహస్యమేమిటో ఆ సీతారాములకు మాత్రమే తెలుసు. అనురాగ దాంపత్యానికి అసలైన అర్థం ఇదే కదా అంటారు కరుణశ్రీ సరసంగా.



గెట్టి లోపల వరండాలో కూర్చున్న రాయుడితో "పక్కవూరి నుంచి పెద్దచౌదరిగారు వచ్చారండీ" అని చెప్పేడు. రాయుడు లేచి "రండి, రండి" అంటూ ఆహ్వానించి తమతోపాటు కుర్చీల్లో కూర్చోపెట్టాడు.

చంద్రయ్య గబగబా లోపలికెళ్ళి సీతాదేవికి వచ్చిన అతిథుల గురించి చెప్పేడు. రాములమ్మ చేత వారికి కాఫీలు పంపించింది సీతాదేవి. రాములమ్మ రాగానే సీతారామయ్యే స్వయంగా లేచి ట్రేలోని మంచినీళ్ళ గ్లాసు చౌదరికి, ఆయన తమ్ముడికి ఇచ్చి కాఫీకప్పు కూడా ఇచ్చారు. సీతారామయ్యే మంచినీళ్ళు, కాఫీలు స్వయంగా ఇవ్వటంతో, ఆయన ఇంటి మర్యాదల గురించి చౌదరి, అతని తమ్ముడు కళ్ళతోటే ఒకరినొకరు చూసుకున్నారు.

"మీరు నిలబడి ఇవ్వడం ఎందుకండీ? మేం తీసుకుంటాం కదా? " అన్నాడు చౌదరి.

"మీరు మా ఇంటికి వచ్చారు. వచ్చిన అతిథిని గౌరవించడం మనపద్ధతి కదా" అన్నాడు రాయుడు.

"అందుకే రాయుడుగారూ మన చుట్టుపక్కల గ్రామాల్లో మీరంటే గౌరవం. గౌరవంతోపాటు భక్తి. ఏ నాయకుడు ఈ ప్రాంతానికి వచ్చినా ముందు మీ ఇంటికి రాకుండా వెళ్ళరు కదా" అన్నాడు చౌదరి.

నవ్వుకుని "సరే ఏమిటి ఏదైనా పని మీద వచ్చారా"?

"మా రామాలయంలో సప్తాహం జరుగుతోంది రాయుడుగారూ. రేపు ఆఖరి రోజు. ఇంతవరకూ హరికథ కాలక్షేపం, పురాణ కాలక్షేపం రోజూ జరుగుతున్నాయి. రేపు చక్కటి గాన కచేరి ఏర్పాటు చేశాం. ఆవిడ త్యాగరాయకృతులు, రామదాసు కీర్తనలు చాలా చక్కగా పాడతారట, అది ఒక కార్యక్రమం. పెద్దలు మీరొచ్చి ఆ కార్యక్రమానికి హాజరై తీర్థప్రసాదాలు తీసుకొని మమ్మల్ని ఆశీర్వదించాలని ఆహ్వానించడానికి వచ్చాం" అన్నాడు చౌదరి.

"తప్పకుండా వస్తాను. కుటుంబ సమేతంగా వస్తాను. దైవకార్యం కంటే శుభకార్యం ఏముంది? ఒక దైవకార్యం సందర్శిస్తే పది శుభకార్యాలు జరుగుతాయని మనపెద్దలు అనేవాళ్ళు" అన్నాడు రాయుడు.

ఆదినారాయణనుద్దేశించి "మీరు సకుటుంబంగా ఈ సప్తాహానికి రావాలి" అని ఆహ్వానించి, వారిద్దరూ లేచి బయటికి వెళుతుంటే వేణు ఎదురొచ్చాడు. వేణూ చౌదరి తమ్ముడికి తెలుసు. అతన్ని కూడా ఆహ్వానించి వాళ్ళు వెళ్లిపోయారు.

వేణు లోపలికి రావటంతోటే ఆదినారాయణ "ఊళ్ళోకొచ్చి నెలకావచ్చినా మా ఇంటివైపే రాలేదేమిటయ్యా అల్లుడూ? " అన్నాడు పలకరింపుగా. వేణుకి ఏం సమాధానం చెప్పాలో తోచలేదు.

"మామగారు వచ్చి పిలవకుండా ఎందుకొస్తారయ్యా అల్లుళ్లు" అన్నాడు రాయుడు నవ్వుతూ.

"అదేం లేదు మామయ్యా, ఏదో చదువుకుంటూ ఉండిపోయాను" అని వాళ్ళ దగ్గర కూర్చోకుండా లోపలికెళ్లిపోయాడు వేణు.

ఒక్కక్షణం మౌనం తర్వాత ఆదినారాయణ రాయుడి ముఖంలోకి చూసి "మీతో ముఖ్యవిషయం మాట్లాడదామని వచ్చాను మామయ్యా. వేణు, దుర్గల పెళ్ళి ఈ వేసవికాలంలోనే జరిగితే బాగుండుననుకుంటున్నాను" అన్నాడు.

సీతారామయ్య రాయుడి మొహంవంక చూసి లేచి వెళ్లబోయాడు.

"నువ్వెళ్ళిపోతావు ఏంటి బావా? " అన్నాడు ఆదినారాయణ. సీతారామయ్య కూర్చున్నాడు. రాయుడు ఓ క్షణం ఆలో

చించి "పెద్దవాళ్ళం మనం మాట్లాడుకో వడం సరే. దానికి ముందు ఎదిగిన పిల్లలు కదా వేణుతోటి, దుర్గతోటి కూడ నన్ను ఓసారి మాట్లాడనీ. ఆ తరువాత నిర్ణయాలు తీసుకుందాం" అన్నాడు.

రాయుడి మాటకి ఆ ఇంట్లో సీతారా మయ్యే కాకుండా, అల్లుడు ఆదినారాయణ కూడా ఎదురు చెప్పడు. ఇంతవరకూ చెప్ప లేదు. కాని ఆదినారాయణ పట్టుదల మనిషి. పైగా కోపిష్ఠి కూడా. సీతారా మయ్య ఎంత సౌమ్యుడో ఆదినారాయణ అంత దురుసు. కాని రాయుడు ముందు అణకువగానే వుంటాడు.

"సరే నీ ఇష్టం మామయ్యా. అలాగే కానివ్వండి" అంటూ లేచాడు ఆదినారా యణ.

లోపలున్న భార్య వర్ధనమ్మని పిలి చారు. వెళ్ళొస్తామని అందరికీ చెప్పి ఇద్దరూ బయలుదేరారు. ఆ తరువాత రాయుడు ఇంట్లో ఎవ్వరూ ఎవరితోనూ ఈ విషయం గురించి మాట్లాడలేదు. ఈ సంఘటన తరువాత వేణు కూడా కొంచెం ఇబ్బందిగానే ఫీలయ్యాడు.

★ ★ ★

పక్క ఊళ్ళో జరగనున్న సప్తాహ ముగింపు కార్యక్రమానికి రాయుడు సకు టుంబంగా బయలుదేరాడు. వరలక్ష్మి, సీతాదేవికి కూడా దైవ కార్యాలంటే ఇష్టం కావటంతో అందరూ ఆసక్తిగానే ఆ కార్యక్ర మానికి బయలుదేరారు.

సంగీతమన్నా, పాటలన్నా ఇష్టపడే వేణు గానకచేరీ మీద ఆసక్తితో బయలుదే రాడు. ఆ మాటకొస్తే వేణుగోపాలరాయు డికి కూడా సంగీత, సాహిత్యాలంటే ప్రాణమే. దైవ కార్యానికి వెళ్తే మంచిదని శుభం జరుగుతుందని నమ్మే వర్ధనమ్మ కూడా ఆదినారాయణను, దుర్గను ఆ కార్య క్రమానికి బయలుదేరదీసింది. ఆదినారా యణ కూడా సకుటుంబంగా బయలుదేరి

## కొత్తగాలి... 

**ఇంకెక్కడి కోడి కూత?**
**సెల్‌ఫోనుల హోరుల్లో**
**కోడిగొంతు స్విచ్చాఫ్!**

*- ధరణికోట శివరాంప్రసాద్,*
*హైదరాబాద్*

వచ్చినందుకు రాయుడు సంతోషించాడు. వరలక్ష్మి పక్కన కోడలు సీతాదేవి కూతురు వర్ధనమ్మ కూచున్నారు. ఆ పక్కనే వేణుగోపాలరాయుడు, కొడుకు సీతారామయ్య, అల్లుడు ఆదినారాయణ కూర్చున్నారు. తాతకు మరో పక్క వేణు కూర్చున్నాడు. వారంతా ముందు వరస లోనే ఉన్నారు.

గాన కచేరీ ప్రారంభమయ్యింది.

గణపతి స్తోత్రంలో గాయని సంగీత కచేరీ ప్రారంభించింది. నాలుగు పదుల పైనే వయసు గల ఒక అందమైన స్త్రీ చాలా ఆకర్షణీయంగా ఉంది. చక్కని ఛాయ, నిండైన విగ్రహం. నడి వయసులో ఉన్న ఆమెలో ఏదో ఒక ప్రత్యేకమైన ఆక ర్షణ ఉంది. ఆమె కళ్లు మూసుకొని తంబుర శ్రుతికి అనుగుణంగా రాగాలాపన చేస్తుంటే ఒక అపురూపమైన దేవతా మూర్తిలా అనిపిస్తుంది. వినసొంపైన గాత్రం, రాగాలాపన చేస్తుంటే ఏ రకమైన వికారాలు మొహంలో లేకుండా ఎన్నో సంగతులను అవలీలగా ఆవిడ ఆలపి స్తోంది. సరస్వతి తమ ముందు సాక్షాత్క రించిందా అనే భావన ప్రేక్షకుల్లో కలుగు తోంది. రాగాలాపన పూర్తి కాగానే గణపతి స్తోత్రం ప్రారంభించినపుడు కళ్లు తెర చింది. ఆమె కనులలో ఏదో ఒక మెరుపు, భక్తి పారవశ్యం కొట్టొచ్చినట్లు కనపడుతు న్నాయి.

అలా గంటసేపు పంచరత్నాలు, "రఘు వంశ సుధాంబుధి చంద్రశ్రీ" అనే కృతి, "రామ నీ సమానమెవరురా", "ప్రాణనాథ బ్రోవవే" లాంటి కృతులను ఆలపించింది గాయని. ఆమె తన సంగీతంతో పండిత పామర జనాన్ని ముగ్ధుల్ని చేసింది. తరువాత రామదాసు కీర్తనలు ప్రారంభించింది. "సీతమ్మకు చేయిస్తి చింతాకు పతకమూ", "నను బ్రోవమని చెప్పవే సీతమ్మ తల్లీ" మొదలైన కీర్తనలు మరో గంటసేపు ఆవిడ ఎంతో మధురంగా గానం చేసింది.

ఆమె సంగీతం అందరికీ నచ్చడం ఒక ఎత్తు. రాయుడికి నచ్చడం ఒక ఎత్తు. రాయుడికి బాగా నచ్చింది ఆవిడ గాన కచేరి.

సంగీత కచేరి పూర్తయ్యింది.

చౌదరి స్టేజ్ మీదకు వచ్చి ఇంతవరకూ "మనమందరం ఈ సప్తాహం ఆఖరిరోజు కార్యక్రమంలో శ్రీమతి పారిజాతం గారి సంగీతాన్ని విన్నాం" అనగానే పందిట్లో ప్రేక్షకులు అందరూ చప్పట్లు కొట్టారు. చౌదరి మళ్లీ మాట్లాడటం ప్రారంభించి, "ఇప్పుడు పెద్దలు వేణుగోపాలరాయుడు గారు వేదిక మీదకు వచ్చి శ్రీమతి పారిజాతాన్ని పుష్పమాలతోటి, శాలువతోనూ సత్కరించి పారితోషికం అందచేస్తారు" అన్నాడు.

వేణుగోపాలరాయుడు వేదిక మీదకు వెళ్ళి తన భార్య వరలక్ష్మిని కూడ వేదిక మీదకు పిలిచారు. ఆమెకు బొట్టు పెట్టి పుష్పమాల వేయమన్నాడు. వరలక్ష్మి పారిజాతం నుదుట బొట్టు పెట్టి పుష్పమాల వేసింది. ఆ తరువాత వేణుగోపాలరాయుడు శాలువా కప్పి చౌదరిచ్చిన కవరు పారిజాతం చేతికి ఇచ్చారు. "ఈ డబ్బు ఎంతో చెప్పచ్చా" అన్నాడు చౌదరితో రాయుడు. పదివేలు అన్నాడు చౌదరి రాయుడు ఒక్కడికే వినపడేలా. నిలబడి వున్న రాయుడు, వరలక్ష్మిలకు పాదాభివందనం చేసింది పారిజాతం. వరలక్ష్మి "లేమ్మా లే. సరస్వతీ దేవిలా ఉన్నావు" అంటూ అభినందించింది. వారిరువురూ చూపిన ఆప్యాయతకు వారి ఆకృతికి చలించిపోయిన పారిజాతం "ఇవాళ ఈ రామ సన్నిధిలో పార్వతీ పరమేశ్వరులను దర్శించినంత ఆనందంగా ఉందమ్మా మిమ్మల్ని ఇద్దర్నీ చూస్తుంటే. రాముడు కూడా పరమేశ్వర భక్తుడే అంటారు కదమ్మా" అంది చిరునవ్వుతో. "సంగీతంలో ప్రావీణ్యమే కాకుండా కావ్య పరిచయం కూడా బాగానే ఉన్నట్టుంది. సంతోషం" అని రాయుడు సభనుద్దేశించి, "మనందరం ఒక చక్కటి సంగీత కచేరీ విన్నాం. మనందరిలో భక్తి భావం కలిగింది. ఎవ్వరూ కదల్లేదు. అందరూ ఆనందించారు. పారిజాతం కచేరీ నాకు బాగా నచ్చింది. మా వూళ్లో వేణుగోపాలస్వామి ఉత్సవాలు జరిగే సందర్భంలో పారిజాతంగారి కచేరీ ఏర్పాటు చేస్తాం. మీ అందరూ మా వూరు రండి. మళ్లీ మరోసారి వినచ్చు వీరి సంగీతాన్ని" అన్నాడు. కొడుకు సీతారామయ్య వంక చూసి, "నాన్నా వీరి అడ్రస్సు తీసుకొని అడ్వాన్స్ ఇచ్చి కార్యక్రమం వివరించిరా... వారి వూరికి వెళ్లి" అన్నాడు. పారిజాతం మరోసారి రాయుడుకి భక్తిపూర్వకంగా నమస్కరించింది.

వేణు పారిజాతం దగ్గరికి వెళ్లాడు. ఆమె స్టేజ్ దిగగానే నమస్కరించాడు. "మీరు చాలా బాగా పాడారు. మీ గురువులు ఎవరు? " అన్నాడు.

"ముందు మా అమ్మ, తరువాత స్వయం సాధనం" అంది పారిజాతం నవ్వుతూ.

ఒక్క క్షణం వేణుని చూసింది ఎవరూ అన్నట్టు. "నేను రాయుడుగారి మనవణ్ని. నా పేరు వేణు" అన్నాడు.

"ఈ తరం యువతకు శాస్త్రీయ సంగీతం పట్ల ఇంత ఆసక్తి, అభిలాష ఉండటం అరుదు. మీలో శాస్త్రీయ సంగీతం పట్ల ఉన్న ఆసక్తి చూస్తే నాకు చాలా ఆనందంగా ఉంది. మీరూ తాతకు తగ్గ మనవడుగానే ఉన్నారు" అంది అభినందన పూర్వకంగా పారిజాతం. మరోసారి బాగా పాడారని అభినందించి వేణూ తిరిగొచ్చాడు.

ఆ తరువాత రెండు మూడు రోజులు వేణుగోపాలరాయుడు ఇంట్లో పారిజాతం సంగీత కచేరీయే చర్చనీయాంశమయ్యింది. ఆమె గానం అందర్నీ మెప్పించింది.

ఒకరోజున రాయుడు, వేణు గుడికి వెళ్లారు. అక్కడ పారిజాతం సంగీతం గురించి ఇద్దరూ కాసేపు మాట్లాడుకున్నారు. "వేణూ.. ఏవిధమైన అలసట, శ్రమ లేకుండా ఎంత చక్కటి సంగతులైనా అవలీలగా అనగలుగుతున్నారు, పాడగలుగుతున్నారామె". తాత ఆపాడు. "చాలా కృషి చేశారు. చాలా కమిట్‌మెంట్ కన్పిస్తోంది ఆవిడలో" అన్నాడు వేణు. రాయుడు నవ్వుకున్నాడు.

"సంగీతానికి కావాల్సింది సాధన తాతా. కచేరీ ఉన్ననాడు పాడితే చాలదు. నిరంతర సంగీత సాధన తన ఆనందం కోసం చేసేవాడే నిజమైన గాయకుడు" అన్నాడు రాయుడు.

"యువార్ కరెక్టు తాతా, నువ్వు గొప్ప విమర్శకుడివి" అన్నాడు అభినందన పూర్వకంగా వేణు. ఇద్దరూ ఆలయంలో ఒక చోట కూర్చున్నారు. కొద్దిసేపు మౌనం తరువాత "దుర్గ పెళ్లి గురించి మామయ్య అడగటానికి వచ్చాడు. నిన్ను కనుక్కుని చెబుతానన్నాను. నీ ఉద్దేశం ఏమిటో సూటిగా చెప్పు. మనం తాతా మనవళ్లమే కాదు, మంచి ఫ్రెండ్స్ కదా తాతా" అన్నాడు రాయుడు.

## కొత్తగాలి...

**వధూవరుల తలంబ్రాల్లో వాళ్ల తల్లిదండ్రులు జీవిత పర్యంతం ఒక్కొక్క బియ్యపు గింజలా దాచిన రూపాయలే కనిపిస్తున్నాయి**

*-ఉమాబాల చుండూరు, హైదరాబాద్*

"నాకు ఇప్పట్లో పెళ్లి చేసుకునే ఉద్దేశం లేదు తాతా. పైగా దుర్గని నేను ఎప్పుడూ ఆ దృష్టితో చూడలేదు. పి. హెచ్‌డి అయిన తరువాత..." అని ఏదో అనబోతుంటే,

"పి. హెచ్‌డికి పెళ్లికి లింకు పెట్టకు తాతా. పి. హెచ్‌డి రెగ్యులర్ కోర్సు కాదు. సావకాశంగా ఉద్యోగం చేసుకుంటూ పి. హెచ్‌డి చెయ్యొచ్చు. పెళ్ళైయ్యాక సావకాశంగానూ పి. హెచ్‌డి చెయ్యొచ్చు. పి. హెచ్‌డి అంటే నువ్వు స్వయంగా చేసే రచన కాదు. ఒక విషయం గురించి విస్తృతంగా చదివి దాన్ని క్రోడీకరించి వ్యాఖ్యానిస్తూ రాసే సమగ్ర పరిశీలనా గ్రంథం. నేను కాగితం మీద పెట్టలేదు. కానీ బి.ఏ. పాసయ్యాక ఈ పల్లెటూళ్లో వ్యవసాయం చేస్తూ, లైబ్రరీ పెట్టుకొని ఒకొక్క రచయిత కంప్లీట్ వర్క్సని చదివి మళ్ళీ చదువుతూ నేను చేస్తున్న పనీ అదే! అఫ్‌కోర్స్.. నేను దాన్ని పి. హెచ్‌డి అనను. నా తృప్తికోసం నేను చేసుకుంటున్న సాహిత్య వ్యాసంగం. చదవడం అనే అలవాటు వల్ల ఎందరో గతించిన మహానుభావుల భావసాక్షాత్కారం, మనో సాక్షాత్కారం లభిస్తాయి. ఈ విషయం అలా పక్కన పెట్టు. ఇప్పుడు కాకపోయినా కాస్త ఆలస్యమయినా దుర్గను పెళ్లి చేసుకునే ఉద్దేశం నీకు ఉందా లేదా సూటిగా నాతో చెప్పు" అన్నాడు వేణుగోపాలరాయుడు.

"దుర్గ అందంగా లేదని, బాగాలేదని నేను అనటం లేదు తాతా. నచ్చలేదని అనటం లేదు. అది నాలాగే మనింట్లో పెరిగిన అమ్మాయి. ఎందుకో దుర్గను భార్యగా ఊహించలేక పోతున్నాను. దాని పద్ధతికి నేను సరిజోడు కాదనుకుంటున్నాను" అన్నాడు వేణు.

"నైస్ మై బాయ్. స్త్రీని గౌరవించే పద్ధతిలో మాట్లాడావు. నీ సంస్కారం నాకు నచ్చింది. నీ మనసు నాకు అర్థం అయ్యింది. యువార్ గ్రోన్ అప్ మ్యాన్. నీ అభిప్రాయాలు నీకు ఉండటం సహజం. పద ఇంటికి వెళదాం" అంటూ లేచాడు రాయుడు.

ఇద్దరూ ఇంటికి వచ్చారు. వేణు మనసు తేలికపడింది.

సాధ్యమయినంత త్వరలో పి. హెచ్‌డి. ప్రారంభిస్తే మంచిదనుకున్నాడు. సబ్జక్టును బట్టి గైడ్‌ను ఎంపిక చేసుకోవడం కోసం యూనివర్సిటీకి వెళితే మంచిదనుకున్నాడు.




**వే**ణు తాత రాయుడు దగ్గరికి వచ్చే ముందే అనుమతి తీసుకోవడంతో, పి. హెచ్‌డి. ఎన్‌రోల్‌మెంట్ కోసం వేసవి శెలవులు పూర్తికాకుండానే ప్రయాణమయ్యాడు.

"ఇప్పుడు సెలవులు కదా" అని తండ్రి అన్నాడు.

"రెగ్యులర్ కోర్సులకి సమ్మర్ హాలీడేస్ తప్ప పి. హెచ్‌డిలకు సెలవుల పట్టింపు ఉండదు" సమాధానం చెప్పాడు.

అమ్మకు, నానమ్మకు కూడా చెప్పి ప్రయాణానికి సిద్ధమయ్యాడు. వేణు ఇంట్లో అందరికీ గారాబం కావడంతో ఎవరూ అడ్డు చెప్పలేదు. ముందుగా రాజమండ్రి వెళ్లి ఆ కాలేజీ ప్రొఫెసర్స్‌ను సంప్రదించి వైజాగ్ వెళ్లాలని నిర్ణయించుకున్నాడు. రాజమండ్రి కాలేజీ లైబ్రరీ కంటే వైజాగ్ యూనివర్సిటీ లైబ్రరీ పెద్దది కావడం, అధునాతనమైన పుస్తకాలు, జర్నల్స్ కూడా దొరుకుతాయనే ఉద్దేశంతో పి. హెచ్‌డి అక్కడ చెయ్యాలని నిర్ణయించుకున్నాడు.

వేణు వెళ్ళబోయే ముందు రాయుడు కావలిసిన డబ్బు ఇస్తూ "నీ ఆల్బమ్ ఇక్కడ ఉంచివెళ్లు తాతా. అప్పుడప్పుడు నిన్ను చూసుకునేందుకు వీలుగా ఉంటుంది" అన్నాడు.

"ఆల్బమ్ అక్కడికెందుకు తాతా... అది ఇక్కడే వుంచుకో" అన్నాడు వేణు.

వేణు బయలుదేరేడు.

రాజమండ్రి చేరుకుని రెండు రోజులున్నాడు. ఆ రెండు రోజులలోనూ తమ ప్రిన్సిపాల్ రామకృష్ణని, ప్రొఫెసర్‌ను కలుసుకున్నాడు. ప్రొఫెసర్ దగ్గరనుంచి, రామకృష్ణ దగ్గరినుంచి వేణు రెండు పరిచయ లేఖలను తీసుకుని విశాఖపట్నం బయలుదేరాడు.

ఆంధ్ర యూనివర్సిటీ చేరుకున్నాడు. వేణు తెచ్చిన లెటర్స్ మూలంగా తాను కలిసిన ప్రొఫెసర్ విశ్వనాథం చాలా చక్కగా స్పందించి వేణుకు గైడ్‌గా వ్యవహరించడానికి అంగీకరించాడు. సబ్జెక్టు గురించి ఆలోచించి నిర్ణయం తీసుకుందామని అన్నాడు విశ్వనాథం.

విశ్వనాథంగారి రికమెండేషన్‌తో ప్రస్తుతానికి యూనివర్సిటీ హాస్టల్‌లోనే ఒక రూము దొరికింది వేణుకి.

రోజులు గడుస్తున్నాయి.

ఒకరోజున సబ్జక్టు కూడా నిర్ణయం చేశారు ప్రొఫెసరు విశ్వనాథం. అటువంటి సబ్జక్టు అయితే స్కోప్ ఎక్కువగా ఉంటుందని దానికి సంబంధించిన రిఫరెన్స్ బుక్స్, జర్నల్స్ కూడా విరివిగా దొరుకుతాయని సూచించారు ఆయన.

"ఇంతకీ నీకు దేవాలయాలకు సంబంధించిన విషయాలు అంటే ఆసక్తి ఉందా?" అని వేణుని ప్రశ్నించాడు విశ్వనాథం. "మా తాతగారి ధర్మకర్తృత్వంలో నిర్వహించబడుతున్న వేణుగోపాలస్వామి ఆలయం మా వూళ్లో వుందండీ. ఆయనే మా కులదైవం కూడా" అన్నాడు వేణు.

"చాలా సంతోషం"

"అయితే ఆలయాలు- చారిత్రక నేపథ్యం, స్థలపురాణం, వాటి మధ్య సమన్వయం, మొత్తం మీద దేవాలయాల మీద సబ్జక్టు అనుకో. అటు హిస్టరీకి ఇటు ఆర్కియాలజీకి కూడా సంబంధించిన సబ్జక్టు. ఇక నీ ఓపిక" అన్నాడు విశ్వనాథం.

వేణు ఆనందించాడు. తృప్తిగానూ వుంది తనకు. మన సంస్కృతి సాంప్రదాయాలు, మన ధర్మం, మన ఆధ్యాత్మిక సిద్ధాంతాలు మొదలైన వాటికి 'గుడి ఒక బడి' అనుకున్నాడు. ఈ ఆలోచనలతో దానికి సంబంధించిన ప్రయత్నాలలో రోజులు గడుస్తున్నాయి.

ఒక రోజున శ్రావణి తాను ఆంధ్రా యూనివర్సిటీ 'లా' కాలేజీ నుంచి వచ్చానని ఇంటర్వ్యూలో చెప్పిన మాటలు గుర్తుకొచ్చాయి. యూనివర్సిటీ 'లా' కాలేజీకి వెళ్లాడు. రెండు రోజుల్లో కాలేజీ రీ ఓపెనింగ్ కాబోతోందని అక్కడ ఉన్న ఆఫీసు సిబ్బంది నుంచి అటెండర్స్ నుంచీ తెలుసుకున్నాడు.

## కొత్తగాలి...

**ఇకనుండి ఉత్తర ప్రత్యుత్తరాలు అన్నీ తెలుగులోనే రాయాలని కలెక్టరుగారు ఇంగ్లీషులో ఆర్డరు పాస్ చేశారు మరి!**

*- వి.ఎ.ఎస్ ప్రసాద్, తెనాలి*

ఆమె తన నేటివ్‌ప్లేస్ ఢిల్లీ అని చెప్పడం కూడా తనకి గుర్తుంది. తన నేటివ్‌ప్లేస్ మాత్రం ఇంటర్వ్యూలో కానీ శ్రావణికి కాని చెప్పినట్లు తనకి గుర్తులేదు. శ్రావణి తన ఫోన్ నెంబరు ఇవ్వలేదు. తన నెంబరు తీసుకోలేదు. అలా అక్కడ గంటలు గడిచిపోయాయి.

రోజులు గడిచినా జ్ఞాపకాలు మరుగున పడలేదు. ఒకసారి శ్రావణిని చూస్తే బాగుండుననిపించింది. శ్రావణి థర్డ్ ఇయర్ లా చదువుతున్నానన్న మాటలు గుర్తున్నాయి. ఇప్పుడు ఫోర్త్ ఇయర్‌లోకి వస్తుంది. ఫోర్త్ ఇయర్ 'లా' క్లాసెస్ ఎప్పటి నుంచి ప్రారంభమవుతాయో అటెండర్‌ను కనుక్కున్నాడు. ఎల్లుండి నుంచే సెకండ్ ఇయర్ నుంచి ఫైనల్ ఇయర్ వరకూ 'లా' క్లాసెస్ బిగిన్ అవుతాయని, ఫస్టియియర్ క్లాసెస్ మాత్రం లాసెట్ అయ్యాక లేటుగా బిగిన్ అవుతాయని అటెండర్ నుంచి తెలుసుకున్నాడు.

మళ్ళీ తన గొడవలో పడిపోయి తరచూ లైబ్రరికీ వెళుతూ, ప్రొఫెసర్స్‌ని కలుస్తూ, సాయంకాలం బీచ్‌కి వెళుతూ రోజులు గడుపుతున్నాడు. నాలుగు రోజులు గడిచాయి.

ఒకరోజున అనుకోకుండా శ్రావణితో కలసి హైదరాబాద్ పోటీలకు వచ్చిన రాణి తనను గుర్తుపట్టి 'ఏమండీ, మిస్టర్ వేణూ, వేణుగారూ' అంటూ వెనకనుంచి

అరవడం మొదలెట్టింది.

ఆమె పరిగెత్తుకుంటూ వేణు దగ్గరికి వచ్చింది. "నన్ను గుర్తుపట్టారా? " అంది ఆయాసపడుతూ.

"వెనకనుంచి పిలిచారు కదా! వెనక నుంచి కూడా నన్ను గుర్తుపట్టారా" అన్నాడు వేణూ నవ్వుతూ.

"లేదండీ బాబూ. మీరు రోడ్డుపక్కన నడుస్తుంటే నేనెక్కిన బస్సు మిమ్మల్ని క్రాస్‌చేసి వెళ్ళిపోయింది. బస్సులోంచి అరిస్తే ఈ వూళ్ళో పిచ్చాసుపత్రి కూడా వుందికదా. నన్ను పిచ్చిదాన్ని అనుకుంటా రని బిగపట్టుకుని కూర్చున్నాను. లక్కీగా బస్‌స్టాప్ దగ్గరగా ఉండటంతో దిగి మీకోసం అరుస్తూ పరిగెత్తాను" అని తను ఎలా గుర్తుపట్టానో వివరించింది.

వేణు ఆమెను చూసి ఆమె వెనక్కి కూడా ఒకసారి చూసాడు. నెమ్మదిగా శ్రావణి నడచివస్తోందేమోనని.

"ఎవరికోసం చూస్తున్నారు, నేను మీ ముందు నిలబడితేను" అంది రాణి తనూ వెనుకకు తిరిగిచూసి.

"ఇంతకీ మీ ఫ్రెండ్ ఎక్కడ? " అన్నాడు వేణు.

"ఎవరు రాజానా, ఆ పోటీలలోనే ఫ్రెండ్"

"మీకు బాయ్ ఫ్రెండ్స్ తప్ప గర్ల్‌ఫ్రెండ్స్ ఉండరా. నేనడిగింది మీ గర్ల్‌ఫ్రెండ్ కోసం"

"ఓ శ్రావణి కోసమా! శ్రావణి మా టీమ్ లీడర్ అండీ. తనని ఎవరేనా ఫ్రెండ్, గిండూ అంటే బాయ్స్‌ని, గర్ల్స్‌ని ఎవ్వరినీ ఊరుకోదు. ఫ్రెండ్‌షిప్ అంటే చాలా విలువైనదని, ఒక వ్యక్తికి జీవితంలో ఒకరిద్దరు ఫ్రెండ్స్ దొరకటమే కష్టమని, ఫ్రెండ్ అనే పదాన్ని చవకగా వాడకూడదని ఉపన్యాసం ఇస్తుంది" అంది రాణి.

వేణూ నవ్వుకున్నాడు.

"ఇంతకీ శ్రావణి ఎక్కడ? " అన్నాడు.

"లేదు కదా" అంది.

"లేదా చదువు మానేసిందా? " అన్నాడు.

"నో... నో నాతో రాలేదు. చదువు మానేయడం కాదు, ఉమెన్స్ హాస్టల్ రూమ్ నెం. తొమ్మిదిలో ఫస్ట్‌ఫ్లోర్‌లో ఉంటుంది. ఇటూ అటూ తిరిగే మనిషి కాదు. ఎప్పుడూ చదువు. సమయం దొరికితే డాన్స్ ప్రాక్టీసు. ఒక్క శనివారం మాత్రం తప్పనిసరిగా రామకృష్ణమఠం దగ్గరికి, బీచ్‌కి వస్తుంది" అంది.

"మొత్తం అడ్రస్సు వేర్ అబౌట్స్ చెప్పేశారు. చాలా థ్యాంక్సు" అన్నాడు వేణు.

"అయితే నేవెళ్ళొచ్చా. ఇంక నాతో మాట్లాడేదేమీ లేదుకదా" అంది రాణి నిరుత్సాహంగా.

"అదేం లేదు రండి. కాఫీ తాగుదాం హోటల్ కెళ్లి" అన్నాడు వేణు.

"వద్దులేండి, బతిమాలి పిలిపించుకున్నట్లు ఉంది" అంటూ బస్టాప్‌వైపు వెళ్ళిపోయింది.

అప్పటినుంచీ తనకు తెలియకుండానే శనివారం సాయంత్రం కోసం వేణు నిరీక్షణ ప్రారంభమయ్యింది.

★ ★ ★

శ్రావణి యూనివర్సిటీ లా కాలేజీ క్యాంటిన్ దగ్గర నిలబడి టిఫిన్ తింటోంది.

"హల్లో శ్రావణి" అంటూ తుపాన్‌లా వచ్చింది రాణి.

"అరుపులెందుకు? " అంది శ్రావణి.

"అరుపులు కాదు, మొన్న మన సింగర్ హీరో కనపడ్డాడే" అంది రాణి.

"కల్లోనా? " అంది శ్రావణి పట్టించుకోనట్టు.

"కలలో కాదు శ్రావణీ, లీలామహల్ సెంటర్‌లో నేను బస్సులో వెళుతుంటే కనపడ్డాడు" అంది రాణి.

"ఎవరిని చూసి ఎవరనుకొన్నావో?" అంది శ్రావణి.

"నేను బస్సుదిగి పరిగెత్తుకెళ్ళి మనిషిని పట్టుకొని ఎలా వున్నారు, ఎక్కడ వున్నారు, ఏం చేస్తున్నారని నేనడిగితే నాతో మాట్లాడటం మానేసి శ్రావణి ఎక్కడ, శ్రావణి ఎక్కడ అంటూ ఆయన శ్రావణ జపం చేస్తున్నాడు"

ఆ మాటలకు శ్రావణిలో కొంచెం ఆసక్తి కలిగింది.

"ఇంతకీ ఎక్కడ వుంటున్నారన్నారు?" అని అడిగింది శ్రావణి.

"వైజాగ్‌లోనే"

"ఎందుకట?"

"నేను అడగలేదు, ఆయన చెప్పలేదు" అంది రాణి.

"పోనీ వైజాగ్‌లో ఎక్కడ అడిగావా?"

"అదీ అడగలేదు"

"పోనీ సెల్ నెంబరు తీసుకున్నావా?" అంది శ్రావణి.

"అదీ అడగలేదు"

"మరి ఏమడిగావ్?"

"ఎత్తు, లావు చూస్తూ నిలబడిపోయా. ఆయన నీ గురించి అడుగుతుంటే, నువ్వు లా కాలేజ్ ఉమెన్స్ హాస్టల్ ఫస్ట్‌ఫ్లోర్‌లో రూమ్‌నెం తొమ్మిదిలో ఉంటావని చెప్పా" అంది రాణి.

"అది లాస్ట్‌ఇయర్. ఈ సంవత్సరం రూం నెం పదిహేను. ఏదో నా గురించి అడిగితే నా రూం నెంబరూ, బయోడేటా ఎందుకే ఆయనకివ్వడం?" అంది శ్రావణి.

"రూం నెంబరు ఇచ్చాను. సెల్‌నెంబరు ఇచ్చాను. శనివారం సాయంకాలం రామ కృష్ణ మఠం వైపు, బీచ్‌కి ఈవినింగ్ షైర్‌కి వస్తావని చెప్పాను. ఆ పైన ఇంకేమి చెప్ప లేదు" నవ్వుతూ వెళ్ళిపోయింది.

"ఇంకేం మిగిల్చావు చెప్పటానికి" అనుకుంది శ్రావణి నవ్వుకుంటూ రాణి వెళ్ళిన వైపే చూస్తూ.

★ ★ ★

సెల్ మోగింది. చూసింది శ్రావణి. అది కొత్తనెంబరు. ఎప్పుడూ చూసినట్టు గుర్తులేదు. చటుక్కున వేణు గుర్తొచ్చాడు శ్రావణికి. వేణూ ఏమోనని సెల్ చెవి దగ్గర పెట్టుకుంది.

"హలో శ్రావణి గారేనా?" అన్న పలక రింపు వినిపించింది శ్రావణికి.

అది వేణు గొంతు.

అతని గొంతు చక్కని పాటలు పాడిన అతని స్వరం తనకి బాగా గుర్తే. తత్తరప డుతూ, "అవునండీ. ఈజ్ ఇట్ మిస్టర్ వేణూ?" అంది శ్రావణి.

అవతల పక్కనుంచి వేణూ నవ్వేడు. "వేణూనే మాట్లాడుతున్నాను. శ్రావణి గారేనా అని అడిగాను. అయితే అవున నచ్చు, కాకపోతే కాదనవచ్చు మధ్యలో మళ్ళీ ఇంగ్లీషు ఎందుకండి? మన ఇద్దరం తెలుగువాళ్ళమే కదా. ఇంగ్లీషు వీడని బంధమా మీది. పైగా మీ నాన్నగారికి తెలుగు సంస్కృతి అంటే ఇష్టం. అందుకే ఇంటర్ నుంచి ఆంధ్ర ప్రాంతంలోనే చదు వుకుంటున్నానని ఇంటర్వ్యూలో ఉపన్యా సాలు" అన్నాడు వేణు.

"ఏమో అనుకున్నాను... మీకు అన్నీ గుర్తే" అంది.

తర్వాత, "మీ ముందు నేను ఇంగ్లీషు మాట్లాడను" అంది శ్రావణి.

"సెల్‌లో మీముందు ఉండను కాబట్టి ఇంగ్లీషులో మాట్లాడతారా?" అన్నాడు వేణు.

వేణు మాటకు శ్రావణి నవ్వుతూ "మొట్టమొదటి కాల్‌లోనే ఇలా క్లాసు తీసు కుంటే ఎలా మహానుభావా! ఒక్క ఇంగ్లీషు పదం లేకుండా మాట్లాడమంటే నీళ్ళు కల పకుండా పాలు దొరకటమంత కష్టం. రాళ్ళు లేకుండా రేషన్‌బియ్యం దొరకట

## కొత్తగాలి...

మొగ్గ స్నానించి
మంచులో మునిగి
డిసెంబరు పువ్వయింది
కొత్తసంవత్సరానికి
ఆహ్వానం పలికింది!

—డి. హెచ్.సంతోష్, దొడ్డనకుండి, బెంగళూరు

మంత కష్టం. అవినీతి లేకుండా పరిపాలన నడపడమంత కష్టం.."

వేణు శ్రావణిని కట్ చేస్తూ "మీ సామాజిక స్పృహ నాకు అర్థమయ్యింది కానీ ఇంతకీ ఈవేళ సాయంకాలం బీచ్‌కి వస్తున్నారా లేదా? ఒకవేళ వస్తే మీ కోసం నేను ఎక్కడ నిలబడాలి, మిమ్మల్ని కలవటం ఎప్పుడు, ఎక్కడ ఎలా? " అన్నాడు వేణు.

శ్రావణి చిన్నగా నవ్వి "అప్పుడే, అక్కడే, సాయంత్రం అయిదున్నరకు మీ సెల్‌కి అంటే ఈ సెల్‌లో ఫీడైన నెంబరుకి రింగ్ చేస్తాను"

"సరే సాయంత్రం అయిదున్నర...

బీచ్‌రోడ్డు" అని వేణు ఫోన్ కట్ చేశాడు.

చాలా సరదా మనిషి అనుకుంది శ్రావణి.

నాలుగుగంటల నుంచే శ్రావణి తయారై కూర్చుంది, బీచ్‌కి వెళ్ళటానికి.

ఐదుగంటలకి బయలు దేరదామనుకుంది. పావుతక్కువ అయిదుగంటలకు చినుకులు, గాలి ప్రారంభమయ్యాయి.

ఈ వర్షం ముదిరితే బీచ్‌కి వెళ్ళటం ఇబ్బంది. బీచ్‌లో గాలి మరీ తీవ్రంగా ఉంటుంది అని భయపడసాగింది శ్రావణి.

శ్రావణిని కలవాలని తహతహలాడుతున్న వేణు కూడా వాతావరణం చూసి నిరుత్సాహపడ్డాడు. ఈ చినుకులు, గాలిలో ఏమొస్తుంది పాపం అనుకున్నాడతను.

'వెళ్ళకపోతే వస్తానని రాలేదనుకుంటాడేమో' అనుకుంది శ్రావణి.

'తీరా తను వచ్చివుంటే, నేను కనపడకపోతే డిజప్పాయింట్ అవుతుందేమో' అనుకున్నాడు వేణు.

పోనీ కాల్ చేసి వస్తున్నాడో లేదో కనుక్కుంటే. అలా కాల్ చేస్తే సరేలెండి మరో రోజు కలుద్దాం అంటే. ఈ రోజు అనుకున్న ప్రోగ్రామ్ అంతా ఎప్పటికో పోస్ట్‌పోన్ అయిపోతుంది. లేదూ ఫోన్ చెయ్యకుండా బీచ్‌కి వెళ్ళిపోవడమే మంచిది.

ఒకవేళ వాతావరణం బాగా లేదని మానేద్దామనుకున్నా తను బీచ్‌లో వెయిట్ చేస్తున్నానని చెబితే? నేనంటే ఏ మాత్రం ఇష్టమున్నా తప్పకుండా వస్తాడు. అదే మంచిది. ఐ గోటూ బీచ్ అనుకుని లేచింది శ్రావణి.

వేణూ పరిస్థితి కూడా అదే. ఏమయినా శనివారం సాయంత్రం కలవాలని నాలుగు రోజుల నుంచీ తను వెయిట్ చేస్తున్నాడు. ఫోన్ చేస్తే తను తర్వాత కలుస్తాననవచ్చు అక్కడికి వెళ్ళి వెయిట్ చేసే ఛాన్స్ తీసుకుందామని అనుకున్నాడు వేణు. నేను బీచ్‌లో వెయిట్ చేస్తున్నానని తెలిస్తే తనూ నా కోసం బయలుదేరి ఉండకపోతే తప్పకుండా బయలుదేరుతుంది. బీచ్‌లో కూడా ఏవో హోటల్స్, షెల్టర్స్ ఉన్నాయి కదా. అయినా తడవడం కూడా సరదా. ఇద్దరం తడుస్తూ నడవడం మరీ సరదాగా ఉంటుంది అనుకున్నాడు వేణు. అతనూ బీచ్‌కి బయలుదేరేడు.

ప్రకృతి కొందరిని కలపటానికి ఇష్టపడకపోతే కొందరిని కలపటానికి సహకరిస్తుంది. గాలివాన సూచనలతో బీచ్‌లో జనం రద్దీ అంతగా లేదు. బీచ్ పల్చగా ఉంది. అతితక్కువ జనంలో శ్రావణి, వేణు ఒకరినొకరు దూరం నుంచి చూసుకొని

చాలా వేగంగా ఇద్దరూ దగ్గరకొచ్చి ఒకరె దురుగా ఒకరు నిలబడ్డారు. ఐదారునెల్ల తరువాత మళ్ళీ కలుసుకున్నారు వాళ్ళి ద్దరూ.

హైదరాబాద్ స్టేజ్ మీద ఇద్దరూ ఆడుతూ పాడుతూ కలుసుకుంటే, విశాఖ పట్నం బీచ్‌లో అతిచల్లని వాతావరణంలో ఒకరినొకరు చూపులతోనే పలకరించు కుంటూ, ఒకరినొకరు చూపులతోనే స్పృశించుకుంటూ నిలబడ్డారు.

"ఇలా ఎంతసేపు అతను మనల్ని చూస్తాడు" అంది శ్రావణి.

"ఎవరు" అన్నాడు వేణు.

"సముద్రుడు" అంది శ్రావణి వేణూ మొహంలోకి చూస్తూ.

"సరే పదండి, ఆ క్యాంటిన్‌లోకి వెళ్ళి కూర్చుందాం" అన్నాడు వేణు.

"అప్పుడు క్యాంటిన్‌లోని జనం అంతా మననే చూస్తారు" అంది శ్రావణి.

"సముద్రుడు చూడడు కదా" అన్నాడు వేణు.

ఇద్దరూ క్యాంటీన్‌లో కూర్చున్నారు.

ఒకరినొకరు చూసుకుంటూ అప్పుడ ప్పుడూ మాట్లాడుకుంటున్నారు. ఒక రకంగా అది వాళ్ళిద్దరి కలయిక.

అలా నాలుగైదు శనివారాలు గడి చాయి.

ప్రతి శనివారం కలవటం పోయి రెండో నెల నుంచీ రోజు విడిచి రోజు కలవ కుండా ఉండలేకపోతున్నారు వాళ్ళిద్దరూ. వాళ్ళిద్దరి కలయికలో ఎవరికి వారే ఏదో మాటలకందని అనుభూతిని పెంచుకు న్నారు. ఒకరిపట్ల ఒకరికి ప్రేమతోపాటు గౌరవం కూడా పెరుగుతూ వచ్చింది.

అరమరికలు చెరిగిపోయాయి.

మనసులు ఒక్కటయ్యాయి.

అయినా మనుషులు హద్దులు దాట లేదు.

ఏ దాపరికం లేకుండా వేణుతో తనకు పెరుగుతున్న పరిచయం గురించి, వేణు వ్యక్తిత్వం గురించి అన్నీ పూస గుచ్చినట్టు తన మేనత్తకి, తండ్రికి శ్రావణి తెలియచే స్తూనే వుంది. భీమశంకరం త్వరలోనే తాను వచ్చి శ్రావణిని కలుస్తానని, వేణు పెద్దలతో మాట్లాడతానని శ్రావణికి చెప్పాడు. ఆ విషయం వేణుకి శ్రావణి చెప్పలేదు. కాని ఆరోజు కోసం శ్రావణి వేయికళ్ళతో ఎదురుచూస్తోంది.

★ ★ ★

శ్రావణి కాలేజీకి వెళ్లడానికి సిద్ధమ య్యింది. బుక్స్ సర్దుకుంటూ ఉండగా సెల్ మోగింది. కాల్ వేణూనించేనని తెలిసింది నంబరు చూడగానే.

'హల్లో' అంటూ పలకరించింది.

"నువ్వు క్లాస్‌కి వెళ్తే సెల్ స్విచ్ఆఫ్ చేస్తావు కదా. అంతకుముందే ఫోన్ చెయ్యాలని తొందరగా చేశాను. నిన్న నీకు చెప్పటం మరచిపోయాను. ఈవేళ పౌర్ణమి. నిండు పున్నమి రోజున సముద్ర తీరాన ఇద్దరం కూర్చుని పున్నమి అందాలు, వెన్నెల వెలుగులను చూస్తే బాగుంటుందిగా. సాయంత్రం త్వరగా వ చ్చేయ్. పున్నమినాడు చంద్రుడు త్వరగా ఉదయిస్తాడు" అన్నాడు వేణు.

"వస్తాను కానీ ఆ ప్రశాంత వాతావరణా నికి స్పందించి నువ్వు పాట మొదలు పెడ తావు. నన్ను ఆడమంటావు" అంది.

"అక్కడికి వెళ్లాక ఏం చేస్తానో నువ్వే చూద్దువుగాని, నేను పాడను అని మాటి స్తున్నాను. వీలయినంత పెందలాడే వచ్చే య్" అన్నాడు వేణు.

శ్రావణి సరేనంది.

ఇద్దరూ ఎప్పుడు సాయంత్రం అవు తుందా అని ఎదురు చూస్తున్నారు.

పాడను ఏం చేస్తానో నువ్వే చూద్దువు గాని అన్నాడు వేణు. మరి ఏం చేస్తా

డబ్బా. ఏం చెయ్యబోతున్నాడో అనుకుంది శ్రావణి.

క్లాస్ అయిపోగానే శ్రావణి హాస్టల్ కెళ్లి ఒక లైట్ కలర్ శారీ కట్టుకుని మాచింగ్ బ్లౌజ్ వేసుకుని అలంకరించుకొని అద్దంలో తనని తాను పదేపదే చూసుకుని బీచ్‌కి బయలుదేరింది.

ఇద్దరూ రసహృదయులే కనుక ఇద్దరికీ పున్నమి రాత్రంటే ఇష్టమే. ఇద్దరికీ ఒక రంటే ఒకరికి ఇష్టం కనుక ఇద్దరికీ ఇష్ట మైన పున్నమి రేయిని కలిసి ఆస్వాదిం చడం కూడా ఇష్టమే.

చంద్రుడు పైకొచ్చాడు.

సముద్రపు అలలు ఎగిసి చంద్రకాంతిలో మెరుస్తున్నాయి. వేణు వెల్లకిలా పడుకుని కాసేపు ఆకాశాన్ని చూశాడు. చంద్రుని వెన్నెల మూలంగా చీకటి రాత్రు లలో మెరిసేటంత కాంతి వంతంగా నక్షత్రాలు మెర వటం లేదు. చంద్రకళల ముందు తారల వెలు గులు వెలవెలబోతు న్నాయి. అప్పుడు వేణు ఆ పండు వెన్నెలలో శ్రావణి ముఖం చూసాడు. రెప్పా ర్పకుండా చూస్తున్నాడు.

"ఏంటి అదే పనిగా నన్నే చూస్తున్నావు" అంది శ్రావణి.

"చంద్రకళల ముందు ఆ తారలన్నీ వెల వెల పోయినా ఈ తార మరీ అందంగా ఉంది" అన్నాడు వేణు, శ్రావణి బుగ్గమీద చిన్న చిటిక వేసి.

శ్రావణి నవ్వుకుంది.

కొంచెం చొరవ తీసుకొని వేణు శ్రావణి చేతిని తన చేతిలోనికి తీసుకొని తన గుండెలమీద పెట్టుకుని ఆ పైన రెండు చేతులూ ఉంచాడు.

శ్రావణి తన చేతిని వెనక్కి తీసుకోలేదు.

"ఏంటి ఇవాళ అబ్బాయిగారు మరీ ఉల్లాసంగా ఉన్నట్టున్నారు" అంది శ్రావణి. వెన్నెల్లో మెరుస్తున్న తన కళ్లను వేణు కళ్లలో కలుపుతూ. ఆ మాటకు వేణు నవ్వుకొని "ఒక్కసారి చుట్టూ చూడు" అన్నాడు.

శ్రావణి చుట్టూ చూసింది.

బీచ్‌లో జనం రద్దీ తగ్గింది. వెన్నెల బాగుంది. వాతావరణం ప్రశాంతంగా ఉంది. అలల సవ్వడి.. గాలి సంగీతం, పున్నమి వెన్నెల. వాతావరణం ఆహ్లా దంగా ఉంది" అంది.

"మరో విషయం చెప్పనా? " అన్నాడు వేణు.

ఏమిటది అన్నట్టు అతని కళ్లల్లోకి చూసింది శ్రావణి.

"ఈ సముద్రపు ఒడ్డున నేను ఇలా పదు

## సత్యం, శివం, సుందరం

విశ్వనాథ అధ్యక్షతన విజయవాడలో సభ. అప్పటికే- మా స్వామి, శశిదూతం, త్రిశూలం రచనలతో ఆయన వాసికెక్కారు. వాటిని ప్రస్తావిస్తూ సభారంజకంగా మాట్లాడిన కరుణశ్రీ.. ఉమాశంకరుల సంభాషణను ఎంచుకున్నారు.

**ఉమ:** ఎక్కడినుంచి రాక స్వామీ?

**శంకర:** మా స్వామీ అని విశ్వనాథ పిలవడంతో వెళ్లివస్తున్నా.



**ఉమ:** మీ తలమీది చంద్రుడేడీ?

**శం:** ఆయనకు దూత అయ్యాడు

**ఉమ:** మీ చేతిలో త్రిశూలమేదీ?

**శం:** ఆయన నట్టింట ఉంచాను. తిరిగి తేవడం మరిచాను.

**ఉమ:** జటాజూటంలోని గంగ సంగతి?

**శం:** విశ్వనాథ వాగ్ధోరణిలో కలసిపోయింది

.. ఈ వర్ణనకు సభంతా చప్పట్లతో మారుమోగింది. ఎంతచక్కగా చెప్పావంటూ విశ్వనాథ అభినందించారు.

## కొత్తగాలి...

**వీడ్కోలు సమయాల్లో**
**భాగ్యవంతులమై పోతాం**
**'టాటా'లు చెప్పుకుంటూ...**

— బద్ది నాగేశ్వరరావు, అనకాపల్లి

కుంటే నాకు చేరువుగా నువ్వు కూర్చున్నావు. మన చేతులు కలిసాయి. మనపైనున్న ఆకాశాన్ని చూడు. నెమ్మదిగా భూమి, ఆకాశం కలుస్తున్నచోటు చూడు. అలా చుట్టూ పరికిస్తే మనమీద ఆ ఆకాశం బోర్లించినట్టు లేదూ. కావాలంటే జైలు అనుకోవచ్చు. ఆ జైల్లో మనిద్దరమే బందీలమయితే ఇంకా హాయిగా ఉంటుంది కదూ" అంటూ శ్రావణిని నెమ్మదిగా తన మీదకు లాక్కునేందుకు ప్రయత్నం చేసాడు.

అతను ఆశించినంత దగ్గరగా కాకపోయినా శ్రావణి కొంతవరకూ అతనికి చేరువయ్యింది. అతని ముఖం ఆమె ముఖానికి అభిముఖంగా ఉంది.

"ప్రకృతి సౌందర్యాలు, ముక్కు మూసుకుని తపస్సు చేసుకునే మహర్షుల మనసులను కూడా చలింపచేస్తాయి. పులకాంకితులను చేస్తాయి"

"చేతులు కలిసాయి, తనువులు కొంత దగ్గరయ్యాయి. ఏడు అడుగులు కలిసి నడిస్తే దగ్గరైన తనువులు ఒక్కటవుతాయి కదా" అంది శ్రావణి.

"మీ వాళ్లొచ్చి అమ్మాయిని చూసుకునేందుకు రమ్మని మా వాళ్లని ఆహ్వానిస్తే, మా వాళ్లు మీ ఇంటికి వస్తారు. మా ఇంట్లో వాళ్లు ముఖ్యంగా మా తాతగారికి, నానమ్మకి నువ్వు బాగా నచ్చావు"

"అలాగా" అంది కొంచెం గర్వంగా శ్రావణి.

"మీ తాతకు నచ్చినప్పుడు నీకు నచ్చడంలో ఆశ్చర్యమేముంది" అంది శ్రావణి.

"బెట్టు చెయ్యకుండా మీ నాన్నగారితో మాట్లాడు" అన్నాడు వేణు.

'నో' అంటూ శ్రావణి అతనికి ఎడంగా జరిగి అతని చేతుల్లోంచి తన చేతిని తీసేసుకుంది.

వేణు షాకయ్యాడు. హఠాత్తుగా అలా ఎందుకు ప్రవర్తించిందో అర్థం కాలేదు. శ్రావణి ముఖంలోకి చూశాడు. వచ్చే చిరునవ్వుని ఆపుకుని "మగపెళ్లివారు ఆడపెళ్లివారింటికి వచ్చి ఏం చూస్తారు అసలు. ఎందుకు చూడాలి" అంది.

"అమ్మాయిని చూడ్డానికి రమ్మని పెళ్లికొడుకు వాళ్లని పిలవడం, వాళ్లు వెళ్లి చూడ్డం మన సంప్రదాయం కదా?"

"సంప్రదాయం పర్మనెంటుగా అలాగే ఉండాలా? అబ్బాయి వెళ్లి ఇల్లరికం అల్లుడుగా ఉండదలుచుకుంటే వెళ్లి చూసుకోవడం సబబే. పెళ్లికొడుకు వాళ్లు అమ్మాయి ఇంటికి వెళ్లి చూస్తారు. పెళ్లికొడుకు అమ్మాయి ఇంట్లో ఉండిపోడు. పెళ్లికూతురు మాత్రం అబ్బాయి ఇల్లు చూసుకోకుండా అబ్బాయి ఇంటికి వచ్చి కలకాలం కాపురం చెయ్యాలి. పర్మినెంటుగా సెటిల్ అయిపోవాలి. ఇది న్యాయమా?" అంది.

"ఓ లాయరుగారూ ఇంతకీ తమరి వాదన ఏంటి?"

"నేను కాపురం చెయ్యాల్సిన అత్తవారింటికి వెళ్లి వాళ్ల కుటుంబ పరిస్థితులు ఏమిటి, వ్యక్తుల మనస్తత్వాలు ఏమిటో, సంప్రదాయం ఏమిటో చూసుకుని వస్తాను" అంది.

వేణు మనసు తేలికయ్యింది.

"మా ఇంటికి వెళ్లి ఏం పనిమీద వచ్చానని చెబుతావు?"

శ్రావణి ఒకక్షణం ఆలోచించి నవ్వుతూ

"వేణూ రీసర్చికి వైజాగ్ వస్తానన్నాడు. వీలయితే మా ఊరు వచ్చేయండని, ఇద్దరం కలిసి వైజాగ్ వెళాదామని నన్ను ఆహ్వానించాడు. అందుకని వచ్చాను" అని చెబుతాను.

"మీరు వెళ్లిపోయారు అంటారు మీవాళ్లు. అయ్యో హాలిడేస్ ఇంకా ఉండ గానే వెళ్లిపోయాడా అని నేను నిరుత్సాహ పడతాను. ఆ తర్వాత ఏం జరుగుతుందో చూస్తాను" అంది శ్రావణి.

"అమ్మ లయ్యర్" అని శ్రావణిని దగ్గరకు లాక్కున్నాడు.

"వెళ్లు. అల్ట్రా మోడ్రన్ డ్రస్సులు కాకుండా పల్లెటూరు కదా.. సంప్రదా యంగా వెళ్లు. లేకపోతే కొత్త కొత్త ఫ్యాన్సీ డ్రస్సులు చూడని మా ఊరి కుక్కలు మొరుగుతాయి" అన్నాడు వేణు.

ఇంతలో చల్లగాలి తగ్గింది. మబ్బులు పెరిగాయి. చంద్రుడు మరుగున పడ్డాడు. వర్షసూచనలు కనపడ్డాయి. ఇద్దరూ లేచి ఒకరి నడుం చుట్టూ ఒకరు చేతులు చుట్టుకుని రోడ్డు మీదకు నడిచారు.

★ ★ ★

వేణు ఇచ్చిన అడ్రస్సు ప్రకారం శ్రావణి చేరుకుంది. పంజాబీ డ్రస్సు వేసుకుంది. భుజాన ఓ బ్యాగు ఉంది. చక్కగా ముస్తా బయ్యింది. చదువుకున్న బస్తీ అమ్మా యిలా ఉంది. వేణు లోగిలి ముందున్న మెట్లెక్కి సింహద్వారం దాకా చేరి గడప దాటకుండా బయట నిలబడి లోపలికి తొంగిచూసింది. వరుసగా రెండు మండు వాలు కనబడ్డాయి. మండువాలకు ఇరువై పులా గదులు. గదుల తలుపులు తెరిచే ఉన్నాయి. తలుపు మీద వేలితో కొడుతూ "ఏమండీ, ఏమండీ" అని పిలిచింది శ్రావణి.

లోపల్నించి రాములమ్మ ముందు మండువాలోకి వచ్చి గడపవతల నిలబడిన శ్రావణిని చూసింది. ఆ ఇంటి మర్యాద ప్రకారం "లోనికి రండమ్మగారు.. కూర్చోండి.. అమ్మగారికి ఎవరో వచ్చారని చెబుతాను. దాహం అట్టుకొస్తాను" అంది. శ్రావణి సమాధానం కోసం ఆగకుండా లోపలికి వెళ్లిపోయింది రాములమ్మ.

శ్రావణి గడప దాటి లోపలికెళ్లింది. చుట్టూ ఉన్న ఫొటోలను చూస్తూ నిలబ డింది. ఏదో ఇంకో లోకంలోకి అడుగు పెట్టినట్టుంది శ్రావణికి. రాములమ్మ మాటలు చెవిన పడ్డ రాయుడు తన గది లోంచి బయటకి వచ్చాడు.

ముందు మండువాలోకి వెళ్లి నిలబడి ఉన్న శ్రావణిని చూసి "కూర్చోమ్మా. ఎవరి కోసం వచ్చావు? ఎవరు కావాలి? " అన్నాడు.

"ఇది వేణుగోపాలరాయుడిగారి ఇల్లే నాండీ? " అంది శ్రావణి, తనకెదురుగా హుందాగా నిలబడిన గంభీరమైన ఆకృతి గల రాయుడితో.

"అవునమ్మా. నేనే వేణుగోపాలరా యుడ్ని"

ధైర్యం తెచ్చుకొని, మాటలు తడబడ కుండా "వేణుగారు లేరాండీ? "

"వారం క్రితం వైజాగ్ వెళ్లిపోయాడమ్మా పి. హెచ్.డి.కి ఎన్‌రోల్ కావాలని"

"వెళ్లిపోయారా? సెలవులు అయ్యేదాకా ఉంటారనుకున్నాను. నేనూ వైజాగ్ వెళ్లా లంటే, వెళ్లబోయే ముందు ఇక్కడికి వస్తే కలిసి వెళదామన్నారు" అంది శ్రావణి. ఈ లోపల రాయుడు తన ఎదురుగా పంజాబీ డ్రెస్సులో నిలబడి ఉన్న శ్రావణిని పరిశీ లనగా చూసి తనలో తను నవ్వుకున్నాడు. "ఏమే, ఏమే" అంటూ లోపలున్న వరల క్ష్మికి వినిపించేలా పిల్చాడు. తన భార్య వరలక్ష్మిని మాత్రమే ఏమే అని పిలు స్తాడు. ఆ పిలుపు విన్న వరలక్ష్మి గబ గబా ముందు మండువాలోకి వచ్చింది.

## కొత్తగాలి...

**అమ్మ ఎప్పుడూ**
**పనిచేస్తూనే**
**ఉంటుంది**
**గడియారపు ముల్లులా...**

-ఈ.వేమన, శ్రీకాకుళం

రాయుడి పక్కన నిలబడి "ఎవరీ అమ్మాయి? " అంది.

"వేణూ కావాలట" అన్నాడు రాయుడు వరలక్ష్మి కళ్లల్లోకి అర్థయుక్తంగా చూస్తూ. మళ్లీ "వేణూ ఊళ్లో లేనంత మాత్రాన నువ్వు అలా నిలబడే వుండక్కరలేదమ్మా, కూర్చో. ప్రయాణ బడలిక తీర్చుకుని భోజనం చేసి సాయంకాలం బయలుదేరి వెళ్ళవచ్చు" అన్నాడు రాయుడు శ్రావణితో.

"మీరొకసారి ఇటురండి" అంటూ రాయుడికి వినపడేలా వరలక్ష్మి అని వెనక మండువాలోకి వెళ్ళింది. రాయుడు వెనకే వెళ్ళేడు. "వచ్చిన అమ్మాయి ఆ ఆల్బమ్‌లో అమ్మాయిలా లేదూ? " అంది నవ్వుతూ.

"ఆల్బమ్ అమ్మాయే, ఆ ఫోటోలో చీరలో ఉంది. ఇప్పుడు పంజాబీ డ్రెస్సులో వుంది."

వరలక్ష్మి కుతూహలంగా రాయుడి ముఖంలోకి చూసి "నా చీర ఒకటి ఇచ్చి కట్టించి ఎలా వుంటుందో చూస్తే ఖచ్చితంగా రుజువైపోతుంది" అంది.

"మనిషి ఇంటికి రాగానే టిఫిను, కాఫీ ఇచ్చి మర్యాద చెయ్యడం బాగుంటుంది కానీ బట్టలు మార్చుకోమనడం ఏం మర్యాద? నే తేలుస్తానుండు" అని ముందు మండువాలోకి నడిచాడు రాయుడు. వెనకే వరలక్ష్మి వెళ్ళింది.

రాయుడు శ్రావణి ముఖంలోకి సీరియస్‌గా చూస్తూ "నువ్వు ఎక్కడి నుంచి వచ్చావమ్మా ఇప్పుడు? " అన్నాడు.

ఈ ప్రశ్న శ్రావణి ఊహించలేదు.

గబుక్కున వైజాగ్ అని, తర్వాత సర్దుకుని, "వైజాగ్ వెళ్ళడానికి ఢిల్లీ నుంచి వచ్చాను"

"మరి ఇక నువ్వు ఆల్బమ్‌లో అమ్మాయివే! ఢిల్లీ- శ్రావణి- హైదరాబాద్ డాన్స్ ఆల్బమ్‌లో అమ్మాయి. సో యు ఆర్ శ్రావణి, మై వేణూస్ పార్టనర్ ఇన్ స్టేట్ కల్చరల్ కాంపిటీషన్స్" అన్నాడు.

పంచె, లాల్చీ ధరించి సంప్రదాయ పద్ధతుల్లో తనముందు నిలబడిన రాయుడు ఇంగ్లీషులో మాట్లాడుతుంటే కళ్ళు పెద్దవి చేసి చూస్తూ నిలబడింది శ్రావణి.

"మీరు వేణూ తాతగారు, నాయనమ్మగారు కదూ" అనడిగింది చిలక పలికినట్లు శ్రావణి.

అవునన్నట్టు వరలక్ష్మి నవ్వింది. రాయుడు తల పంకించాడు.

క్షణం ఆలస్యం చెయ్యకుండా గబగబా వెళ్ళి వారిద్దరి పాదాలకు నమస్కరించింది.

రాయుడు తల నిమిరాడు. వరలక్ష్మి పాదాల నుంచి లేపి దగ్గరకు తీసుకుంది.

ఇంతలో లోపల మండువాలోంచి విష్ణు సహస్రనామం వినిపిస్తోంటే కాళ్ళవైపు చూసి త్వరత్వరగా చెప్పులు విప్పేసింది శ్రావణి.

అది గమనించిన వరలక్ష్మి "లోపలికెళ్ళమ్మా" అంది.

శ్రావణి లోపలి మండువాలోకి వెళ్ళింది. పూజగది బయట నిలబడింది. సీతాదేవి విష్ణు సహస్రనామం చూసుకుంటూ చదువుతోంది. ఎదురుగా పూజామందిరంలో చక్కగా అలంకరించబడిన దేముళ్ళ ఫోటోలు, వెండి కుందుల్లో దీపాలు, సాంబ్రాణీ, అగరవత్తుల పరిమళాలు అక్కడ ప్రశాంత వాతావరణాన్ని కలిగించాయి.

సీతాదేవి విష్ణు సహస్రనామం చదువుతూ మధ్యలో తడుముకుంది.

కళ్ళు మూసుకుని దేముడికి నమస్కరిస్తూ నిలబడిన శ్రావణి అక్కడి నుంచి అందుకుని విష్ణు సహస్రనామం మధురస్వరంతో ఆగకుండా వల్లించింది.

ఆ చక్కని గాత్రాన్ని విన్న సీతారామయ్య కూడా తన గదిలోంచి బయటికి వచ్చాడు. రాయుడు, వరలక్ష్మి కూడా పూజామందిరం చేరుకుని శ్రావణి పక్కనే నిలబడ్డారు. శ్రావణి గాత్రం చెవిని సోకిన మరుక్షణం సీతాదేవి తను చదవటం మానేసి శ్రావణి నోట విన్పిస్తున్న విష్ణు సహస్రనామం వింటూ నిలబడిపోయింది.

అందరి కళ్ళూ శ్రావణి మీదే నిలిచాయి.

విష్ణు సహస్రనామం పూర్తయ్యేదాకా ధ్యానంలోనే వుందామె.

తరువాత కళ్ళు తెరిచింది శ్రావణి. సీతాదేవి శ్రావణి దగ్గరకి వచ్చి "ఏ తల్లి కన్న బిడ్డవో కానీ విష్ణు సహస్రనామాన్ని విన సొంపుగా స్పష్టంగా వల్లించావమ్మా" అని తల నిమిరింది.

రాయుడు కోడలు ముఖంలోకి చూస్తూ, "ఏ తల్లి కన్నబిడ్డో నాకు తెలియదుకాని మనందరం ఆల్బమ్‌లో కన్న అమ్మాయే" అన్నాడు.

"ఆ... అవునవును. ఈ అమ్మాయి ఆల్బమ్ అమ్మాయే" అన్నాడు సీతారామయ్య.

సీతాదేవి శ్రావణిని ఆసాంతం తృప్తిగా చూసుకుంది.

వరలక్ష్మి "పాపం ఆ పిల్లకి లక్షణంగా ఓ పేరుండగా ఈ ఆల్బమ్ అమ్మాయని కొత్త పేరు పెట్టారేంటి?" అంది అందరినీ ఉద్దేశించి.

అందరూ నవ్వుకున్నారు.

"వేణుగారు ఉన్నారేమో అనుకుని వచ్చాను. లేరటకదా.. ప్రసాదం ఇవ్వండి. తీసుకుని వెళతాను" అంది వినయంగా సీతాదేవితో.

వరలక్ష్మి కలగచేసుకుని "అలా ఎలా వెళతావమ్మా? వాడు లేకపోతే మాత్రం మేమంతా లేమా ఇంట్లో? శుభ్రంగా స్నానం చేసి భోంచెయ్యి. కాసేపు విశ్రాంతి తీసుకో. ఆ తర్వాత వెళ్ళచ్చు"

"అలా చెయ్యమ్మా, నువ్వు వైజాగ్‌కేగా వెళ్ళవలసింది. సాయంత్రం ట్రైన్‌కి పంపిస్తాను" అన్నాడు రాయుడు.

శ్రావణి ఎదురు చెప్పలేదు. సరేనన్నట్టు మౌనంగా ఉండిపోయింది. శ్రావణి స్నానం చేసి భోజనం చేసింది. ఆ ఇంట్లో వాళ్ళందరూ శ్రావణిని పరిశీలనగా చూస్తున్నారు. ఫోటోలోకంటే మామూలుగా ఇంకా బాగుందన్నారు. ఆ ఇంట్లో పండుగ వాతావరణం నెలకొంది. ఆ క్షణంలో ఆ ఇంట్లో వాళ్ళందరికి శ్రావణి ఒక వి.ఐ.పి.గా అనిపిస్తోంది. రాములమ్మ చంద్రయ్యలు కూడా ఆమెకు ఏమికావాలోనని ఆమె కనుసన్నలలో మసులుతున్నారు.

శ్రావణి తానొక వేరే లోకంలోకి వచ్చినట్లనిపించింది. ఆ ఇంట్లో సంప్రదాయమనే సింహాసనం మీద మంచితనం, ప్రేమ కొలువు తీరినట్లున్నాయి.

మధ్యాహ్నం మూడు గంటలకి శ్రావణి ప్రయాణానికి సిద్ధమయ్యింది. సీతాదేవి తన గదిలోకి వెళ్ళి బీరువా తీసి ఓ చీర, జాకెట్టు తెచ్చి బొట్టు పెట్టి శ్రావణి చేతికి అందించింది.

ఏమి సమాధానం చెప్పాలో తెలీక సీతాదేవి ముఖంలోకి చూస్తూ "ఇప్పుడెందుకు ఆంటీ ఇవన్నీ?" అంది శ్రావణి.

"ఇది ఈ ఇంటి పద్ధతమ్మా. కాదనకు. నువ్వు చీర కట్టుకుని వెళితే సంతోషం. కట్టుకోమ్మా" అంది ఆప్యాయంగా.

శ్రావణి చీర, జాకెట్టు ధరించి బయటకు వచ్చింది. ఆమె నుదుటిన సీతాదేవి పెట్టిన

బొట్టు కొట్టొచ్చినట్లు కన్పిస్తోంది. శ్రావణి లక్ష్మీదేవిలా వుంది ఆ ఇంట్లో వారందరి కళ్ళకి.

సీతారామయ్య, సీతాదేవే కాకుండా వర లక్ష్మి, రాయుడు కూడా ఆప్యాయంగా చూసుకున్నారు సాంప్రదాయ అలంకర ణలో ఉన్న శ్రావణిని.

రాములమ్మా, చంద్రయ్యాలు సరేసరి.

వారందరికి శ్రావణి ఎంత నచ్చిందో, ఆ ఇంట్లో వ్యక్తులు, ఆ ఇంటి సంప్రదాయం శ్రావణికీ అంతగా నచ్చింది.

శ్రావణి తిరుగు ప్రయాణమయ్యింది.

★ ★ ★

అక్కడ రాయుడి కుటుంబంలో ఆ కుటుంబ సభ్యుల అందరి చేతుల్లోను వేణు వదిలి వెళ్ళిన ఆల్బమ్ ఆటబంతిలా తిరుగుతోంది. అందరూ కలసి ఒకేసారి విడివిడిగా తలోసారి ఆ ఆల్బమ్‌లోని వేణు, శ్రావణి జంటలను చూస్తూనే వున్నారు. ఎవరికి వారే మనస్సుల్లో వేణుకి తగిన అమ్మాయి శ్రావణి అనుకుం టున్నారు. ముందు ఒకనాడు వరలక్ష్మి తన కోడలు సీతాదేవితో అంది. సీతాదేవి తన ఆడపడుచు కూతురు దుర్గను కాదంటే అత్తగారు ఏమనుకుంటుందో అన్న భయం. అదికాస్తా ఇప్పుడు పోయింది. "అత్తయ్యా! పెద్దవారయిన మీరు, మామగారు ఎలా చెబితే అలా మేం వింటాం. మీ అబ్బాయి అంతే. మన వడు అంతే కదా!" అంది సీతాదేవి.

"మర్యాదలు సరేనమ్మాయి. ఆ పిల్ల నీ కోడలయితే బాగుంటుందని నీకు మాత్రం లేదూ? " అంది వరలక్ష్మి కోడలితో.

"ఆ పిల్ల అందగత్తె కాదని ఎవరు అన గలరు? కాకపోతే కుటుంబ వివరాలు మనకు తెలియవుగానీ" అంది సీతాదేవి.

సీతారామయ్య కూడా తన తండ్రి రాయుడు లాగే ఆలోచిస్తున్నారు. తన కొడుక్కి నచ్చిన సంబంధమే చెయ్యాలని నిర్ణయించుకున్నాడు. ఆల్బమ్ చూడగా, చూడగా సీతారామయ్యకు శ్రావణి నచ్చింది.

ఇక్కడ ఓ ముఖ్య విషయం జరిగింది. ఒకనాడు మధ్యాహ్నపువేళ దుర్గ "అత్తయ్యా, అమ్మమ్మా" అంటూ ఇంట్లోకి వచ్చింది. ఇంట్లో మగవాళ్ళు ఎవరూ లేరు. వరలక్ష్మి, సీతాదేవి నిద్రపోతున్నారు. బల్ల మీద ఉన్న ఆల్బమ్ తెరచి మొత్తం వేణు, శ్రావణి ఫొటోలను, ప్రత్యేకంగా వారిద్దరి నెత్తినా కిరీటాలు పెట్టి తీసిన ఫొటోలను పరిశీలనగా చూసింది. బావకు తగిన అమ్మాయి ఆల్బమ్ అమ్మాయే అనుకుంది. ఆల్బమ్ మొదటి పేజీలో శ్రావణి అండ్ వేణు పర్‌ఫార్మెన్స్ స్టోరీ ఆల్బమ్ అనే అక్ష రాలను చదివింది. దుర్గ మనసులో మిగిలిపోయింది మటుకు శ్రావణి అండ్ వేణు. అయితే ఆ అమ్మాయి పేరు శ్రావణి అన్నమాట.

శ్రావణి ఎవరో తనకు తెలీదు. తనకంటే అందంగా ఉంది. అటు క్లాసికల్, ఫోక్ డాన్స్, మామూలు డాన్స్- మూడూ చెయ్య గలుగుతోంది. బావలాగే బాగా చదువు కున్న అమ్మాయి. మనసులో ఏదో అను కుంటూ ఏవేలో ఆలోచనలతో ఎవ్వరినీ లేపకుండా ఆల్బమ్‌లోంచి ఒక ఫొటో తీసు కుని ఇంటికి వెళ్ళిపోయింది. వాళ్ళ అమ్మకి నాన్నకి కూడా చూపకుండా తన బట్టల మధ్య దాచుకుంది.

★ ★ ★

భీమశంకరం ఢిల్లీనుంచి బయలుదేరే ముందు రాజమండ్రిలో దిగాడు. తన చిన్ననాడు చదువుకున్న కాలేజీ. ఓ సారి కాలేజీలోకి వెళ్ళి వేణు గురించి వాకబు చేద్దామనుకున్నాడు. సరాసరి ప్రిన్సిపాల్ రామకృష్ణ దగ్గరికి వెళ్ళేడు. వేణు గురించి ఆయన అభిప్రాయాన్ని అడిగేడు. అడగ

# భూలోక నరకం

అమెరికాలో ఓ పిల్లవాడు ప్రాథమిక విద్యను పూర్తి చేసేసరికి టీవీలో సగటున కనీసం ఎనిమిది వేల హత్యలు, లక్షకుపైగా వివిధ రకాల హింసలు చూస్తాడని అమెరికన్ సైకలాజికల్ అసోసియేషన్ 1998లోనే ప్రకటించింది. ఇవికాక హాలీవుడ్ సినిమాలు సరేసరి! వీడియో గేమ్స్‌లో కూడా రక్తపాతం, హత్యలు మొదలైనవి చోటు చేసుకుంటాయి. ఆ ప్రభావంతో అక్కడి పిల్లలు తోటి పిల్లల్ని హింసించడం అధికంగా ఉంటుంది. చికాగోలోని ఓ స్కూలుకు ఒక పిల్లవాడు తన






తండ్రి తుపాకి తెచ్చి కొందరు పిల్లల్ని చంపిన సంఘటనల్లాంటివి అనేకం ఉన్నాయి. శాన్ ఫ్రాన్సిస్కో స్టేట్ యూనివర్సిటీలోని స్కూల్ ఆఫ్ ఫ్యామిలీ స్టడీస్ డైరెక్టర్ డాక్టర్ జాన్.పి. ముర్రే అధ్యయనం ప్రకారం ఇలాంటి హింసను తెరమీద చూసిన పిల్లల్లో సున్నితత్వం పూర్తిగా మాయమై సమాజంలో హింస సాధారణ విషయంగా తోచే ప్రమాదం ఉందని తేలింది.

దీనికి పెద్ద ఉదాహరణ న్యూజెర్సీ రాష్ట్రంలో జరిగి, అక్కడి దినపత్రికల్లో పెద్ద వార్తయింది. ఫ్రాంక్లిన్ అనే ఊరిలో థామస్ జె. కోర్కోస్విక్(18), జేసమ్ ఫ్రీలాండ్(17)లకు చంపే అనుభవం కావాలనిపించింది. దాంతోవారు ఏప్రిల్ 19, 2001లో రెండు ఛీజ్ పిజ్జాలను ఆర్డర్ చేశారు. ఊరుబయట ఉన్న ఓ పాత ఇంటి అడ్రెస్ చెప్పారు. ఇద్దరు పిజ్జా డెలివరీమెన్ కారులో పిజ్జాలతో వచ్చారు. వాటిని ఇచ్చేందుకోసం జెరిమి జియార్డానో(22) కారు అద్దం దింపగానే అతడ్ని, అతడి పక్కనే కూర్చున్న జియోర్డియో గలారా(24)ని వాళ్లిద్దరూ రెండు తుపాకులతో కాల్చారు. దీంతో ఆ కారు ముప్పై గజాలు ముందుకు వెళ్లి బురద నేలలో ఆగిపోయింది. నెత్తురు మరకలుగల ఆ కారు ఆగగానే ఈ హంతకులిద్దరూ కారు తలుపులు తెరిచి, వారిద్దర్నీ బయటకు లాగి వారి తలపై మరోసారి తుపాకులతో కాల్చారు.

పోలీసులు వారిని అరెస్టు చేశాక తామెందుకు చంపాలనుకున్నారో తెలియజేయగానే వాళ్లు నివ్వెరపోయారు.

తుపాకులు, కత్తులంటే అమెరికా పిల్లలకు బాగా క్రేజ్. చిన్నప్పట్నించే బొమ్మ తుపాకీలతో వాళ్లు ఆడుకుంటూ హింసకు అలవాటు పడతారు. అక్కడి సామాజిక సమస్యల్లో అకారణ నేరాలూ ఎక్కువే.

బోయే ముందు తను ఆ కాలేజీ ఓల్డ్ స్టూడెంట్‌నని, ప్రస్తుతం సుప్రీంకోర్టులో అడ్వకేట్‌నని పరిచయం చేసుకున్నాడు.

"వేణు గురించి మీకు ఏం చెప్పమంటారు? ఎంతచెప్పినా తక్కువే అవుతుంది. అతనొక ఆణిముత్యం. ఒక తండ్రికి అటువంటి కొడుకు వుంటే బాగుండు అనిపిస్తుంది. ఒక తాతకు అటువంటి మనవడు ఉంటే బాగుండనిపిస్తుంది. ఒక తల్లికి అటువంటి కొడుకును చూస్తే గర్వంగా అన్పిస్తుంది. దురదృష్టవశాత్తు నాకు ఆడపిల్లలు లేరు" అన్నాడు రామకృష్ణ.

"నాకుంది. ఆ ప్రయత్నంలోనే మిమ్మల్ని అడిగేను. థ్యాంక్స్" అన్నాడు భీమశంకరం. ఆ తర్వాత "థ్యాంక్యూ ఫర్ యువర్ కాంప్లిమెంట్స్ అబౌట్ వేణు " అంటూ లేచాడు.

విశాఖపట్నం చేరుకుని తనకు ఆల్బమ్ ద్వారా తెలిసిన వేణుని తాను అతనికి తెలియకుండా కలవాలనుకున్నాడు. ముఖాముఖి కలసి వేణుని చదివి తెలుసుకోవాలనుకున్నాడు. ఎంత జాగ్రత్తగా మాటల్లో పెట్టినా భీమశంకరం వేణుకి దొరికిపోయాడు.



భీమశంకరం మాటలకి అడ్డుపడి "మీరు అడ్వకేటా? " ప్రశ్నించాడు వేణు.

"ఎందుకలా అడిగారు? " అన్నాడు భీమ శంకరం.

"మీది కాలర్ లేని వైట్ షర్ట్. ఇటువంటి షర్ట్సు సాధారణంగా లాయర్స్ వాడతారు. అందుకని అడిగాను"

"మీరు సూక్ష్మగ్రాహి వేణూ. మీ గెస్ కరెక్టే" అన్నాడు భీమశంకరం.

"అయితే మీరు శ్రావణి నాన్నగారయ్యుం డాలి. ఎందుకంటే మీ వయస్సు, మీ పర్స నాలిటీ, మీ మాటతీరు ఆమె వాళ్ళ నాన్న గారి గురించి చెప్పిన వాటికి చాలా దగ్గ రగా ఉన్నాయి" అన్నాడు వేణు.

హృదయపూర్వకంగా పకపకా నవ్వటం భీమశంకరం వంతైంది.

"అవును వేణూ. నేను ఇంటరాగేట్ చేసి నీ గురించి తెలుసుకోవాలనుకుంటే చూపులతోటి, పరిశీలన తోటి నా గురించి తెలుసుకున్నావు. కంగ్రాట్స్. బైదిబై అమ్మాయితో మాట్లాడి మీ ఊరు వెళదా మనుకుంటున్నాను. అడ్రస్సు ఇవ్వగ లవా? "

"తప్పకుండా, కడియం రైల్వేస్టేషను



కానీ రాజమండ్రి రైల్వే స్టేషనులో కాని దిగండి. దిగి కడియంపాలెం వెళ్ళండి. మాధవరాయుడి పాలెం ఆ గ్రామం పేరు. ఊరు పొలిమేరలకు వెళ్ళేక వేణుగోపాలరాయుడిగారి ఇంటికని చెప్పండి. మీరు ఎవర్ని దారి అడుగుతారో ఆ వ్యక్తే మిమ్మల్ని మర్యాదగా మా ఇంటికి తీసుకెళతారు" అన్నాడు వేణు.

"సరే నేనే స్వయంగా వెళతాను. మీ పెద్దలను కలుసుకునేందుకు" అన్నాడు భీమశంకరం. వేణు అంగీకారాన్ని అతని చూపుల్లోనే భీమశంకరం గ్రహించాడు. తృప్తిగా అతని ముందునుంచి లేచాడు మళ్ళీ కలుద్దామని. వేణుకి షేక్‌హాండ్ ఇచ్చాడు.

వేణు నమస్కరించాడు వినయంగా.




విశాఖపట్నం నుంచి బయలుదేరిన భీమశంకరం ప్రైవేట్ టాక్సీలో కాకినాడ చేరుకున్నాడు. కాకినాడలో తన మిత్రుడు అడ్వకేట్ శేషగిరిరావుకు తను వస్తున్నట్లు ముందుగానే ఫోన్ చేశాడు భీమశంకరం. తను ఆ ప్రాంతంలో ఉన్న రెండు రోజులు ఏ పని పెట్టుకోకుండా తన కోసం ఖాళీగా వుండమని శేషగిరిని కోరేడు. శని, ఆదివారాలు రావడంతో శేషగిరికి కోర్టుపని లేదు. ఏవో చిన్న చిన్న పనులు ఉన్నా తన గుమస్తాకి, జూనియర్ లాయర్‌కి అప్పచెప్పేసాడు. భీమశంకరం రాగానే ఆప్యాయంగా ఇంట్లోకి తీసుకెళ్ళాడు శేషగిరిరావు. అప్పుడప్పుడు ఫోన్‌లో మాట్లాడుకోవడం తప్ప వ్యక్తిగతంగా వాళ్ళిద్దరూ కలుసుకోవడం ఏడాదికో, రెండేళ్ళకో తప్ప సాధారణంగా జరగదు.

మిత్రులిద్దరూ భోజనాలు చేసిన తరువాత వృత్తిపరమైన సంగతులు, చిన్ననాటి విషయాలు కాసేపు మాట్లాడుకున్నారు. మాటల మధ్యలో శేషగిరి "ఎవరో ఒకావిడిది అడ్రసు అడిగావు ఫోన్‌లో. కనుక్కుని చెప్పమని. ఇంతకీ ఆవిడతో నీకు ఏమిటో పని" అన్నాడు నవ్వుతూ. ఆ నవ్వులో చిన్నగా ఆటపట్టించే ధోరణి వుంది. అది గ్రహించిన భీమశంకరం శేషగిరి నవ్వుకి బదులుగా నవ్వకుండా సీరియస్‌గా "అది వేరే కథలే. ఆమె అడ్రస్సు ఒక కేసులో అవసరమయ్యింది" అంటూ ఒక లాయరు ధోరణిలో సమాధానం చెప్పాడు ఆ విషయాన్ని మార్చడం కోసం. తాను వచ్చింది వేరే పనిమీద అన్నాడు భీమశంకరం.

ఇంతకీ "నువ్వొచ్చిన పనేమిటి? " అన్నాడు శేషగిరి. భీమశంకరం ఒక్కక్షణం ఆలోచించి "శ్రావణి లా ఫోర్త్‌యియర్‌లోకి వచ్చింది. లానే కాకుండా డాన్స్, మ్యూజిక్ కూడా నేర్చుకుంటోంది. రాష్ట్రస్థాయిలో సాహిత్య, సంగీత, సాంస్కృతిక కార్యక్రమాల్లో కాలేజీ విద్యార్థుల రాష్ట్రస్థాయి పోటీలలో ప్రథమ బహుమతి గెల్చుకుంది. టి.వి.లో కూడా వచ్చిందట. నాకు తీరికలేక చూడలేదనుకో. నువ్వు చూసి వుండవు. ఇప్పుడు దానికి ఓ సంబంధం మాట్లాడడం కోసం ఇక్కడికి వచ్చాను. ఒక్కడినీ వెళ్ళటంకంటె నువ్వు తోడుంటే బాగుంటుందని నీకు ఫోన్ చేశాను" క్లుప్తంగా తను వచ్చిన పని వివరించాడు భీమశంకరం.

"వెరీగుడ్. మంచి పని చేస్తున్నావు.

మంచి పనిమీదే వచ్చావు. సంబంధం కాకినాడలోనేనా? " అన్నాడు శేషగిరి.

"కాదు, కాదు. సంబంధం కడియం పక్కన పాలెం అని గ్రామం వుందట. ఆ వూరు సంబంధం మనం చూడవలసింది. అంచేత పొద్దున్నే మన యిద్దరం కారులో ద్రాక్షారామం వెళ్ళాలి. భీమేశ్వరస్వామి దర్శనం చేసుకొని మాణిక్యాంబకి కుంకుమ పూజ చేయించి అక్కడినుంచి అదే కారులో పాలెం చేరుకుందాం. ఇదే నా ప్లాన్" అన్నాడు భీమశంకరం.

"ఇంతకీ పెళ్ళికొడుకు..."

"పెళ్ళికొడుకు పాలెంలో లేడు. విశాఖపట్నంలో పి. హెచ్‌డి. చేస్తున్నాడు. పెళ్ళికొడుకు పెద్దలు పాలెంలో ఉన్నారు. వారిని కలిసి మాట్లాడాలి మనం" అన్నాడు భీమశంకరం.

"ఢిల్లీలో పెళ్ళికొడుకులే లేనట్టు, ఢిల్లీ అమ్మాయికి ఇంత దూరం వచ్చి చూస్తున్నావేంటి సంబంధం? " అన్నాడు శేషగిరి.

"ఎవరికి ఎక్కడ రాసిపెట్టి వుందో ఎవరు చెప్పగలరు చెప్పు. అమ్మాయికి అబ్బాయి నచ్చాడు. అబ్బాయికి అమ్మాయి నచ్చింది. మధ్యలో పెద్దలదేముంది? లాంఛనంగా మాట్లాడుకుని సరేననుకుంటే పిల్లలూ సంతోషిస్తారు కదా? అందుకని నేనే స్వయంగా బయలుదేరి వచ్చాను. ఆడపిల్ల తండ్రిని కదా? " అన్నాడు నవ్వుతూ భీమశంకరం.

అనుకున్న ప్లాన్ ప్రకారమే మిత్రులిద్దరూ కాకినాడ నుంచి ఉదయం ఆరుగంటలకే బయలుదేరి ఎనిమిదిగంటల కల్లా ద్రాక్షారామం చేరుకున్నారు. తిన్నగా భీమేశ్వరస్వామి ఆలయాన్ని చేరుకున్నారు. పూజకు కావలిసిన సామాను తీసుకొని ఇద్దరూ గుళ్ళోకి వెళ్ళారు.

భీమేశ్వరస్వామి ఆలయం భీమశంకరానికి చిన్నతనం నుంచీ సుపరిచితమైన ఆలయం. ద్రాక్షారామం భీమశంకరం

**కొత్తగాలి...**

**అక్షరం వెలుగుతోంది!**
**చీకటి గుండెలో**
**దీపమై**
**నిలవాలని**

*– డా.వాసా ప్రభావతి, హైదరాబాద్*

మాతామహుల ఊరు. తన పేరు భీమశంకరం అని పెట్టడానికి కారణం కూడా అదే. అందుకే తను భీమశంకరుడయ్యాడు. నాలుగు పక్కలా ఎత్తైన గోడలు, గుడినే ఆనుకుని తూర్పున సప్తగోదావరి, ఆలయంలోకి అడుగుపెడితే విశాలమైన నాలుగు ప్రాకారాలు. గుడి సింహద్వారం పక్కనే వినాయకుడి గుడి, లోపలికి అడుగుపెడితే ఎంతో ప్రశాంతమైన వాతావరణం. జయగంట మోతలు ఆలయ ప్రాకారాల్లో ప్రతిధ్వనిస్తూ వుంటాయి. చుట్టూ ఉన్న మండపాల్లో కూర్చున్న భక్తులు, బ్రాహ్మణులు, మంత్రోచ్ఛారణ చేసుకుంటూ వుంటారు. ప్రదక్షిణం చేసి భీమేశ్వర స్వామి దర్శనం చేసుకున్నారు ఇద్దరూ. భూమి నుండి రెండవంతస్తు దాకా ఎదిగిపోయే శివలింగాన్ని తృప్తిగా దర్శనం చేసుకొని అభిషేకం చేయించుకున్నారు. తీర్థం తీసుకొని మాణిక్యాంబ దర్శనం కూడా చేసుకున్నారు. కుంకుమ పూజ చేయించి బొట్టు పెట్టుకొని అయిదు నిమిషాలు గుళ్ళో ప్రశాంతంగా కూర్చుని కారెక్కి కడియంవైపు బయలుదేరారు. పూజారి ఇచ్చిన కుంకుమ పొట్లం భీమశంకరం తన జేబులో పెట్టుకున్నాడు.

"ఈ కుంకుమ ఎవరికోసం? మనం వెళ్ళేది మగపెళ్ళి వారింటికి కదా? " అన్నాడు శేషగిరిరావు.

"వెళ్ళేది మగపెళ్ళివారింటికైనా అందరూ

మగవాళ్ళే ఉంటారా? ఆడవాళ్ళు ఉండరా? " అన్నాడు భీమశంకరం.

ఇద్దరూ నవ్వుకున్నారు.

కారు కెనాల్ లైన్ వెంబడే పరిగెడు తోంది.

ఇద్దరూ కాసేపు మాట్లాడుకోలేదు. భీమ శంకరానికి వేణు రూపం మనసులో కది లింది. మొదట తను ఫొటో చూసిన వేణు కంటే తన ముందు కూర్చుని మాట్లా డిన వేణు భీమశంకరానికి బాగా నచ్చాడు. అతని తెలివి, మాటతీరు, పదునైన చూపులు, మర్యాద, పద్ధతి, వినయం అన్నీ భీమశంకరాన్ని ఆకట్టుకున్నాయి. ఒక మగవాడికి ఒక మగవాడు నచ్చినప్పుడు, అలాంటివాడు ఒక వయసులో ఉన్న అమ్మాయికి, అందులోను తెలివైన అమ్మా యికి నచ్చడం సహజం కదా అనుకు న్నాడు భీమశంకరం. అలా అలలు అల లుగా ఆలోచనలు వస్తున్నాయి. కాలవమీంచి వస్తున్న చల్లనిగాలి, చుట్టూ పచ్చని పొలాలు ప్రయాణం హాయిగా సాగటానికి దోహదం చేశాయి. రెండు గంటలు ప్రయాణం చేసి పాలెం చేరుకు న్నారు మిత్రులు. నగిషీలతో ఉన్న ఏను గుస్తంభాలున్న ఓ ఇంటిముందాగింది వారి కారు. ఇద్దరూ కారు దిగారు. ఎ త్తయిన అరుగులు, అరుగుల మధ్య నుంచి రెండు మండువా లోగిలిలోనికి వెళ్ళటానికి ఉన్న పెద్ద సింహద్వారం, సింహద్వారానికి చుట్టూ కర్రతో చేయబ డిన రకరకాల అందమైన బొమ్మలు, పసు పు రాసి బొట్లు పెట్టి అలంకరించబడిన ఎ త్తయిన గడప- చూడ్డానికి మన గ్రామీణ ప్రాచీన సాంప్రదాయానికి ప్రతీక అనిపించేలా ఉందా లోగిలి.

పట్టణాల్లో దొంగల భ యంచేత తలుపులు మూసుకుంటారు కానీ పల్లె లలో ఇంట్లో మనుష లుంటే తలుపులు తెరిచే ఉంటారు. తలుపులు మూయడం సాంప్ర దాయం కాదు. తలుపులు మూసివుంటే నట్టింట అడుగుపెట్టడానికి వచ్చిన లక్ష్మి తిరిగి వెళ్ళిపోతుం దని మన పూర్వీకుల నమ్మకం. తన చిన్నత నంలో విన్న ఆ మాటలు భీమశంకరానికి గుర్తొ చ్చాయి. ఎవరో ఇంట్లో ఉన్నట్టే అనుకున్నాడు. మనసులో గడప దాటి కచేరీ హాలునించి మండువాలలోకి అడుగుపెడుతూ వుండగా లోపల్నించి చంద్రయ్య బయటికి వచ్చాడు, ఒక తట్ట నెత్తిన పెట్టుకుని.

కొత్త మనుషులను చూసిన చంద్రయ్య బస్తీబాబులని చూడగానే గ్రహించాడు.

"రండి బాబూ కూర్చోండి. ఎవర్ని పిల వమంటారు? పెద్దయ్యగారినా, చిన్నయ్య

## ఆరు ఆరే

'నీవును నీవునున్ మరియు నీవును నీవును నీవు నీవునున్' నీవు అనే పదం ఆరుసార్లు వచ్చేలా ఇచ్చిన సమస్యను పూరించడానికి కరుణశ్రీ ఆరుముఖాలున్న కుమారస్వామిని తీసుకున్నారు.



దానికి ఆయన అల్లిన సన్నివేశం ఏమంటే- బాలుడైన షణ్ముఖుడు 'నీకు అన్నంటేనే ప్రేమ. నన్ను అసలే ఎత్తు కోవు' అంటూ తల్లి వద్ద అలిగాడు. ఆమె అతడిని దగ్గరికి తీసుకుని అతని ఆరు ముఖాలమీదా ముద్దులు పెడుతూ 'నీవు నీవు.. నీవు ఇష్టమే నాకు' అంది. అలా కవిగారు 'నీవును నీవునున్ మరియు నీవును నీవును నీవు నీవునున్' అంటూ చతురంగా పద్యాన్ని పూరించారు.

గారినా" అన్నాడు చంద్రయ్య వినయంగా నెత్తిన ఉన్న తట్ట పక్కన పెడుతూ.

"పెద్దయ్యగారినే పిలు, రాయుడుగారంటే పెద్దయ్యగారే కదా" అన్నాడు భీమశంకరం.

"అవును బాబూ. ఆర్నే పిలుస్తాను" అంటూ చంద్రయ్య లోపలికెళ్ళాడు. మండువాలో గోడలకు ఉన్న ఫొటోలను పరిశీలనగా చూస్తున్నారు భీమశంకరం, శేషగిరిరావులు. ఎదురుగా రవివర్మ గీసిన గీతోపదేశం బొమ్మ, గాంధీ, నెహ్రూ, సుభాష్‌చంద్రబోస్, ప్రకాశంపంతుల ఫొటోలున్నాయి. వాటితోపాటు బాలగంగాధర్ తిలక్, రవీంద్రనాధ్ టాగూర్‌ల బొమ్మలు కూడా ఉన్నాయి. అవి చూస్తుంటే చూసే కొద్దీ చూడాలనిపించేలా ఉన్నాయి.

లోపల్నించి వేణుగోపాలరాయుడు, చంద్రయ్య వెంటరాగా "నన్ను కలవాలని వచ్చారా? " అనుకుంటూ బయటికి వచ్చాడు.

కుర్చీలలో కూర్చున్న శేషగిరిరావు, భీమశంకరం, వేణుగోపాలరాయుణ్ణి చూడగానే గౌరవపూర్వకంగా లేచి నమస్కరించారు. అది తెచ్చిపెట్టుకున్న గౌరవం కాదు. రాయుడ్ని చూడగానే స్వతహాగా వారిరువురికి కలిగిన గౌరవ భావన.

నెరిసీ నెరియని గిరజాల జుట్టు, మీసాలు, నుదుట సన్నని పొడవైనబొట్టు, ఒత్తిన కనుబొమ్మలు, తెల్లని ధోవతీ, లాల్చీ, మెడలో మోకాళ్ళను తాకే పొడవైన జరీకండువా, మీసాల మాటున చాటునుంచి తొంగిచూస్తున్న చిరునవ్వు- ఇదీ రాయుడి రూపం.

వారిరువురూ పెట్టిన నమస్కారానికి ప్రతి నమస్కారం పెట్టిన రాయుడు వారిని కూర్చోమని చేయిచూపి వారిరువురూ కూర్చున్నాక తనూ కూర్చున్నాడు.

చంద్రయ్య వంక చూశాడు రాయుడు. చంద్రయ్య లోపలికెళ్ళి గాజు గ్లాసులతో వచ్చాడు. కొద్దిగా అల్లం, కొత్తిమీర వేసిన, మజ్జిగ తెచ్చాడు. 'దాహం తీసుకోండి' అని వారిద్దరికీ చెరోగ్లాసు ఇచ్చాడు రాయుడు. రాయుడు చేస్తున్న మర్యాదకు, అంత పెద్ద మనిషి చూపిస్తున్న వినయానికి భీమశంకరం, శేషగిరిరావులు ముడుచుకుపోయారు.

ఇద్దరూ మజ్జిగ తాగిన తరువాత 'తమరు వచ్చినపని? ' అన్నాడు రాయుడు.

ఎందరో న్యాయమూర్తుల ముందు, న్యాయవాదుల మధ్య నుంచి అనర్గళంగా ఆర్గ్యుమెంట్స్ చెప్పే భీమశంకరానికి ఇప్పుడు తను చెప్పబోయే విషయంలో అనుభవం లేదు. గొంతు సవరించుకొని ఒక్కక్షణం చెప్పవలసిన విషయాన్ని ఎక్కడ మొదలుపెట్టాలో కూడబలుక్కుని "నేను కార్యార్థినై వచ్చాను" అన్నాడు భీమశంకరం.

"సెలవియ్యండి" అన్నాడు రాయుడు చిరునవ్వుతో.

"నా పేరు భీమశంకరం. ఈయన శేషగిరిరావు, నా మిత్రులు. నేను ఢిల్లీలో సుప్రీంకోర్టు అడ్వకేట్‌ని. ఈయన కాకినాడలో డిస్ట్రిక్ట్ కోర్టు అడ్వకేట్. నాకు ఒక కూతురు వుంది. అమ్మాయి పేరు శ్రావణి. మీ మనవడు వేణు సరసన రాష్ట్రస్థాయి సంగీత, సాహితీ, సాంస్కృతిక కార్యక్రమాలలో నర్తించి పోటీలో ప్రథమ బహుమతి గెల్చుకుంది" అని ఆగాడు భీమశంకరం.

ఈ ఉపోద్ఘాతం వింటున్న రాయుడి ముఖం విప్పారింది. కొంచెం కుతూహలంతో "ఆల్బమ్‌లో అమ్మాయేనా? " అన్నాడు.

"ఆ మీరు ఆల్బమ్‌లోనే చూసి వుంటారు"

"ఊఁ చెప్పండి.. తరువాత"

"మా అమ్మాయిని మీ మనవడికిచ్చి వివాహం జరిపించడానికి తమ అంగీకారం

కోరడం కోసం వచ్చాం" అన్నాడు భీమశంకరం, రాయుడి ముఖంలోకి ఆశగా చూస్తూ.

నవ్వుకుని 'అబ్బాయి సీతారామయ్యా' అని లోపలున్న కొడుకుని పిల్చాడు రాయుడు.

సీతారామయ్య లోపల్నుంచి వచ్చాడు. రాయుడంత ఎత్తు ఉన్న రాయుడు కుమారుడిని చూడగానే మళ్లీ మళ్లీ చూడాలనే ఆకృతి అన్పించింది. సీతారామయ్య మర్యాదగా వచ్చిన అతిథులకు నమస్కరించి "పిలిచారా నాన్నా? " అన్నాడు.

వచ్చిన అతిథులిద్దర్నీ సీతారామయ్యకు పరిచయం చేసి, "ఢిల్లీలో సుప్రీంకోర్టు అడ్వకేట్ వారమ్మాయి, మనం ఆల్బమ్‌లో చూసిన అమ్మాయి ఒకరేనట! పేరు శ్రావణి, మన వేణూకి అడగటానికి వచ్చారు" అన్నాడు రాయుడు.

"నాకు కొడుకైనా, కూతురైనా శ్రావణే. నాకు ఒకర్తే కూతురు"

"మాకూ వేణూ ఒక్కడేనండి. కూతురైనా, కొడుకైనా వాడే" అన్నాడు సీతారామయ్య, తండ్రి కూర్చోమన్నాక కూర్చుంటూ.

మాటలు కలిసాయి. మాటలు పూర్తయ్యాయి.

అప్పుడు వరలక్ష్మిని, కోడలు సీతాదేవిని పిలిచి భీమశంకరానికి, శేషగిరిరావులకు పరిచయం చేశాడు రాయుడు. ఇద్దరూ వచ్చి భీమశంకరాన్ని చూసి నమస్కరించి లోపలికెళ్లారు.

ఆ తరువాత సీతాదేవి ఫలహారాలు పట్టుకొచ్చింది. వారి ముందు పెట్టి లోపలికెళ్ళిపోయింది.

భీమశంకరం వెంట వచ్చిన శేషగిరి "ఇరువురికి మాట కుదిరితే మిగిలిన లాంఛనాల సంగతి, కట్న కానుకల సంగతి ఒక మాట అనుకుంటే బాగుంటుంది కదా? " అన్నాడు.

సీతారామయ్య మౌనంగా ఉన్నాడు.

"అది వారిష్టం. వారి ముద్దు ముచ్చట్లు ఎలా జరుపుకోవాలంటే అలా జరుపుకోవచ్చు. వారెక్కడికి పెళ్లికి తరలి రమ్మంటే అక్కడికి వస్తాం. మాకు అభ్యంతరం లేదు" అన్నాడు రాయుడు హుందాగా.

భీమశంకరం రాయుడికి నమస్కరించి "మీరెలా అంటే అలా జరుపుకోవచ్చు. ఢిల్లీలో స్థిరపడినా నేను ఈ జిల్లాలో పుట్టి పెరిగి ఇక్కడే చదువుకొని వెళ్ళినవాణ్ణి" అన్నాడు.

"అయితే ఈ పూట భోజనాలు చేసి వెళ్లండి. తక్కిన విషయాలు ఒకసారి మేము వేణుతోటి, మీరు శ్రావణితోటి మాట్లాడాకే నిర్ణయించుకుందాం. ఆ తర్వాత త్వరలోనే తాంబూలాలు పుచ్చుకుందాం"

అది ఒక జడ్జిమెంట్‌లా అనిపించింది భీమశంకరానికి. అతని మనసు ఆనందంతో నిండిపోయింది.

అక్కడ వేణుని, ఇక్కడ అతని కుటుంబ సభ్యులను, వారి మర్యాదలను, ఆ లోగిలి వాతావరణాన్ని చూసి భీమశంకరానికి శ్రావణి అదృష్టవంతురాలనిపించింది. ఆమె చేసుకున్న పుణ్యఫలమే ఈ సదవకాశం అనిపించిందతనికి. భీమశంకరం కుటుంబం గురించి వరలక్ష్మి అడిగింది. శ్రావణికి తల్లి లేదని, మేనత్త మాణిక్యాంబే చిన్నప్పటినుంచీ పెంచిందని చెప్పాడు భీమశంకరం. తమ కుటుంబం గురించి చెప్పాడు వివరంగా సీతారామయ్య. పెళ్లికొడుకు తల్లి సీతాదేవి వడ్డన చేస్తూ నిలబడింది. ఒక్క మాట కూడా మాట్లాడలేదు.

భోజనాలు పూర్తయ్యాయి.

తాంబూలం సేవిస్తూ కూర్చున్నారు అందరూ.

వెండి పళ్లెంలో తమలపాకులు, సున్నం,

వక్కపొడి, జాజికాయ, జాపత్రి, యాలకులు, లవంగాలు, పచ్చకర్పూరం ఉంది. తమలపాకుకు సున్నం రాస్తూ ఈనెలు తీస్తూ, రాయుడ్ని, సీతారామయ్యను ఉద్దేశించి భీమశంకరం మాట్లాడటం మొదలు పెట్టాడు.

"తమరు సకుటుంబంగా ఢిల్లీ వచ్చి మా ఇల్లు పావనం చేసి, అమ్మాయిని మా ఇంట్లో చూసుకుంటే నాకు ఆనందం, తృప్తి. హైదరాబాదు నుంచి నేను ఫ్లైట్ టిక్కెట్లు బుక్ చేస్తాను. హైదరాబాద్ దాకా ఏర్పాట్లు మా శేషగిరిరావు చేస్తాడు. తమరు ఎప్పుడు వస్తున్నారో నిర్ణయించి తెలియపరిస్తే, నేను అమ్మాయిని ఢిల్లీ పిలిపించి, సిద్ధంగా ఉంటాను" అన్నాడు.

రాయుడు నవ్వుకొని "ఇప్పుడు మీరు మమ్మల్ని ఢిల్లీకి ఆహ్వానిస్తున్నది అమ్మాయిని చూసుకునేందుకేనా?" అన్నాడు రాయుడు.

"అది మన సంప్రదాయం కదా?"

"అసలు సంప్రదాయం తెలుసా మీకు. పూర్వం అయిదు రోజుల పెళ్ళిళ్ళు జరిగేటప్పుడు ఆ పక్క బంధువులు, ఈ పక్క బంధువులు ఐదు రోజులూ ఆ పెళ్లి వేడుకల్లో పాలు పంచుకోవడానికి వచ్చేవారు. అక్కడే అమ్మాయిలూ, అబ్బాయిలూ ఒకరినొకరు చూసుకోవడం, వారి వారి తల్లిదండ్రులు మాట్లాడుకొని నిర్ణయాలు తీసుకోవడం జరిగిపోయేవి. అంటే ఒక పెళ్లి పది పెళ్లిళ్లకు దోహదం చేసేది. అది ఉమ్మడి కుటుంబాలు బాగున్న రోజుల్లో అనుకోండి" అన్నాడు రాయుడు.

"బాగా చెప్పారు. ఆ రోజులే వేరు. ఇప్పుడు పెళ్లిళ్లు ఇంటర్నెట్ మీద, ఈమెయిల్స్ మీద, సెల్ ఫోన్స్ మీద జరుగుతున్నాయి" అన్నాడు భీమశంకరం.

అందరూ నవ్వుకున్నారు.

"అందుచేత అమ్మాయిని చూడ్డానికి ఢిల్లీ రావాల్సిన అవసరం లేదు. కావాలంటే

**కొత్తగాలి...**

**ఆ కొద్ది క్షణాలే**
**ఆమె నీకు భార్య**
**మిగతా కాలమంతా**
**నీకు అమ్మే!**

– ఎ.వి.వందన్‌రావు, నిజామాబాద్

పెళ్లయిన తరువాత మణుగుడుపులకి వస్తాంలెండి, మావాడు హనీమూన్‌కి తొందరపడకుండా ఉంటే" అన్నాడు రాయుడు.

పాలెం ఒక మధ్య తరగతి గ్రామం కావటంచేత ఎవరింట్లో ఏ చిన్న శుభకార్యం జరిగినా ఊరందరికీ ఇట్టే తెలిసిపోతుంది. రాయుడి ఇంట్లో పనివాళ్ళ ద్వారా విషయాలు వర్ధనమ్మకు తెలిసాయి.

భీమశంకరం, శేషగిరిరావులు తన మామగారి ఇంటికి వచ్చివెళ్ళినట్లు ఆ నోట, ఈ నోట ఆదినారాయణ చెవిన పడింది. ఒకరోజున రాయుడు పురోహితుణ్ణి పిలిచి శ్రావణి, వేణుల నిశ్చితార్థానికి ముహూర్తాలు పెట్టమని చెప్పాడు. ఒక ముహూర్తం పెట్టి ఇచ్చాడు పురోహితుడు. ఆ విషయం కూడా ఆదినారాయణ, వర్ధనమ్మలకు తెలిసింది. వర్ధనమ్మ రాయుడి ఇంటి ఆడపడుచు కావడంతో ఆమెకూ తెలిసింది. దుర్గా వింది. ఆమె తన మనసులో ఏదో అసంతృప్తి ఉన్నా బావకి తను తగనని తనకుతానే నచ్చ చెప్పుకుంది. కాని పుట్టింటి మీద ఎన్నో ఆశలు పెట్టుకుని ఆ ఇంటి కోడలవుతుందనుకున్న దుర్గను చూసినప్పుడల్లా, జరుగుతున్న పరిణామాలు వర్ధనమ్మకు బాధను కల్గిస్తున్నాయి.

ఆదినారాయణకు గుండెలు మండుతున్నాయి. ఒకపక్క అవమానంగా భావిస్తు



న్నాడు. తనకేమి తక్కువని నా పిల్లని చేసుకునేందుకు ఇష్టపడటం లేదని తన అత్తవారి ఇంటిమీద ఉక్రోషాన్ని పెంచు కుంటున్నాడు. చిన్నప్పటి నుంచీ అనుకుం టున్న సంబంధం కాదని ఢిల్లీ సంబంధా



నికి ఎగబడతారా? ఇది ఇంట్లో ఎవరికి పుట్టిన బుద్ధి అయ్యుంటుంది? తన మామగారు రాయుడుకా, తన బావమరిది సీతారామయ్యకా?' అని తనలో తను మ ధనపడుతున్నాడు.

అంతేకాని వేణూనే ఆ ఢిల్లీ పిల్ల కావా లని ఇష్టపడుతున్నాడన్న ఆలోచన ఆదినా



రాయణకు రాలేదు. అలాంటి ఆలోచన వచ్చినా రాయుడు వేణు మనసు మార్చగ లడని ఆదినారాయణ విశ్వాసం.

రోజులు గడుస్తున్నాయి.

ఒకరోజు నాటి రాత్రి వర్ధనమ్మ పుట్టిం టికి వెళ్ళింది. తన భర్త పడుతున్న ఆవే దన గురించి, తను పడుతున్న బాధ గురించి తల్లి వరలక్ష్మికి కలిసి చెప్పు కుంది. ఊళ్ళో ఎలా తలఎత్తుకు తిరగాలో తెలియడం లేదని వాపోయింది.

వరలక్ష్మి కూతుర్ని సముదాయించింది.

"చిన్నతనంలో పెళ్ళిళ్లు అయితే పెద్ద వాళ్ళ ఇష్టప్రకారం సాగుతాయి. కానీ పిల్లలు ఎదిగిన తరువాత మన చేతుల్లో ఏముండదే తల్లీ? వేణూయే ఆ పిల్ల కావా లని ఇష్టపడుతున్నాడు. నీ కూతురుతో పెళ్లి కాకపోతే వాడు నీ అన్న కొడుకు, మేనల్లుడు కాకుండా పోతాడా? నువ్వు నా కూతురువి కాదా? దుర్గ నా మనవరాలు కాదా? ఇవన్నీ గతంనుంచీ ఉన్న రక్తసం బంధాలు. ఇప్పుడు ఓ కొత్త సంబంధం కలుపుకుంటున్నాం కదా అని ఉన్న సంబంధాన్ని తెంచుకుంటామా? రక్త సంబంధాన్ని తుంచుకోగలమా? ఇవన్నీ మనసులో పెట్టుకోక నిశ్చితార్థానికి మీరు కూడా ఢిల్లీకి బయలుదేరండి. అన్నయ్యా వదినా వచ్చి పిలుస్తారు" అంది నచ్చచెప్పే ప్రయత్నంలో.

వర్ధనమ్మ విసురుగా లేచింది.

"నిశ్చితార్థమే చేసుకుంటారో, పెళ్లే చేసు కుంటారో చేసుకోండి. ఈ రోజుతో నా పుట్టింటిమీద నాకు ఏ ఆశ లేదు" అంటూ గదిలోంచి బయటికి వచ్చింది. సీతాదేవి "వదినా" అని పలకరించినా పలక్కుండా కంట తడిపెడుతూ బయటికి వెళ్లిపో యింది వర్ధనమ్మ. ఆ సమయంలో రాయుడు ఇంట్లో లేడు. గుడిలో కళ్యాణం ఏర్పాట్లలో ఉన్నాడు. సీతారామయ్య పొలం నుంచి ఇంకా ఇంటికి రాలేదు. ఇది ఆడవాళ్ళ మధ్య జరిగిన సన్నివేశం.

ఇటు రాయుడికి, అటు భీమశంకరానికి కూడా వీలుగా ఉండేటట్లుగా నిశ్చితార్థానికి ముహూర్తం నిర్ణయించబడింది. వర్ధన మ్మనూ, ఆదినారాయణనూ దుర్గతో సహా

నిశ్చితార్థానికి ఢిల్లీ ప్రయాణం అవ్వమని సీతారామయ్య, సీతాదేవి బాధ్యతగా ఆహ్వానించారు.

ఆదినారాయణ "మేము ఎవ్వరం రాము" అని ముఖం మీదే చెప్పాడు. వర్ధనమ్మ, సీతాదేవి పెట్టబోతున్న బొట్టుని కాదని వేరే గదిలోకి వెళ్లిపోయింది.

"ఈ సంబంధం జరగనంత మాత్రాన మన బాంధవ్యాలు తెగిపోవుకదా బావా? ఆవేశపడక పెళ్లికయినా మీరు రావాలని కోరుతున్నాను. మా చెల్లెలు లేకపోతే ఆ పెళ్లి పెళ్ళిలా ఉండదు" బాధగా అన్నాడు సీతారామయ్య.

"అంత బాధ నీకుంటే ఈ సంబంధానికి ఒప్పుకోవు కదా నువ్వు" అన్నాడు ఆదినారాయణ.




**రా**యుడు సకుటుంబంగా ఢిల్లీ వెళ్ళాడు.

భీమశంకరం అతిథులు తక్కువమందే రావటంతో తన స్వగృహంలోనే వారు ఉండటానికి ఏర్పాట్లు చేశాడు. సాదరంగా రాయుడి కుటుంబాన్ని ఎయిర్‌పోర్టులో ఆహ్వానించి కొత్త బంధువులను తన ఇంటికి తీసుకొచ్చాడు.

పనిమనుషులు ఉన్నా శ్రావణి, ఆమె మేనత్త మాణిక్యాంబ వారి అతిథులకు కావలసిన సదుపాయాలన్నీ జాగ్రత్తగా చూసుకుంటున్నారు. శ్రావణి పెళ్ళికూతురే అయినా రాయుడి కుటుంబంతో ఏ కొత్త లేకుండా మాట్లాడుతూ ఆ కుటుంబంలోని వ్యక్తిగా ఉండటం వాళ్ళందరికీ ఆనందాన్నిచ్చింది.

రాయుడికి, సీతరామయ్యకు తన ఇల్లు, ఆఫీసు రూము, లైబ్రరీ అంతా చూపించాడు భీమశంకరం.

"పెద్ద ఇల్లే కట్టారు. ఇప్పుడు కోట్ల విలువచేస్తుంది" అన్నాడు రాయుడు.

"ఎప్పుడో నలభైఏళ్ళ క్రితం నేను ఢిల్లీకి కొత్తగా వచ్చినప్పుడు కొన్నాను ఈ స్థలం. ఐదేళ్ళ తరువాత ఇల్లు కట్టాను" అన్నాడు భీమశంకరం.

"మీకేమండీ మాటలతో లక్షలకు లక్షలు సంపాదిస్తారు. అందులోనూ సుప్రీంకోర్టు లాయర్లంటే ఫీజులు కూడా సుప్రీం లెవెల్లోనే వుంటాయి" అన్నాడు నవ్వుతూ సీతారామయ్య.

"ఆ స్థాయికి ఎదగటానికి ఎంతోకృషి, ఎంతో శ్రమ ఉండాలో కద నాన్నా? " అన్నాడు రాయుడు నవ్వుతూ.

"నిశ్చితార్థం తాజ్ కోరమండల్ హోటల్‌లో ఏర్పాటు చేశాను. నలభై ఏళ్ళుగా నేను ఇక్కడ వుంటున్నా ఏ శుభకార్యం చెయ్యలేదు. అతిథులు చాలామంది వస్తారు. డిన్నరు కూడా అక్కడే ఏర్పాటు చేశాను" చెప్పాడు భీమశంకరం.

"చాలా సంతోషం. మీ స్థాయికి తగ్గట్టుగా మీ పద్ధతుల్లో మీరు జరిపించండి" అన్నాడు రాయుడు.

ఆ సాయంత్రం నిశ్చితార్థం జరిగింది.

అతిథులు చాలామంది వచ్చారు.

వేణు, శ్రావణిలను డయాస్‌పై కూర్చోబెట్టారు. వచ్చిన అతిథులు కాబోయే దంపతులను గ్రీట్ చేశారు. కార్యక్రమం జరుగుతుండగా తగు మాత్రమైన వాల్యూమ్‌తో 'బిస్మిల్లా ఖాన్' షెహనాయ్ నాదం

హాలంతా ఆవరించింది. ఆ తర్వాత వచ్చిన అతిథులు వారి వారి అలవాట్లను బట్టి, వెట్ పార్టీలకు వెళ్లేవారు వెట్ పార్టీలకు వెళ్లేరు. అక్కరలేదనుకున్నవారు భోజనాలు చేశారు. భోజనాలు ముగించుకున్న తరువాత రాయుడి కుటుంబం, వేణు, శ్రావణి అందరూ కలిసి ఇంటికి వచ్చేశారు. భీమశంకరం అక్కడే మిగిలిపోయాడు. మిత్రులు పెళ్ళికొడుకు గురించి అడుగుతున్న ప్రశ్నలకు జవాబులు చెబుతూ, అతిథులను గౌరవంగా పలకరిస్తూ వారితో ఉన్నాడు. పార్టీ ముగిశాక డిన్నరు ముగిసింది. రెండు మూడు నెలల తరువాత పెళ్ళి అని అనుకున్నారు.

రాయుడు కుటుంబం తిరుగుప్రయాణమై పాలెం చేరుకుంది.

వేణు, శ్రావణిలు వైజాగ్ చేరుకున్నారు.

ఎప్పటిలాగే సముద్ర తీరమే వారి కలయిక.

సెల్‌ఫోన్స్ సందేశాలే ఆ ప్రేయసీ ప్రియులకు మేఘ సందేశాలు.

★ ★ ★

మేణుగోపాలస్వామి కళ్యాణం దగ్గర పడటంతో నెలరోజుల ముందునుంచే రాయుడు దగ్గరవుండి అన్ని ఏర్పాట్లు చూస్తున్నాడు. గుడికి రంగులు వేయించడం, భక్తులకు కావలసిన సదుపాయాలు కల్పించడం, పందిళ్ళు వేయించడం, సాంస్కృతిక కార్యక్రమాలు ఏర్పాటుచేయడం, వాటికి కావలసిన స్టేజ్ ఏర్పాటు చేయడం లాంటి కార్యక్రమాలను పర్యవేక్షించడానికి రాయుడు రోజూ మధ్యాహ్నం మూడుగంటలకు గుడికి వెళ్ళి రాత్రి ఎనిమిదిగంటల వేళకు ఇంటికి తిరిగివస్తున్నాడు. ఆ ఉత్సవాలు ఐదురోజుల పాటు జరుగుతాయి. ఆ ఐదురోజులు చుట్టుపక్కల గల గ్రామాల నుంచి చాలా మంది భక్తులు వస్తారు. ఇది ఏటా జరుగుతున్న కార్యక్రమం. చవకబారు

## కొత్తగాలి...

**కవికి**
**పెన్ను వెన్ను**
**కాగితం మిన్ను**
**కవిత్వం జున్ను**

*– కందాళై రాఘవాచార్య, నిజామాబాద్*

సాంస్కృతిక కార్యక్రమాలు కాకుండా, ఉన్నత ప్రమాణాలు గల దైవపరమైన భక్తిజనరంజక కార్యక్రమాలను ఏర్పాటు చేయడం రాయుడి ప్రత్యేకత. ఆ కార్యక్రమాలు తిలకించడానికి చుట్టుపక్కల గ్రామాల నుంచి కూడా జనం వస్తుంటారు.

సీతారామయ్య పొలం వెళ్ళటానికి సిద్ధమవుతున్నాడు. ముందు మండువాలో కూర్చుని పేపరు చూస్తున్న రాయుడు సీతారామయ్యనుద్దేశించి "రేపు కాస్త తీరుబడిచేసుకో నాన్నా... కాకినాడ వెళ్ళి ఆరోజు మనం చూసిన పారిజాతం గారిని మన గుళ్ళో కార్యక్రమానికి స్థిరపరచుకురావాలి" అన్నారు.

"అలాగే నాన్నా" అన్నాడు సీతారామయ్య. మళ్ళీ రాయుడు మాట్లాడుతూ "ఆవిడ కచేరికి ఎంత తీసుకుంటారో కనుక్కొని, ఆవిడ కూడా వచ్చే హంగుదారులకు, ఆవిడకు ప్రయాణపు ఖర్చులిచ్చి అడ్వాన్స్ ఇచ్చి రావాలి. ప్రోగ్రామ్ సమయం కాగితంమీద వేసి ఆవిడకు ఇవ్వాలి. వారు ఏ ట్రెయిన్‌కి బయలుదేరుతారో, లేక టాక్సీలో వస్తున్నారో కనుక్కోవడమే కాకుండా, ఆవిడకు మన ఫోన్ నెంబరు ఇయ్యి. ఆవిడ ఫోన్ నెంబరు నువ్వు తీసుకో" అన్నాడు.

అన్ని జాగ్రత్తలు చెప్పాడు రాయుడు

కొడుక్కి. ఎవర్నైనా ఏ పనిమీదనైనా పంపేటప్పుడు అన్ని జాగ్రత్తలు తీసుకోవడం, అంతా విపులంగా చెప్పడం రాయుడి పద్ధతి. ఆ సంగతి తెలిసిన సీతారామయ్య శ్రద్ధగా ఆయన చెప్పినవన్నీ విని సరేనని, మర్నాడు ఉదయం కాకినాడకు బయలు దేరతానని చెప్పాడు. తండ్రికి ఇచ్చినమాట ప్రకారం పారిజాతాన్ని కలిసి సంగీత కచేరికి స్థిరపరచడానికి సీతారామయ్య బయలుదేరాడు.

పారిజాతం ఇచ్చిన అడ్రస్సు ప్రకారం సీతారామయ్య ఆమె ఇంటి ప్రాంతాలకు చేరాడు. 1950 ప్రాంతంలో ఓ వేశ్యవాటిక అది. ఆలయ మాన్యాలతో బతుకుతూ దేవదాసీలుగా పేరు పెట్టబడినవారు ఆ వీధిలో ఉండేవారు. నృత్యం, సంగీతం సాహిత్యంలో కొంత పరిచయం కలవారై ఆ వీధిలో నివసించేవారు ఆనాటి వారం దరూ. గణపతి నవరాత్రులకు, దేవీనవరాత్రులకు ఆలయాల్లోనూ, పెళ్ళిళ్ళలోనూ పది పదిహేను మంది కలసి మేజువాణీలు కూడా చేసేవారు. సామాన్య జనాకర్షణ కోసం మామూలు సినిమా పాటలు పాడినా, ముఖ్యంగా ఆధ్యాత్మిక కీర్తనలు, జావళీలు, దశావతారాలు మొదలైన దైవ సంబంధిత ఆటపాటలను ప్రదర్శించేవారు. ప్రైవేటు సాంగ్స్ కూడా పాడుతూ నర్తించేవారు. మేజువాణీలను ప్రభుత్వం నిషేధించిన తరువాత, ఆ కార్యక్రమాలు కొన్నేళ్ళపాటు చాటుమాటుగా సాగినా ప్రస్తుతం లేవనే చెప్పాలి. కానీ ఆ వీధికి గతంలో పడినముద్ర ఆ తరం మనుషుల మనసుల్లోంచి చెరిగిపోలేదు. ఇప్పుడు ఆ వీధుల రూపురేఖలే మారిపోయాయి. ఒక వర్గం వారు కాకుండా అనేక రకాల జనం ఆ వీధిలో ప్రస్తుతం నివసిస్తున్నారు. ఆ వీధిలోనే ఉంది పారిజాతం ఇల్లు.

సీతారామయ్య ఒక ఇంటిముందాగి బోర్డు చూశాడు. వై. పారిజాతం, భక్తగాన చూడామణి అని చదువుకున్నాడు. తలుపు తట్టేడు సీతారామయ్య. అరవైయేళ్ళ పని మనిషి వచ్చి తలుపు తీసింది. ఆమె తలుపు తెరవగానే తంబురనాదం వినపడుతోంది. అది ఎవరో మీటినట్లుగా కాకుండా రికార్డు చేసిన మ్యూజిక్‌లా వరుసగా అలా వినపడుతూనే వుంది. దానికి తోడు చక్కటి సుగంధ పరిమళం. మంచిగంధం ధూమం ద్వారా వాతావరణం హాయిగా తోచింది సీతారామయ్యకు.

ఎదురుగా నిలబడ్డ సీతారామయ్యను చూసి పెద్దమనిషిలా వున్నారు అనుకొని పనిమనిషి 'అమ్మగార్ని పిలుస్తాను కూర్చోండి బాబూ' అంటూ సోఫా చూపించి లోపలికెళ్ళింది.

సీతారామయ్య హాలంతా పరికించాడు. ఒక ఎత్తైన అరుగుమీద శ్రీ కృష్ణుడు మురళీ వాయిస్తున్నట్లుగా పాలరాతి విగ్రహం ఉంది. ఆ విగ్రహం మెడలో ఆవేళే వేసినట్లు పచ్చగా ఉన్న తులసిదళాల మాల వుంది. అదీ వైజయంతీమాల. ఆ పక్కనే కృష్ణుడికి ఓ పక్కగా మూడురకాల తంబురాలు గోడకి ఆన్చివున్నాయి. మరోపక్క వీణ వుంది. అవి ఖరీదైన వాయిద్యాలలా కన్పిస్తున్నాయి. తంబుర నాదం అలా వినవస్తూనే వుంది. మంచి గంధపు ధూపం గదినంతా ఆవరించి చక్కటి పరిమళాన్ని అలలు, అలలుగా అందిస్తూనే వుంది. సీతారామయ్యకు ఆ వాతావరణం ఓ పవిత్ర భావం కలిగించింది.

పారిజాతం లోపల్నించి వచ్చింది. సోఫాలో కూర్చున్న సీతారామయ్యను గుర్తుపట్టి నమస్కరించింది. 'రాయుడు గారి అబ్బాయిగారు కదూ' అంది చిరునవ్వుతో.

# బాత్‌రూమ్ చెప్పే రహస్యాలు




అమెరికన్ గూఢచారి సంస్థ సిఐఏలోని కొందరు నిపుణులు వాషింగ్టన్ డి.సి.కి వచ్చే, రాజకీయ ప్రముఖుల రహస్యాలని వారికి కేటాయించిన హోటల్ లేదా అతిథి గృహాల్లోని బాత్‌రూంల నించి సేకరిస్తుంటారు. వారి ఆరోగ్య పరిస్థితిని తెలుసుకోవడానికి వారి మలమూత్రాలని సేకరించే విధంగా బాత్‌రూంని సిఐఏ ప్రత్యేకంగా డిజైన్ చేస్తుంది.

వారు ఉపయోగించిన టూత్‌పేస్ట్ ట్యూబ్‌ని నిత్యం బాత్‌రూంని క్లీన్ చేసే సిఐఏ ఏజెంట్లు ఫొటోలు తీసి సైకియాట్రిస్ట్‌కి



పంపుతారు. వారు టూత్‌పేస్ట్ ట్యూబ్‌ని ఉపయోగించిన విధానాన్ని బట్టి వారి వ్యక్తిత్వాన్ని సైకియాట్రిస్ట్‌లు అంచనా వేస్తారు. ఈ విధానాన్ని సిఐఏ సైకియాట్రిస్ట్ హెర్బర్ట్ హాఫ్‌మెన్ కొన్ని వందల మందిని పరిశీలించి రూపొందించాడు.

ట్యూబ్‌ని వెనకనించి పద్ధతి ప్రకారం నొక్కి పేస్ట్‌ని వాడేవారు ఓపిక కలిగి వున్న వారు, పాజిటివ్ టైప్ మనుషులు, ప్రణాళికలు రచించేవారు.

మధ్యలోంచి ట్యూబ్‌ని నొక్కేవారు జీవితాన్ని తేలిగ్గా తీసుకునే, ఆనందాల వెంట పరిగెత్తి, ఏది తోస్తే అది చేసే రకం.

ట్యూబ్‌ని వెనకనుంచి పద్ధతి ప్రకారం నొక్కడమే కాక, దాన్ని చుట్టే వారు, ఏ పనయినా సక్రమంగా జరగాలనుకునేవారు. వీరు ఇతరులలోని తప్పులని గమనించి విమర్శిస్తారు. వారిని సరిదిద్దడానికి ముందుకు వస్తారు.

కేప్‌ని మళ్ళీ పెట్టనివారు ధైర్యవంతులు, విషయానికి సూటిగా స్పందించేవారు.

ట్యూబ్‌ని ఉపయోగించే ముందు, తర్వాత కడిగేవారు తమ ఆరోగ్య విషయంలో శ్రద్ధ తీసుకునే రకం. అన్ని విషయాల్లో వీరు జాగ్రత్తని వహిస్తారు.

పేస్ట్ కింద ఒలికించేవారు డబ్బు విషయంలో విచ్చలవిడిగా ఉంటారు. లంచాలు తీసుకోడానికి వెనకాడరు. నిబద్ధత లేనివారు. నమ్మదగ్గవారు కాదు.

వీరి గుణగణాలని దృష్టిలో ఉంచుకుని వీరితో చర్చలు జరిపే అధికారులు నిర్ణయాలని తీసుకుంటారు.

ఇంతేకాక వీరు సబ్బుని ఉపయోగించే విధానం, దాన్ని ఎక్కడ పెట్టారు? అలాగే టవల్‌ని ఉపయోగించే విధానాలని కూడా పరిశీలించి హెర్బర్ట్ వారి సైకాలజీని అంచనా వేస్తాడు. పూర్వం రష్యా గూఢచారి సంస్థ కె.జి.బి. కూడా సైకియాట్రిస్టుల సేవని తీసుకునేది. నిజానికి పాశ్చాత్య దేశాల గూఢచారుల సంస్థలన్నీ సైకియాట్రిస్టుల సేవలని వినియోగించుకుంటున్నాయి.

## కొత్తగాలి...



**తెల్లకాగితం చెబుతోంది**
**ఉల్లం తనలా ఉండాలని!**
**చెరగని అక్షరం నిండాలని**
**తరగని కావ్యం పండాలని!**

*–డా॥ అయాచితం నటేశ్వరశర్మ*
*కామారెడ్డి*

"అవునమ్మా నా పేరు సీతారామయ్య. మా పక్కవూరికి మీరొచ్చినప్పుడు కచేరీలో కలిసాం" అన్నాడు పరిచయాన్ని జ్ఞాపకం చేస్తున్నట్లుగా.

"నేనెలా మరచిపోగలను బాబూ? మీ కుటుంబం మొత్తం నాకు గుర్తుంది. మీరు ఏం తీసుకుంటారు. కాఫీయా, పాలా, టీనా? " అంది మర్యాదగా పారిజాతం.

"ఏమీ వద్దమ్మా... అన్నీ దారిలోనే పూర్తయ్యాయి. వచ్చేనెల 18వ తారీఖున వేణుగోపాలస్వామి కల్యాణ మహోత్స వాలు ప్రారంభమవుతాయి. 18వ తేదీ నుంచి 22వ తేదీవరకు అయిదు రోజుల పాటు జరుగుతాయి. హరికథలు, గానకచే రీలు, భజనలు, నాటకాలు లాంటివి జరు గుతాయి. ఈసారి మీ గానకచేరీ ఏర్పాటు చెయ్యాలని మా నాన్నగారు, మీకు ఏ రోజున వీలవుతుందో చెబితే ఆ రోజున ఏర్పాటు చేస్తామన్నారు. మీకు కావలసిన సదుపాయాలు ఏమిటి, మీ రాకపోకల ఖర్చుల కింద కచేరీకి మీకూ, మీ బృందా నికి మేము ఎంత ఇవ్వాలో కనుక్కొని మీకు అడ్వాన్స్ ఇచ్చి రమ్మని నాన్నగారు పంపించారు" అని ఆగాడు సీతారామయ్య.

"రాయుడుగారిలాంటి రసజ్ఞులు, మహా నుభావుల ముందు కచేరీ చేసే అవకాశం రావడమే మా అదృష్టం. వేణుగోపాల స్వామి సన్నిధిలో ఆ స్వామిని తలచుకొని గానం చెయ్యడానికి ఇంత ఇమ్మని నేను ఎప్పుడూ అడగను. నాన్నగారి దయ, మా ప్రాప్తి. ఒక్కరూపాయి అడ్వాన్స్ ఇచ్చి తమ ఫోన్ నెంబరు, అడ్రస్సు ఇవ్వండి చాలు. తమ ఫోన్ నెంబరూ అడ్రస్సు మాకు ఏదైనా మార్పులుంటే తెలియచేయ డానికి బాబూ. మా కారులో మా బృందం వచ్చే నెల 20వ తేదీ మధ్యాహ్నం మీ ఊరు చేరుకుంటుంది. వేణుగోపాలస్వామి సన్నిధిలో నాన్నగారు ఆదేశించినమేరకు కచేరి ఇరవయ్యవ తేదీ సాయంత్రం ప్రారంభిస్తాను" అంది పారిజాతం.

ఇక సీతారామయ్యకి మాట్లాడవలసింది ఏమీ మిగల్లేదు. జేబులోంచి వెయ్యినొక్క రూపాయి, అడ్రసు కాగితం తీసి పారిజా తానికి తనకి మధ్యనున్న టేబుల్ మీద పెట్టేడు. పారిజాతం ఆ డబ్బును తీసుకొని కళ్ళకద్దుకుంది. సీతారామయ్య లేచేడు. పారిజాతం గుమ్మందాకా వెంట వచ్చి అత ను వస్తానని చెప్పగా, నమస్కరించి సాగ నంపింది.

★ ★ ★

రాయుడి ఆహ్వానం మేరకు పారిజాతం తన బృందంతో కారులో వచ్చి రాయుడు ఇంట్లో దిగింది. సీతాదేవి పర్యవేక్షణలో వారికి కావలసిన సదుపాయాలు అన్నీ ఇంటి నౌకర్లు చంద్రయ్య, రాములమ్మ శ్రద్ధగా చూసుకున్నారు. వారి స్నానపానా దులు అయిన తరువాత సీతాదేవి దగ్గ రుండి భోజనాలు వడ్డించింది. వరలక్ష్మి వచ్చి నెమ్మదిగా 'కూర్చోండి' అని పలక రించి వెళ్ళింది. ఆమె వెంటే వచ్చిన రాయుడ్ని చూసి భోజనాలు చేస్తున్న నలు గురూ లేచారు పారిజాతంతో పాటు మర్యాద పూర్వకంగా.

రాయుడు ముక్కుమీద వేలేసుకుని "భోజనాల దగ్గరనుంచి అలా లేవవచ్చా? అది కాకపోయినా మీరు మాకు అతి థులు. అతిథుల్ని మేము గౌరవించాలి.

నన్ను గౌరవించడం కోసం మీరు లేవటమే మిటి కూర్చోండి, కూర్చోండి" అని వారు కూర్చొనేదాకా తాను నిలబడే ఉన్నాడు. వారు కూర్చున్నాక కోడలి వైపు చూస్తూ "పిండి వంటలన్నీ వడ్డించావా అమ్మా?" అన్నాడు. "అన్నీ వడ్డించాము. నిన్న మన ఆవు ఈనిందికదా. ఆ జున్ను కూడా వడ్డించాను. భోజనానికి ముందు స్వామి వారికి నివేదన చేసి తెచ్చిన ప్రసాదం కూడా వడ్డించాను" అని వినయంగా చెప్పింది కోడలు సీతాదేవి. కూర్చుని భోజనం చేస్తున్నవారికేసి తిరిగి పారిజాతం వైపు చూస్తూ, "నెమ్మదిగా, తృప్తిగా భోజనం చెయ్యండి. సాయంకాలం ఏడు గంటలదాకా ఆలయానికి వెళ్ళక్కర లేదు. పల్లెటూరు కదా.. జనం తొందరగా రారు. కార్యక్రమం ఏడున్నర తరువాత కాని ప్రారంభం కాదు. అంతదాకా హాయిగా విశ్రాంతి తీసుకోవచ్చు" అన్నాడు.

"అమ్మగారు వడ్డించిన పదార్థాలు అన్నీ కొంచెం కొంచెం రుచి చూసినా సాయంత్రం ఆరు గంటల దాకా భుక్తాయాసంతో లేవడం కష్టమే బాబుగారూ. పదార్థాలు కూడా అంత రుచిగా ఉన్నాయి" అంది పారిజాతం సీతాదేవి వైపు చూస్తూ. సీతాదేవి, రాయుడు నవ్వుకున్నారు. రాయుడు అక్కడినుంచి వెళ్లిపోయాడు. వారు భోజనాలు చేస్తుండగా సీతారామయ్య బయటినుంచి వచ్చి పారిజాతాన్ని చూసి పలకరింపుగా నవ్వి లోపలికెళ్లాడు.

వేణుగోపాలస్వామి ఆలయంలో స్వామి వారికి అభిముఖంగా ఉన్న వేదికమీద పారిజాతం కచేరీ ప్రారంభమైంది. పారిజాతం బాగా పాడుతుందని తెలిసిన ఆ చుట్టుపక్కల గ్రామాలవారు కూడా ఆ కార్యక్రమానికి తరలి వచ్చారు. రాయుడు ఆలయ ధర్మకర్తగా, గ్రామ పెద్దగా వచ్చిన భక్తులకు మంచినీళ్లు, పిల్లలతో వచ్చిన తల్లుల పిల్లలకు పాలు, భక్తులందరికీ అరిటాకు దోనెలలో ప్రసాదంగా రవ్వ లడ్డు, పులిహోరలు అందేలా పర్యవేక్షిస్తున్నారు. అంత పెద్ద మనిషి కూర్చోకుండా నిలబడే నాలుగు దిక్కులా పర్యవేక్షిస్తున్నారు. ఆయన పురమాయించినట్లు కొడుకు సీతారామయ్య అందరికీ సదుపాయాలు జరిగేలా చూస్తున్నారు.

పారిజాతం గాన కచేరి ప్రారంభమైంది.

రాయుడు కళ్లు నాలుగు వైపులా పరికిస్తూ కూతురు వర్ధనమ్మ, మనవరాలు దుర్గ కన్పిస్తారేమోనని చూశాడు. ఆదినారాయణ మొండివాడు రాడని తెల్సు. ఎక్కడా వాళ్ల జాడ లేదు. దేముడి కార్యం మీద కూడా అలిగేరన్నమాట అనుకున్నాడు.

వినాయక ప్రార్థన అయిన తరువాత రాయుడు కూర్చున్నాడు. పక్క వూరు నుంచి వచ్చిన కొందరు రైతులు ఆయన వరుసలో కూర్చున్నారు. ఓ పక్క వరలక్ష్మి, సీతాదేవి కూర్చున్నారు. రాయుడు కూర్చున్నా వెనక వరుసలో ఒక అమ్మాయి, అబ్బాయి వచ్చి కూర్చున్నారు. పారిజాతం కంటికి వారిద్దరూ చిలకా, గోరింకల్లా కనిపించారు. పారిజాతం ఆ అబ్బాయిని ఒకసారి గతంలో కలిసినట్టు గుర్తుకు తెచ్చుకొని "రాయుడుగారి మనవడు కదా" అనుకుంది.

వారిని గమనించిన రాయుడు "ఎదరకొచ్చి కూర్చో తాతా" అన్నాడు మనవడు వేణు అతని వెంట వచ్చిన శ్రావణిని ఉద్దేశించి. వేణు, శ్రావణి ఆ రోజు సాయంకాలానికి పాలెం చేరుకున్నారు. అందుకని ఇంట్లో అందరికంటే కొంచెం ఆలస్యంగా వచ్చారు పారిజాతం కచేరీకి. వేణూ వెంట వచ్చిన అమ్మాయిని చూసి 'అమ్మాయి చక్కగా ఉంది. మధ్యాహ్నం నుంచీ ఇంట్లో

ఎక్కడా కనిపించలేదు. బంధువులై ఉంటా రనుకుంది. ఇదంతా క్షణాలమీద జరిగిపో యింది.

పారిజాతం ఎంతో శ్రద్ధా భక్తులతో పాడడం ప్రారంభించింది. మువ్వగోపాల పదాలు, అన్నమయ్య కీర్తనలు, కొత్త కొత్తవి పాడి ప్రేక్షకులను మెప్పించింది. వేణుగోపాలస్వామి కళ్యాణం కనుక ఎక్కువ కృష్ణుడి మీద కీర్తనలు, పాటలను పాడింది. ఆ కచేరీ రెండు గంటలపాటు సభను ఉర్రూతలూగించింది.

ఉండబట్టలేక మధ్యలో ఒకసారి మృదంగ విన్యాసం జరుగుతున్నప్పుడు శ్రావణి "చాలా బాగా పాడుతున్నారు కదూ ఆవిడ" అంది వేణుతో.

"నేను ఇదివరకు విన్నాను. అప్పుడు కూడా రామదాసు, త్యాగయ్య కీర్తనలు, కృతులు అద్భుతంగా పాడారు. బాగా శాస్త్రం తెలిసిన మనిషే కాకుండా సంగీతా నికి తగ్గ గాత్రం గల గాయని. ఆవిడ పేరు పారిజాతం" అన్నాడు వేణు.

మృదంగ విన్యాసం పూర్తయి పారి జాతం మళ్ళీ పాడటం ప్రారంభించింది. ఏ పక్క చూపులు లేకుండా ప్రేక్షకులం దరూ ఆమె గానంలో లీనమైపోయారు. వారితోపాటు వేణు, శ్రావణిలు కూడా. ఆ గాయనిపట్ల విపరీతమైన భక్తి, గౌరవాలు ఏర్పడ్డాయి శ్రావణికి తొలి దర్శనంలోనే.

కచేరీ పూర్తయ్యింది.

రాయుడు వేదికపైకి వెళ్ళి పారిజాతం గురించి, ఆవిడ గానాన్ని గురించి నాలుగు మంచి మాటలు చెప్పి వరలక్ష్మిని వేదిక మీదకు పిలిపించి మామూలుగా శాలువా కప్పించడం కాకుండా పట్టువస్త్రాలు పెట్టిం చాడు. అలాగే వాయిద్యకారులకు కూడా బట్టలు పెట్టించాడు. వారంతా ఆశ్చర్యంగా చూస్తుంటే, "పెళ్ళికి వచ్చిన అతిథులకు బట్టలు పెట్టడం మన సాంప్రదాయం కదా. స్వామివారి పెళ్ళి కదా" అన్నాడు నవ్వుతూ రాయుడు. ఆ తరువాత పారిజా తానికి అందజేయవలసిన పారితోషికాన్ని శాస్త్రయుక్తంగా తాంబూలంలో పెట్టి, వక్క, ఓ అరటి పండు కూడా జోడించి ఆమె చేతికందించాడు.

ఎందరో ప్రేక్షకుల మన్నన పొందిన అంతటి గాయని వారిరువురి పాదాలకు నమస్కరించి 'నాదో చిన్న మనవి' అంది. ప్రేక్షకులందరూ నిశ్శబ్దమయ్యారు.

"ప్రకృతిలో ఎన్నో పూలు పూస్తాయి. అందులో చాలా కొద్ది పూలు మాత్రమే దైవసాన్నిధ్యాన్ని చేరగలుగుతాయి. వర్ష రుతువులో ఎంతో వర్షం కురుస్తుంది. స్వాతికార్తిలోనూ కొంత వర్షం కురు స్తుంది. ఆ కొంతలో కొన్ని చినుకులే ముత్యపుచిప్పలో పడతాయి. అవే ముత్యా లవుతాయి. అలాగే ఎంతమంది ప్రేక్షకుల ముందు, నేను ఈ భక్తి సంగీతాన్ని ఆల పించానో నాకే తెలీదు. అయినా ఈనాడు రాయుడుగారిలాంటి పెద్దలముందు సంస్కృతీ, సాంప్రదాయాల ప్రతినిధి ముందు పాడే అదృష్టం కలగటం అడవిన పూచిన పువ్వు స్వామి సన్నిధిని చేరడమే. స్వాతిచినుకు ముత్యపు చిప్పను చేరటంలా భావిస్తున్నాను. నేను ఈనాడు స్వామి సా న్నిధ్యంలో చేరిన పుష్పాన్ని, ముత్యపుచి ప్పలో పడి ముత్యాన్నైన చినుకుని' అని చేతులు జోడించి నమస్కరించింది.

"చక్కగా మాట్లాడుతున్నారు" అన్నాడు వేణు ప్రక్కనే ఉన్న శ్రావణితో.

కచేరీ అయిన తరువాత ఆ రాత్రే తాము కాకినాడ వెళ్ళిపోవాలని రాయుడు దగ్గర సెలవు తీసుకొని పెద్దలకు చెప్పి 'వస్తాను బాబూ, వస్తానమ్మా' అంటూ వేణుకు, శ్రావణికి కూడా చెప్పింది పారి జాతం. అప్పటికే వెండి కుంకుమ భర ణితో వచ్చిన సీతాదేవి తాను బొట్టు పెట్టు

'ఇప్పటికే ఊరంతా ఊడ్చుకు పోయింది. రాయి, చెట్టు, గుట్ట అన్నీ మింగుతున్నారు వాళ్లు. మిగిలిందల్లా రాతిబావి. చుట్టుపక్కల 116 పల్లెలకీ నీళ్లిచ్చేది ఇదొక్కటే. దీనినీ వాళ్ల చేతుల్లో పెట్టాలా'.. అన్నాడా తాత. ఒకప్పుడు రైతులు సింహాల్లా బతికిన హిరణ్య ప్రాంతంలో నేడు ఏమిటీ విపరీతం? కొందరి విలాసాల వేడుకలను, అనేకుల విషాద జీవితాలను కళ్లకు కట్టించిన వేంపల్లి గంగాధర్

**నేలదిగిన వాన**




కుని, పారిజాతానికి బొట్టు పెట్టింది. "మీకు ఎంత మంది బొట్టు పెట్టినా మీ బొట్టు ముందు అవేవి కనిపించవు. మీ బొట్టు ఎవరు పెట్టిన బొట్టునైనా తనలో ఇముడ్చుకుంటుంది" అంది సీతాదేవి. ఆ మాటకు పారిజాతం నవ్వుకుంది. 'ఒకప్పుడు నేనూ చిన్న బొట్టే పెట్టుకునేదానమ్మా. కచేరీలు ప్రారంభించాక ఇంత పెద్ద బొట్టు పెట్టుకుంటున్నాను. అలా అలవాటైపోయింది. ఈ బొట్టు వయసు ఇరవైయేళ్ళు' అంది నవ్వుతూ. పారిజాతం కారెక్కింది. అందరూ సాగనంపగా కారు కదిలింది. కారు కదిలాక పారిజాతం ఒక్కసారి శ్రావణివైపు చూసింది ఆప్యాయంగా.

కారు కడియం బ్రిడ్జ్ మీదుగా కెనాల్ రోడ్డెక్కి కాకినాడవైపు పరుగెడుతోంది.

పారిజాతం మనసులో ఏవేవో ఆలోచనలు ముసిరాయి. శ్రావణిని ఎక్కడో చూసినట్లు అన్పిస్తోంది. పరిచయమున్న ముఖం అన్పిస్తోంది. కాని ఎక్కడ పరిచయమో, ఏ అనుబంధమో స్పష్టంగా మనసుకు తెలియడం లేదు.

చల్లగాలికి పారిజాతం చిన్నగా నిద్రలోకి జారింది. కారు ప్రయాణం చేస్తోంది. రాత్రిపూట కావటంతో రోడ్డు ఖాళీగా వుంది. కారు కాకినాడ చేరుకుంది. పారిజాతం దిగి తన ఇంట్లోకి వెళ్ళింది. మిగిలినవారు ఎవరిళ్ళకు వారు వెళ్ళారు. నిద్రట్లో ఏవేవో కలల మధ్య మనసు తెరపై జరిగిన జ్ఞాపకాల బొమ్మలు, అలా

కలల మధ్య, మెలకువ మధ్య పారిజాతం రేయంతా నిద్రపోయింది.

★ ★ ★

తెల్లవారింది.

వైజాగ్ వెళ్ళిపోవడానికి శ్రావణి, వేణు సిద్ధమవుతున్నారు. శ్రావణికి పరీక్షలట, వేణుకి ఏదో ముఖ్యమైన పనుందట. ఇంట్లో పెద్దవాళ్ళకి చెప్పి ప్రయాణానికి సిద్ధమయ్యారు.

రాములమ్మ 'అమ్మగారూ, అమ్మగారూ' అంటూ స్నానాల గదివైపు నుంచి చేతిలో ఉన్న హారంతో పరిగెత్తుకొచ్చింది.

"ఏమిటే ఆ అరుపులు" అంది సీతాదేవి.

"బంగారం గొలుసు అమ్మగారూ, తానాలగదిలో సబ్బుపెట్టె పక్కన గూట్లో వుంది" అంటూ తన చేతిలోని గొలుసు చూపుతూ నిలబడింది.

ఒక్క క్షణం పరిశీలనగా చూసిన సీతాదేవి "ఇది నాది కాదే, అత్తయ్యగారిది కాదు, శ్రావణి మెడలో ఇలాంటి గొలుసు చూసిన గుర్తు లేదు" అంటూ శ్రావణిని పిల్చింది సీతాదేవి.

"పిలిచారా అత్తయ్యా? " అంటూ శ్రావణి వచ్చింది.

"ఈ గొలుసు నీదేమో చూడమ్మా" అంది రాములమ్మ చేతిలో గొలుసును చూపిస్తూ సీతాదేవి.

"కాదత్తయ్యా. నా గొలుసు నా మెడలోనే వుంది" అని మెడలో ఉన్న ఒంటిపేట గొలుసును చూపించింది శ్రావణి. ఇదంతా వింటున్న వరలక్ష్మి ఒక్క క్షణం ఆగి "బహుశ నిన్న కచేరి చేసిన ఆ అమ్మాయిదే అయ్యుంటుంది. స్నానం చేసింది కదా. అక్కడ మరచిపోయి వుంటుంది. ఇంకెవరూ ఆడవాళ్ళు రాలేదుగా" అంది.

ఈ వార్త రాయుడు చెవిన పడింది.

సీతారామయ్యను పిలిచి "పారిజాతానికి ఫోన్‌చేసి ఆవిడ గొలుసు ఇక్కడ మరచిపోయిందని చెప్పు. ఖరీదైన వస్తువుకదా. వెతుక్కుంటూ ఉండొచ్చు పాపం. నువ్వే స్వయంగా వెళ్ళి ఇచ్చేసిరా నాన్నా" అన్నాడు రాయుడు. సీతారామయ్య సరేనన్నాడు.

టిఫిన్లు అయిన తర్వాత సీతారామయ్య కాకినాడకు బయలుదేరేడు. వేణు, శ్రావణిలు వైజాగ్ బయలుదేరారు. రాయుడు గుడికి బయలుదేరాడు. అలా ఎవరి పనుల మీద వారు బయలుదేరారు.

సీతారామయ్య రైలు దిగి సరాసరి పారిజాతం ఇంటికి వెళ్ళాడు. తెలిసిన దారే కావడంతో ఇబ్బంది ఏమీ కలగలేదు. తలుపు తట్టేడు.

పారిజాతం పూజ ముగించుకొని అప్పుడే హాల్లోకి వచ్చింది. కృష్ణ విగ్రహానికి అంత క్రితంరోజు వేసిన తులసి మాలను తీసేసి కొత్త తులసి మాల వేసింది. అప్పుడు ఎవరో తలుపు తడుతున్న చప్పుడు విని వెళ్ళి తలుపు తీసింది.

ఎదురుగా సీతారామయ్య.

పారిజాతం నమస్కరించి సాదరంగా సీతారామయ్యను లోపలికి ఆహ్వానించింది.

సీతారామయ్య హాల్లో కుర్చీలో కూర్చున్నాడు. గతంలో తాను చూసిన వాతావరణమే. ఏమీ మార్పు లేదు. కృష్ణ విగ్రహం మెళ్ళో అప్పటిలాగా తులసి మాల. అదే తంబుర నాదం, అదే సుగంధ పరిమళం. కాకపోతే ఒక్కటే తేడా. మొదటిసారి వచ్చినప్పుడు అరవై యేళ్ళ ముసలమ్మ పనిమనిషి తలుపు తీసింది. పారిజాతం అప్పుడే పూజలోంచి వచ్చినట్టు ఆమె నుదుటి బొట్టు, శిఖలో ధరించిన పువ్వు, ఆమె ధరించిన పట్టుచీర, చేతులకు అంటిన పసుపు చెప్పకనే చెబుతున్నాయి.

సీతారామయ్య తన జేబులోంచి ఒక పొట్లం తీసి విప్పి, "ఇదుగో మీరు మా ఇంట్లో మరచిపోయిన హారం" అంటూ పారిజాతం చేతికిచ్చాడు.

పారిజాతం హారాన్ని తీసుకొని కళ్ళకద్దు కుంది.

"ఇవాళ ఉదయం మీరు ఫోన్ చేసే దాకా హారం మీ ఇంట్లో మరచిపోయినట్టు గుర్తులేదు. ఆ హారం మీ ఇంట్లో మర్చిపో యాను కాబట్టి తిరిగి నాచేతికొచ్చింది. లేక పోతే పోయిన వస్తువుల మీద ఆశ వదు లుకోవలసిందే. నిన్నటి కార్యక్రమం ఒక తియ్యని అనుభూతే అయితే ఈ గొలుసు మీరు తీసుకొచ్చి ఇవ్వడం మరో అను భూతి. మరపురాని జ్ఞాపకం. మీ అమ్మ గారూ, నాన్నగారు, మీ ఆవిడ, పిల్లలు నేను ఈ గొలుసు వేసుకున్నప్పుడల్లా గుర్తొ స్తారు" అంది పారిజాతం కృతజ్ఞతాభా వంతో.

సీతారామయ్య నవ్వుతూ "స్నానాల గదిలో దొరికిందని ఆ గొలుసు పట్టుకొచ్చి మా ఆవిడకి ఇచ్చింది మా పనిమనిషి రాములమ్మ. మీరు కృతజ్ఞతలు చెబితే ఆవిడకి చెప్పాలి" అన్నాడు.

"ఆమె మీ ఇంటి పనిమనిషి. మీకు తగి నట్టుగానే ఉండటం సహజంకదా. మొగలి పొద పక్కన పెరిగిన మోదుగ చెట్టుకు కూడా మొగలివాసన అబ్బినట్టు" అంటూ లేచింది పారిజాతం.

సీతారామయ్య లేచి నిలబడ్డాడు.

"రండి. దేవికి నమస్కరించి ప్రసాదం తీసుకొని వెళుదురుగాని" అంది. పారి జాతం సీతారామయ్యను తన వెంట లోప లికి తీసుకెళ్ళింది. లోపల గదిలో ఉన్న పూజామందిరం ముందు సీతారామయ్య నిలబడి ఉన్నాడు. దేవీ మెడలో చాలా నగలున్నాయి. సీతారామయ్య చక్కగా అలంకరించబడి వున్న దేవికి అరమోడ్పు కన్నులతో నమస్కరించాడు.

## కొత్తగాలి...

**నిత్యం వేడుకుంటున్నా**
**దేవుడు కనబడతాడేమోనని..**
**దేవుడు వెదుక్కుంటున్నాడు**
**మనిషి దొరుకుతాడేమోనని**

—శైలజా మిత్ర, హైదరాబాద్

"తీర్థప్రసాదాలు తీసుకోండి" అంది పారి జాతం. దేవి దగ్గర ఉన్న వెండిగిన్నెలోని తీర్థాన్ని వెండి ఉద్ధరిణితో సీతారామయ్య చేతిలో మూడుసార్లు వడ్డించింది. సీతారా మయ్య తీర్థం తీసుకుని తడిచేతిని తలకి రాసుకున్నాడు. ఆ తరువాత ప్రసాదం కూడా ఇచ్చింది పారిజాతం. ప్రసాదం కళ్ళకద్దుకుని నోట్లో వేసుకుని చేతి రుమా లుతో చేయి తడుచుకుని ఈసారి దేవిని చూస్తూ నమస్కరించాడు. "దేవీపూజ రోజూ చేస్తారా? " అన్నాడు పారిజాతంతో.

"ఊరిలో ఉంటే లలితా సహస్రనామా ర్చన చేసుకుంటానండీ" అంది వినయంగా పారిజాతం.

సీతారామయ్య మళ్ళీ దేవిని చూశాడు.

అడుగున్నర ఎత్తుగల దేవీ విగ్రహం స్థిరదేవిగా కొలువైంది. ఆ దేవీ పీఠానికి ఆనుకుని ఉన్న ఒక ఫొటో సీతారామయ్య కంటపడింది. పరీక్షగా చూసాడు సీతారా మయ్య. ఐదారు నెలలలోపు ఆ ఫొటోను సీతారామయ్య చాలాసార్లు చూశాడు. ఆ ఫొటోను చూడ్డమే కాదు. ఆ ఫొటోలోని అమ్మాయిని చాలా సన్నిహితంగా చూశాడు, మాట్లాడాడు. అందుచేత ఆ ఫొటోలో కిరీటం ధరించి ఉన్న అమ్మాయి సీతారామయ్యకు తెలుసు. తాను పొరబడే అవకాశమే లేదు. పక్కనే వేణు ఫొటో లేకపోయినా ఆ ఫొటో శ్రావణిదే అని నిర్ణ

యానికి వచ్చాడు.

సీతారామయ్య ముఖకవళికలు మారిపోయాయి. ఎప్పుడూ నవ్వుతూ పలకరించే సీతారామయ్య పారిజాతం కళ్లలోకి తీక్షణంగా చూస్తూ, "ఈ ఫోటో ఎవరిది? " అన్నాడు. దేవీపీఠం దగ్గర ఒకే ఒక్క ఫోటో వుంది.

పారిజాతం "మా అమ్మాయిదే" అంది చాలా సాధారణంగా. "అంటే నీ కూతురుదా? " అన్నాడు సీతారామయ్య.

పారిజాతం మనసు ఏదో తత్తరపాటుకు గురయ్యింది.

పాలెంలో వేణు పక్కన తాను చూసిన అమ్మాయి రూపు స్ఫురణకొచ్చింది. ఒక్కసారి దేవీ పాదాల చెంత కిరీటం ధరించి ఉన్న ఫోటోను చూసుకుంది. తత్తరపాటును అణుచుకుంటూ "మా అమ్మాయి అంటే మాకు తెలిసిన వాళ్లమ్మాయి."

"దేవీ పీఠంలో పెట్టి దేవితో సమానంగా పూజలు చేస్తున్నారు. ఇప్పుడు వుందా, లేదా, వుందో లేదో తెలీదా. ఇల్లు వదిలి పారిపోయిందా? తెలిసిన వాళ్లమ్మాయిది అయితే మీ దేవీ పక్కన ఎందుకుంది ఆ అమ్మాయి ఫోటో? " అంటూ పోలీస్ ఇంటారాగేషన్‌లా అడిగాడు సీతారామయ్య.



అప్పటిదాకా ఎంతో ప్రశాంతంగా ఉన్న పారిజాతం మనసు కకావికలమయిపోయింది. పాలెంలో వేణు పక్కన కనిపించిన అమ్మాయి రూపు, ఇక్కడ దేవి పాదాల చెంత ఉన్న ఫోటోలో ఉన్న అమ్మాయి రూపు తన మనసులో కదలాడుతున్నాయి.

తత్తరపాటును కప్పిపుచ్చుకుంటూ లేచి నవ్వుతూ చిరునవ్వును పెదాలకు పులుముకొని, "తెలిసిన వాళ్లమ్మాయి ఫోటో. ఇప్పుడు లేదు. ఎక్కడికో దూరంగా వెళ్లారు. ఆ అమ్మాయి అంటే నాకు చాలా ఇష్టం. పూజా మందిరంలో అయితే రోజూ ఓసారి చూసుకోవచ్చని దేవీపాదాల దగ్గర పెట్టుకున్నాను. రండి హాల్లోకి వెళదాం" అంటూ నడిచింది పారిజాతం. వెనకే వచ్చిన సీతారామయ్య మళ్లీ కూర్చోకుండా 'వస్తాను' అంటూ సీరియస్‌గా వెళ్లిపోయాడు. ఒక్కక్షణం అతను వెళ్లిన వైపే చూసింది పారిజాతం. ఆమె మనసు పరి



పరి విధాల పోయింది.

ఆ ఫొటోను చూడగానే సీతారామయ్యలో వచ్చిన మార్పుకి పారిజాతం కలవరపడింది. తలుపులు వేసుకుని తన పడక గదిలోకి వెళ్లిపోయి దిండు కింద ఉన్న ఉత్తరం తీసుకుని వణుకుతున్న చేతులతో విప్పింది. ఆ ఉత్తరంలో ఎక్కువ వాక్యాలు లేవు. క్లుప్తంగా ఉంది ఉత్తరం...

శ్రీమతి పారిజాతం! ఇరవైయేళ్ల క్రితం మీరు అప్పచెప్పిన బాధ్యతకు ప్రతిరూపం ఈ ఫొటో. ప్రస్తుతం ఇలా వుంది. రాష్ట్ర స్థాయి సాంస్కృతిక కార్యక్రమంలో మొదటి బహుమతి గెలుచుకుంది. నామీద ఉంచిన నమ్మకానికి ఈ ఫొటో చూస్తే వమ్ముకాలేదని నమ్ముతారు. మీ నీడ కూడా పడకూడదని మీ బిడ్డను నాకు అప్పగించారు. కనుక ఆమె పేరు చెప్పటం లేదు.

ఇట్లు

ఇరవైయేళ్ల నాటి పరిచయస్తులు

భీమశంకరం
అడ్వకేట్

ఉత్తరం చదువుకుంది. పారిజాతం మనసు పరిపరి విధాల పోయింది. సీతారామయ్యగారి కొడుకే వేణు. వేణు పక్కన ఉన్న ఆ అమ్మాయే నా బిడ్డ. ఇరవైయేళ్ల క్రితం నాటి చరిత్ర చెరిగిపోయిన చరిత్ర కాదు. జనం మరచిపోని మరుగున పడిన చరిత్ర కాదు. ఇంకా ఆనాటి వాళ్లు కొందరు మిగిలే ఉంటారు. నేను మారి కొత్త బతుకు బతుకుతున్నా నా గతాన్ని వారెందుకు మరచిపోతారు. అటువంటి వారి ద్వారా సీతారామయ్య నా గురించి, నా గతాన్ని గురించి తెలుసుకుంటే ఇప్పుడు నా బిడ్డ పరిస్థితి ఏమిటి? నేనే మళ్లీ నా బిడ్డపాలిట శాపమవుతానా? ఇంత కష్టపడి నా బిడ్డని ఇంతదాన్ని చేసి బంగారు భవిష్యత్తు దానికి ఏర్పాటుచేసిన మహానుభావుడి శ్రమంతా వృథా అవుతుందా? ఆయన ఆ ఫొటోని నాకెందుకు పంపించాలి? పంపించినా గుండెల్లో దాచుకోక దేవీ పీఠంలో నేనెందుకు పెట్టుకోవాలి? రోజూ చూడాలనే కోరిక నాకెందుకు కలగాలి? నా నీడే పడకూడదని నాకు దూరం చేసుకున్న బిడ్డని మళ్లీ ఫొటోని ఇంటికి తెచ్చుకొని ఎందుకు నా నీడ పడేలా చేసాను. ఏం జరగబోతోంది? నా బతుకు ఏమయిపోయినా నా బిడ్డ బతుకు కొత్తదారిలో సజావుగా సాగాలి. దానికి ఆ దేవి ఆశీస్సులే శ్రీరామ రక్ష కావాలి. ఆ మహానుభావుడి మనసే నా బిడ్డకు ఓ కవచం కావాలి అనుకుంటూ కన్నీరు కారుస్తూ కళ్లు మూసుకుని అలా ఉండిపోయింది.

సీతారామయ్య చుట్టుపక్కల ఏ గ్రామానికి వెళ్లినా రాజమండ్రి కాకినాడ అలాంటి పట్టణాలకు వెళ్లినా ఎంత రాత్రయినా ఇంటికి వచ్చేస్తాడు. అది అతని అలవాటు. అలాంటిది కాకినాడ వెళ్లి మధ్యాహ్నానికి తిరిగి రావాల్సిన సీతారామయ్య ఆరోజు రాత్రి రాలేదు. కాకినాడలోనే ఆగిపోయాడు.

మరునాడు ఉదయం తొమ్మిది గంటలకు ఇల్లు చేరుకున్నాడు సీతారామయ్య. ఎప్పుడు బయటి నుంచి వచ్చినా చంద్రయ్యా అనో, రావులమ్మా అనో పిలుస్తూ రావటం అతని అలవాటు. ఆ పిలుపు వినగానే చంద్రయ్య కాని, రాములమ్మ కాని ఎవరో ఒకరు పరుగెత్తుకొస్తారు. వాళ్లిద్దరూ లేకపోతే సీతాదేవే ఎదురు మండువాలోకి వస్తుంది. ఎవరొస్తే వాళ్లు మండువా పక్కనే ఉన్న ఇత్తడి గంగాళంలోంచి ఓ చెంబుడు నీళ్లు సీతారామయ్య చేతికి అందివ్వటం అలవాటు. అక్కడ కాళ్లు కడుక్కుని, నీళ్లు ముంచి ఇచ్చిన మనిషే అందించిన టవల్‌తో కాళ్లు తుడుచుకోవటం సీతారామయ్య అలవాటు. అలాంటిది ఎవరినీ పిలవకుండా గంగాళంలో నీళ్లు ముంచుకుని కాళ్లు కడుక్కున్నాడు. తన పైపంచతోటే కాళ్లు వత్తుకున్నాడు.

ఆ చప్పుడు విని రాయుడు తన గదిలోంచి బయటికి వచ్చాడు. సీతారామయ్య మౌనంగా వున్నాడు. తండ్రిని చూసి కూడా పలకరించలేదు. "కాకినాడ నుంచి ఇదేనా రావటం నాన్నా?" అన్నాడు రాయుడు.

"ఊc" అన్నాడు సీతారామయ్య.

"ఏదైనా పని పడి ఆగిపోయావా?" అన్నాడు రాయుడు.

"ఔను" అన్నాడు సీతారామయ్య.

"ఢిల్లీనుంచి భీమశంకరంగారు ఫోన్ చేశారు. వచ్చే నెలలో రెండు ముహూర్తాలు చెప్పారు. మనకు నచ్చింది నిర్ణయించి ఫోన్ చెయ్యమన్నారు"

"దేనికి ముహూర్తాలు?" అన్నాడు సీతా

రామయ్య ముక్తసరిగా. రాయుడు కొడుకు వైపు తీక్షణంగా చూశాడు. సీతారామయ్య తలవంచుకునే వున్నాడు.

"నీ కొడుకు పెళ్ళి ముహూర్తాలు" అన్నాడు రాయుడు.

"ఎవరితో?" అన్నాడు తండ్రి ముఖంలోకి చూస్తూ సీతారామయ్య.

"నీ కొడుక్కి పెళ్ళి అని తాంబూలాలు పుచ్చుకొన్నాం. నిశ్చితార్థం కూడా జరిగింది కదా!" అని కొంచెం తీక్షణంగా రాయుడు.

"ఈ పెళ్ళి జరగదు నాన్నా, జరగటానికి వీల్లేదు" అన్నాడు సీతారామయ్య.

ఆ రెండు మాటలు ఆ రెండు మండువా లోగిట్లో మారుమోగాయి.

లోపలి గదిలోంచి వరలక్ష్మి, మరోవైపు నుంచి సీతాదేవి, పని వదిలేసి పరిగెత్తు కుంటూ రాములమ్మ, సీతారామయ్య, రాయుడు నిలబడిన మండువాలోకి వచ్చి నిలబడ్డారు.

"ఎందుకని?" అడిగాడు రాయుడు.

"శ్రావణికి ఈ ఇంటి కోడలయ్యే అర్హత లేదు. అందుకే ఈ పెళ్ళి జరగటానికి వీల్లేదు" అన్నాడు సీతారామయ్య.

వరలక్ష్మి, సీతాదేవి ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు.

రాయుడు ఒక నిమిషం మౌనంగా వుండిపోయాడు.

"ఇప్పుడు కాదంటే మాట తప్పిన వాళ్ళ మవుతాం" అన్నాడు రాయుడు సీతారామ య్యను సూటిగా చూస్తూ.

"అవునని చేసుకుంటే తరతరాల వంశ గౌరవం మంట కలుస్తుంది" నొక్కి చెప్పాడు సీతారామయ్య.

"కారణం చెప్పవే" అనునయంగా అన్నా డు రాయుడు.

"నిన్న అన్ని విషయాలు కనుక్కునే వచ్చాను. అందుకే రాత్రికి రాలేదు. ఇంక ఈ పెళ్ళి సంగతి మరచిపోండి" అంటూ కదిలాడు- సీతారామయ్య.

## కొత్తగాలి...

**ఇంటింటా ఓ శకుని**
**సందుసందుకో దుశ్శాసనుడు**
**పంచుకునే వాళ్ళే ఉంటే**
**ద్రౌపదులకేం లోటు**

*- ఎం.ఉదయశ్రీ, హైదరాబాద్*

ఇంతలో హాల్లో ఫోన్ మోగింది.

ఫోన్ తీసుకున్నాడు. అవతలవైపు ఢిల్లీ నుంచి భీమశంకరం "ముహూర్తాలు చెప్పాను" అని ఇంకా ఏదో చెప్పబోతు న్నాడు.

భీమశంకరం మాటకు అడ్డుపడ్డాడు సీతారామయ్య.

"మీరు స్వయంగా రండి. వచ్చాక మాట్లాడుకుందాం!" అని మాట్లాడటానికి తావివ్వకుండా ఫోన్ పెట్టేశాడు. సీరియ స్గా తన గదిలోకి వెళ్ళిపోయాడు సీతారా మయ్య. వెనకే సీతాదేవి వెళ్ళింది.

రాయుడు మండువాలో ఓ కుర్చీలో కూర్చుండిపోయాడు. పక్కనే వరలక్ష్మి కూర్చుంది. "మన అమ్మాయి వర్ధనమ్మ కాని వచ్చి మనవాడ్ని బతిమాలుకుంది అంటారా?" అంది అనుమానంగా వర లక్ష్మి.

"అది కాదు... ఏదో పెద్ద కారణమే వుంది!" అన్నాడు రాయుడు.

ఫోన్ చేసిన భీమశంకరం తనకు కాబోయే వియ్యంకుడి ముక్తసరి సమాధా నానికి ఫోన్ కట్ చేయడానికి కారణాలు ఆలోచించసాగాడు. ఫోన్ కట్ అయి వుంటుందని సరిపెట్టుకున్నాడు. మళ్ళీ తనే ఓసారి ఫోన్ చేసి పెద్దాయన రాయుడితో మాట్లాడితే అన్ని విషయాలు తెలుస్తాయి కదా అని సరిపెట్టుకున్నాడు. ముందు

రాత్రికి మాట్లాడదామనుకుని అప్పటిదాకా ఊరుకోవడం ఇష్టంలేక తిరిగి మళ్ళీ ఫోన్ చేశాడు భీమశంకరం.

ఈసారి హాల్లోనే కూర్చున్న రాయుడు ఫోనెత్తాడు.

అవతలినుంచి భీమశంకరం "మధ్యలో ఫోన్ కట్ అయినట్లుంది. ముహూర్తాల గురించి మనం ఓ నిర్ణయానికి వస్తే తక్కిన ఏర్పాట్లు చేసుకోవచ్చు కదా బాబు గారూ" అన్నాడు

"అబ్బాయి చెప్పినట్టు వచ్చే శని, ఆదివారాలలో మీరు ఓసారి స్వయంగా వస్తే అన్ని విషయాలు మాట్లాడుకోవచ్చు" అన్నాడు రాయుడు పెద్దమనిషి తరహాలో.

యోగక్షేమాలు అడిగి భీమశంకరం ఫోన్ పెట్టేశాడు.

రాయుడు ఆలోచనలో పడ్డాడు విషయం అంతుపట్టక.

★ ★ ★

డాన్స్ ప్రాక్టీసు ఉండటంతో శ్రావణి ఆనాటి సాయంకాలం వేణూని కలవలేదు. శ్రావణి కూర్చుని చదువుకుంటోంది. ఒక సారి వేణుకి ఫోన్‌చేస్తే బాగుండునను కుంది. వేణు కూడా చదువుకుంటూ వుంటే డిస్టర్బ్ చేసానని చిరాకుపడతాడేమోనని ఫోన్ చెయ్యవద్దనుకుంది. కళ్ళు పేజీలో అక్షరాలు చూస్తున్నా మనసు వేణూ వెంటే పరిగెడుతున్నదన్న సత్యం గ్రహించింది శ్రావణి.

ఇంతలో ఫోన్ మోగింది.

ఫోన్ వేణూ నుంచే అయ్యుంటుందని రూంమేట్‌కు డిస్టర్బెన్స్ కాకుండా సెల్ తీసుకుని బయటికి వచ్చింది. ఫోన్ ఆన్‌చేసి 'హలో' అంది. తండ్రి భీమశంకరం వాయిస్-

"ఏమమ్మా ఏం చేస్తున్నావు? " అన్నాడు.

"చదువుకుంటున్నాను డాడీ" అంది శ్రావణి.

"నైస్. వచ్చే శనివారం నేను మీ అత్తారింటికి వస్తున్నానమ్మ"

"డైరెక్టుగా అత్తారింటికా. మా అత్తగారి స్టేట్‌కా" డాడీ.

"యు నాటీ గాళ్. డైరెక్టుగా మీ అత్తారింటికే"

"నేను వైజాగ్‌లో వుంటే నువ్వు అక్కడికి ఎందుకు డాడీ? "

"వచ్చే నెలలో నీ పెళ్ళి ఫిక్స్ చేద్దామని"

"లా పూర్తి కాకుండానా? " అంది కంగారుగా.

"లా పూర్తి కాకుండా పెళ్ళి చేసుకోకూడదని ఏ 'లా'లో ఉందమ్మా? మా కాలంలో పైచదువులన్నీ పెళ్ళిళ్ళయ్యాకే, పిల్లలు పుట్టాకే జరిగేవి"

"అదికాదు డాడీ 'లా' పూర్తయ్యాక అయితే బెటర్ కదా? "

"అప్పుడైతే బెటర్, ఇప్పుడైతే బెస్ట్. నువ్వు ఎంత సిన్సియర్ స్టూడెంట్‌వో నాకు తెలుసమ్మా. వేణు కూడా ఎంత ఇండస్ట్రియస్, ఎంత రెస్పాన్‌సిబుల్ పర్సనో నాకు తెల్సమ్మా. పెళ్ళికాకుండా విడివిడిగా వుండి ఒకళ్ళ గురించి ఒకళ్ళు ఆలోచించుకుంటూ టైము వేస్ట్ చేసుకోకుండా ఇద్దరూ పెళ్ళి చేసుకొని కలుసుండి, శ్రద్ధగా కలిసి చదువుకోవడం బెటర్ కదా? " అన్నాడు భీమశంకరం నవ్వుతూ.

"ఓ మాట వేణుని కూడా అడిగితే బెటర్ కదా నాన్నా? "

"వేణుని నువ్వు అడగమ్మా... నా తరపున లాయర్‌గా నువ్వు ప్లీడ్ ఆర్డర్స్ తీసుకో" అన్నాడు. తండ్రీ కూతురు అలా స్నేహితుల్లా మాట్లాడుకున్నారు. కాసేపయ్యాక 'గుడ్ నైట్' చెప్పాడు భీమశంకరం. లోపలికొచ్చి పుస్తకం ముందు

కూర్చుంది కాని చదువు సాగలేదు శ్రావణికి. వెళ్ళి తన బెడ్ మీద పడుకుంది. వచ్చే నెల్లో పెళ్లని నాన్న చెప్పిన మాట తనను ఏవేవో ఊహల్లో తేలేలా చేశాయి.

ఫోన్ చేసి వేణుకి చెబితేనో అనుకుంది. మళ్ళీ కాదనుకుంది. మర్నాడు సాయంత్రం బీచ్‌లో కలిసినప్పుడు 'ఓ గుడ్ న్యూస్' చెబుతానని ఊరించి, ఊరించి చెప్పాలని నిర్ణయించుకుంది. రేపు సాయంత్రం వేణుని కలవటం గురించి ఆలోచిస్తూ కలలలోకి జారుకుంది శ్రావణి.

మర్నాడు సాయంత్రం వేణు, శ్రావణి బీచ్‌లో కలుసుకున్నారు.

అప్పుడే చీకటిపడుతోంది.

ఆకాశంలో నక్షత్రాలు మెరుస్తున్నాయి.

ఒకపక్క చూస్తే చీకట్లో నల్లని సముద్రం.

మిణుకుమిణుకుమంటూ దీపాలు.

ఒక్కరే వుంటే భయం వేసేటంత హోరు. మరోపక్క చూస్తే నగరంలోని దీపాలు.. నింగిని ఖాళీచేసి నేలకు వాలిన తారలా వెలుగుతున్న దీపాలు. తన పక్కనే వేణు. ఏడిపించి ఏడిపించి గుడ్ న్యూస్ చెప్పాలనుకున్నా శ్రావణి వేణూ చేతిని తన చేతులోకి తీసుకుని "నీకో గుడ్ న్యూస్ చెప్పనా వేణూ? " అంది.

"గుడ్‌న్యూస్ నోటితో చెబుతావు, చెబితే వింటాను, దానికి చెయ్యి లాక్కోవడమెందుకు" అన్నాడు వేణు

"చేతిలో చెయ్యేసి చెబుదామని" అంది శ్రావణి. మెరుస్తున్న వేణూ కళ్ళలోకి చూసింది.

"చేతిలో చెయ్యేసి చెప్పేవి బాసలు"

"ఆ సంగతే చెబుతోంట. వచ్చే నెలలో ఒక శుభముహూర్తాన నా నెత్తిన నువ్వు, నీ నెత్తిన నేనూ చెయ్యిపెట్టి బాసలు చేసుకోబోతున్నాము"

"నెత్తిన చేతులు పెట్టుకోవడమంటే మోసాలు చెయ్యడం. చేతిలో చెయ్యేసి చెబితేనే బాస" అన్నాడు వేణు.

శ్రావణి నిట్టూర్చి "ఓ మహాకవీ! నీ భాషా పరిజ్ఞానానికి, పాండితీ ప్రకర్షకు నా అభినందనలు. వచ్చే శనివారం మా నాన్న మీ ఇంటికి వెళ్ళి నెక్స్ట్ మంతులో మన పెళ్ళికి ముహూర్తాలు నిర్ణయించబోతున్నాడు. అదే 'గుడ్ న్యూస్' అంది.

"నీ లా కోర్సు పూర్తి కాకుండానే" అన్నాడు వేణు.

"ఒన్ ఇయర్‌లో నా కోర్సు పూర్తవుతుంది. నీ పి. హెచ్‌డి. పూర్తవదు కదా" అంది శ్రావణి.

"నా పి. హెచ్‌డి. పూర్తి అవ్వకపోయినా ఫరవాలేదు. ఇంకో పి. హెచ్‌డి. టేకప్ చేసి రెండు పి. హెచ్‌డి.లు ఒకేసారి సావకాశంగా చేసుకోవచ్చు" అన్నాడు వేణు.

"రెండో పి. హెచ్‌డి. ఏమిటి!" అంది శ్రావణి ఆశ్చర్యంగా.

"అదేనోయ్ ఒక పి. హెచ్‌డి. టెంపుల్స్ మీద. ఇంకో పి. హెచ్‌డి. ఈ దేవీ మీద" అంటూ తన తలతో, శ్రావణి తలను ఢీకొట్టాడు.

"అయితే అబ్బాయిగారు పెళ్ళికి రెడీయేనన్నమాట"

"అక్కడికి నువ్వు కానట్టు" అంటూ చెయ్యి పట్టుకొని శ్రావణిని లేపి రోడ్డు మీదకు నడిపించాడు.

## కొత్తగాలి...

**పెద్ద చేపలు**
**చిన్న చేపల్ని మింగేస్తాయి,**
**ఔనౌను!**
**బిగ్ బజార్లు**
**చిల్లర వర్తకుల్ని మింగేస్తున్నట్లు**

– చలపాక ప్రకాష్, విజయవాడ

వారిద్దరూ చెరోవైపు వెళ్ళాలి.

ఒక క్షణం ఆగి 'హలో' అని శ్రావణిని చూశాడు.

"ఏమిటి? " అంది శ్రావణి

"ఆ వచ్చే నెలలో ఆ శుభముహూర్తం తరువాత నువ్వు అటూ, నేనిటూ వెళ్ళక్కరలేదు. ఇద్దరం చెట్టాపట్టాలేసుకుని ఒకేవైపుకు వెళ్లచ్చు" అన్నాడు వేణూ.

"విష్ యూ స్వీట్ డ్రీమ్స్" అంటూ నవ్వుతూ వెళ్లిపోయింది శ్రావణి.

★ ★ ★

రాయుడు ఇంటి పనిమనిషి రాములమ్మ అనుకోకుండా వర్ధనమ్మను కలిసింది. పెద్దింటి రహస్యాలైనా, సంగతులైనా పనివాళ్ళ మూలంగానే బయటికి తెలిసేది.

పుట్టింటి మీద మమకారంతో, కన్పించిన రాములమ్మను "అమ్మా వాళ్ళింట్లో అందరూ బాగున్నారా? " అని అడిగింది వర్ధనమ్మ.

"అంతా బాగానే ఉన్నారు కానీ అమ్మా..." అని ఏదో రహస్యం ఉన్నట్టు చుట్టుపక్కల చూసుకుంది రాములమ్మ. వర్ధనమ్మకు కుతూహలం పెరిగింది, రాములమ్మ ఏం చెప్పబోతోందోనని.

కాస్త పక్కకు తీసుకెళ్ళి "ఏమిటే సంగతి కానీ అని ఆగిపోయావు" అంది వర్ధనమ్మ.

"మీ అన్నయ్యగారు ఆ ఢిల్లీ సంబంధం ససేమిరా వద్దని పట్టుపట్టుకు కూర్చున్నారమ్మా"

"ఎందుకని? "

"ఎవరికీ తెలీదమ్మా. ఆ శ్రావణమ్మ ఈ ఇంటికోడలు కావటానికి తగదు అని ఖచ్చితంగా చెప్పేశారు. బాబుగారు కూడా ఏమీ మాట్లాడలేదమ్మా"

వర్ధనమ్మ ఆలోచనలో పడింది. "సరే అక్కడ జరుగుతున్న సంగతులు అప్పుడప్పుడు వచ్చి చెబుతూ వుండవే. నేనీమధ్య అక్కడికి రావడంలేదు కదా, అందుకని" నచ్చచెబుతున్నట్లుగా అంది వర్ధనమ్మ.

రాములమ్మ తలూపి వెళ్ళిపోయింది.

వర్ధనమ్మ ఇంటికి చేరింది.

భర్తకు ఈ విషయం చెబుదామనుకుంది.

తన అన్నగారు ఈ సంబంధం వద్దంటున్న మాట ఎంతవరకూ నిజమో, కారణం ఏంటో తెలిశాకే భర్తకి చెప్పడం మంచిది అనుకుంది. ఒకవేళ చెప్పినా తొందరపడి మళ్ళీ ఆ గడప తొక్కి మాట్లాడే మనస్తత్వం తన భర్తది కాదని తెలుసు వర్ధనమ్మకి. అందుకే ఊరుకుంది. పోనీ ఓసారి దుర్గను పంపితేనో అనుకుంది. మళ్ళీ ఈ రొంపిలోకి ఆ చిన్నపిల్లను లాగడమెందుకని మాట్లాడకుండా ఊరుకుంది. అన్నీ కాలమే పరిష్కరిస్తుంది అని మనసుకు నచ్చచెప్పుకుంది.

శనివారం ఉదయం పది గంటలకు భీమశంకరం కారు రాయుడు లోగిలి ముందాగింది. చాలా హుషారుగా ముందు మండువాలో అడుగుపెట్టి 'బావగారు' అని పిలిచాడు భీమశంకరం. ఆ పిలుపు నిశ్శబ్దంగా ఉన్న ఆ ఇంట్లో ప్రతిధ్వనించింది.

రాయుడు తన గదిలోంచి బయటికి వచ్చాడు. సీతారామయ్య కూడా తన గదిలోంచి బయటికి వచ్చాడు. "రండి కూర్చోండి" అన్నాడు రాయుడు, కుర్చీ చూపిస్తూ. "మీ రాక కోసమే ఎదురు చూస్తున్నాం" అన్నాడు సీతారామయ్య. ఆ మాటల్లో పెడసరం ధ్వనిస్తున్నా భీమశంకరం పట్టించుకోలేదు. "వస్తానన్నాక రాకుండా ఎలా వుంటాను బావగారూ? "

"మంచినీళ్ళు, కాఫీ తీసుకురామ్మా" అన్నాడు రాయుడు కోడల్ని ఉద్దేశించి.

"వద్దు బాబుగారు, గంట క్రితమే రాజమండ్రిలో కాఫీ, టిఫిన్లు అయ్యాయి. ఇక్కడ

పని పూర్తి చేసుకొని సాయంకాలానికి కాకినాడ వెళ్ళి రాత్రికి వైజాగ్ చేరుకోవాలి" అన్నాడు భీమశంకరం.

"కాకినాడలో ఎవరైనా బంధువులు ఉన్నారా? " అన్నాడు సీతారామయ్య వెటకారంగా.

"నేను ఇంటర్మీడియట్ అక్కడే చదువుకున్నాను. నా మిత్రుడు శేషగిరిరావు ఉన్నాడుగా" అన్నాడు భీమశంకరం.

"అవును ఆయనా లాయరే కదూ" అన్నాడు సీతారామయ్య. అతడి మాట ధోరణిలో ఏదో తేడా ఉందనిపించింది భీమశంకరానికి.

"మొట్టమొదట మీ యింటికి ఇద్దరం కలిసి వచ్చాం కదా" అన్నాడు తమాయించుకొని భీమశంకరం. సీతారామయ్య గుండెల నిండా గాలి పీల్చుకొని ఒక స్థిర నిశ్చయానికి వచ్చిన వాడిలా అతడి వైపు చూస్తూ "భీమశంకరంగారూ శ్రావణి మీ కూతురేనా? " చాలా స్పష్టంగా ప్రశ్నించాడు సీతారామయ్య.

"అవును"

"మీ కన్న కూతురేనా? "

"ఏమిటి మీ ప్రశ్న? మగవాళ్ళు ఎక్కడైనా కంటారా? " అన్నాడు నవ్వుతూ.

"మీరు లాయరా..? "

"అనుమానం ఎందుకొచ్చింది? " అన్నాడు భీమశంకరం.

"మీరు లాయరా? లయ్యరా? " అరచినట్టు అన్నాడు సీతారామయ్య.

"ఏ విషయంలో నన్ను లయ్యరు అంటున్నారు? "

"శ్రావణి మీ కూతురు కాదు. అంటే మీరు కట్టుకున్న భార్యకు పుట్టిన పిల్ల కాదు. అసలు మీకు పెళ్ళే కాలేదు. పెళ్ళి కానపుడు మీకు కూతురు ఎక్కడ్నించి వస్తుంది? శ్రావణి మీ కన్నకూతురు ఎలా అవుతుంది? " అన్నాడు సీతారామయ్య.

రాయుడు కూడా ఈ విషయాన్ని మొదటిసారి వింటున్నాడు.

'ఓ అదా విషయం' అన్నాడు భీమశంకరం.

ఇంతకాలం సీతారామయ్య పారిజాతం గురించి కాకినాడలో ఒకరోజు ఆగి తెలుసుకున్న విషయాలను మనసులోనే దాచుకున్నాడు తప్ప బయటికి చెప్పలేదు. తండ్రికీ చెప్పలేదు. తన భార్యకీ చెప్పలేదు. మొదటిసారి తాను పారిజాతం ఇంటికి వెళ్ళినప్పుడు ఓ అరవైయేళ్ళ ముసలమ్మ తలుపు తీసింది. ఆ ముసలమ్మ ద్వారా తెలుసుకున్న విషయాలు మనసులోనే దాచుకున్నాడు.

పారిజాతం ఓ వేశ్య కూతురని, పారిజాతం తల్లిని ఉంచుకున్న పెద్దమనిషి మంచివాడని, అతను ఆమెను కాలేజీలో చేర్పించి కొంతవరకూ చదివించాడని, ఆ తర్వాత చనిపోయాడని తెలుసుకున్నాడు. ఆ తర్వాత పారిజాతం తల్లి కూడా పోవడంతో మధ్యలో చదువు మానేసింది. ఉద్యోగ ప్రయత్నం చేసింది. ఏ ఉద్యోగానికి వెళ్ళినా తన గతాన్ని ఎరిగినవారు ఆ పాత రొచ్చులోనే ఆమెను స్థిరపరచడానికి ప్రయత్నించారు. కొత్త బతుకు ఇవ్వడానికి ఎవరూ ముందుకు రాలేదు. అప్పుడు తల్లి వృత్తిలోనే పారిజాతం కూడా స్థిరపడి రెండేళ్ళు గడిపిందని, అప్పుడో బిడ్డ పుట్టిందని తెలిసింది. మొదట్నించీ చక్కగా

**కొత్తగాలి...**

**ఆమెకి మనసిచ్చావు.. సరే**
**కనీ పెంచిన**
**అమ్మనాన్నలకేం ఇస్తావు?**

– ప్రతాప వెంకట సుబ్బారాయుడు,
సికింద్రాబాద్

పాడేది. సంగీతం మీద అభిరుచి ఎక్కువగా ఉండేది. పారిజాతానికి పుట్టిన బిడ్డ ఒక ఏడాది దాటాక ఇంట్లో కనపడలేదు. పారిజాతం కూడా పాత వృత్తికి స్వస్తి చెప్పి పూర్తిగా సంగీతం మీదే మనసు కేంద్రీకరించిందని, భక్తి సంగీత కచేరీల ద్వారా ఆనాటి నుంచీ పొట్ట పోసుకుంటోందని ఆ ముసలమ్మ ద్వారా తెలుసుకున్నాడు. ఆ బిడ్డ శ్రావణి అనుకుంటున్నాడు సీతారామయ్య. అందుకే కిరీటంతో ఉన్న శ్రావణి ఫొటోని దేవీ పీఠంలో పెట్టుకొని చూసుకుంటోందని విశ్వాసం. ఇంత కథ గుండెల్లో రగులుతున్నందు వల్ల భీమశంకరం సమక్షంలోనే ఆ నిజాన్ని తెలుసుకోవాలని సిద్ధమైవున్నాడు సీతారామయ్య. ఒక వేశ్య బిడ్డని తన ఇంటి కోడలుగా స్వీకరించడానికి తాను సిద్ధంగా లేనని నిర్ణయించుకున్నాడు. తను కూర్చున్నచోటే లేచి నిలుచున్నాడు భీమశంకరం. రాయుడు భీమశంకరాన్ని చూస్తూ

“మీరు కూర్చోండి. కూర్చునే మాట్లాడకుందాం. నువ్వూ కూర్చో నాన్నా” అన్నాడు సీతారామయ్యను ఉద్దేశించి.

అందరూ కూర్చున్నారు.

ఒక్క నిమిషం అంతా నిశ్శబ్దం.

భీమశంకరం లేచి నిలబడ్డాడు. “వేణుగోపాలరాయుడు గారూ... ఇక్కడ మీరే న్యాయమూర్తి. మీ అబ్బాయి నా మీద ఒక అభియోగం లేవనెత్తారు. నేను ముద్దాయిని. ముద్దాయికి కూర్చుని సమాధానం చెప్పే అర్హతలేదు. ముద్దాయి నిలబడి సమాధానం చెప్పాలి. నేను నిలబడిన ఈ చోటే బోను. ఈ బోనులో నిలబడి సీతారామయ్యగారు నా మీద చేసిన అభియోగానికి దేముడి మీద ప్రమాణం చేసి అంతా నిజమే చెబుతాను!” అన్నాడు. ఆ మండువాలోగిలి కోర్టు హాలుగా రూపుదిద్దుకుంది. ఆ ఇంట్లోని ఆడవాళ్ళు, పనివాళ్లు బిత్తరపోయి చూస్తున్నారు.

రాయుడు గంభీరంగా న్యాయమూర్తిలాగే కూర్చున్నాడు.

“శ్రావణి నా కూతురని చెప్పాను కనుక నన్ను 'లయ్యర్' అన్నాడు ఆయన. నేను లాయర్‌నో, లయ్యర్‌నో నా వాంగూల్మం విన్న తరువాత పెద్దలు మీరే నిర్ణయించాలి” అని మొదలు పెట్టాడు భీమశంకరం. ఇరవై రెండేళ్ళ గతానికి వెళ్ళి చెప్పడం ప్రారంభించాడాయన...

★ ★ ★

వేసవికాలంలో కోర్టుకు సెలవులు. సుప్రీంకోర్టుకు సెలవులు ఇచ్చాక తను ఇంటర్మీడియేట్ చదువుకున్న కాకినాడ పి. ఆర్. కాలేజ్ వాతావరణం ఒక్కసారి

## కుర్చీలు లేవు

కరుణశ్రీ ఒక పద్యంలో- సృష్టి కార్యక్రమాలు చేసిచేసి అలసిపోయావేమో స్వామీ నా గుడిసెలోకి వచ్చి కాసేపు విశ్రాంతి తీసుకో అంటూ దేవుడ్ని అర్థిస్తాడు. అదే పరంపరలో-కూర్చుండ మా ఇంట కుర్చీలు లేవు అంటూ తన అంకపీఠం మీదే కూర్చోమని కూడా సూచిస్తాడు.



ఇది ఇలా ఉంటే ఒకరోజున గుంటూరు కళాశాల విద్యార్థినులు కొందరు కరుణశ్రీని చూడడానికి వచ్చారు. వారిలో ఓ గడుగ్గాయి 'సార్.. కుర్చీలు లేవని పద్యాలు రాస్తారు. మీ ఇంట్లో ఇన్ని కుర్చీలున్నాయి కదండీ' అని చమత్కరించింది. కరుణశ్రీ 'అంత పెద్ద మహా దేవుడికి సరిపోయే కుర్చీలు లేవన్నాను కానీ మీలాంటి పిల్లకాయలక్కాదమ్మా' అంటూ తడుముకోకుండా చెప్పారు.

చూడాలనిపించింది. ఆ తర్వాత అక్కడ నించే ద్రాక్షారామం వెళ్ళి భీమేశ్వరస్వామి దర్శనం చేసుకుని తిరిగి ఢిల్లీ వెళ్ళిపోదామ నుకుని కాకినాడ వచ్చాను. నా పేరు కూడా భీమశంకరం కావడంతో ద్రాక్షారామ భీమేశ్వరస్వామి దర్శనం నాకేదో ఉపశ మనం కల్గిస్తుంది. అక్కడికి వెళితే నేను ఏదో అనుభూతిని పొందుతాను. నా మీద మొదటి అభియోగం నాకు పెళ్ళి కాలేదని. పెళ్ళికానప్పుడు నాకు కూతురు ఎక్కడ్నించి వస్తుందని. నిజమే నాకు పెళ్ళి కాలేదు. నా చిన్నతనంలోనే అమ్మానాన్నా పోయి మేనమామ ఇంట్లో వుండి చదువుకు న్నాను. నా చిన్నతనంలో వరదలు వచ్చి మా అమ్మనాన్నా కొట్టుకుపోయారు. మా పినతల్లి ఇంటికి వెళ్ళిన నేను, మా చెల్లి మిగిలాం. మా మేనమామ సంపన్నుడే. నన్ను బి.ఎ.దాకా చదివించారు.

నా చెల్లెలికి రెండో పెళ్ళి సంబంధం చూసి పెళ్ళి జరిపించి తన బాధ్యత తీర్చు కున్నాడు. తనకో కూతురు వున్నా నాకిచ్చి పెళ్ళి చెయ్యాలన్న ఆలోచన ఆయనకు ఏనాడూ కలగలేదు. కారణం నాకు ఊహ తెలిసినప్పటి నుంచి నేను అవిటివాణ్ణి. నాకు మోకాలు కింద నుంచి కాలు చచ్చు బడిపోయింది" అంటూ పాంటు పైకిలాగి తన కృత్రిమకాలు చూపించాడు. ఇది ఎవరి సింపతీకోసమో కాదు. ఒక నిజాన్ని నిజం అని చెప్పడం కోసమే. బి.ఎ. అయిన తరువాత నా మేనమామ కూతు రికి వివాహమయ్యింది. నేను మామయ్య ఇంట్లోంచి బయటికి వచ్చి ఓ స్నేహితుడి రూములో ఉండి ట్యూషన్స్ చెప్పుకుంటూ 'లా' పాసయ్యాను. భీమశంకరం పేరు చివర బి.ఎ. బి.యల్ ఓ ఆభరణం అయ్యింది. నాకు ఆత్మవిశ్వాసాన్నిచ్చింది. 'లా' కాలేజ్‌లో ఓ లెక్చరర్ సహాయంతో ఢిల్లీ చేరుకుని, ఓ లాయర్ దగ్గర జూని యర్‌గా చేరి ఆయన మెప్పుపొంది నిలదొ

## కొత్తగాలి...

**అదుగో అమ్మాయీ**
**ఇంకా ఉంది బూజు**
**అమ్మమ్మా ముందు**
**తుడుచుకో నీ కళ్ళజోడు**

-కె.వి.యల్.నరసింహశాస్త్రి, హైదరాబాద్

క్కుకున్నాను. ఆ తర్వాతే ఆపరేషను చేయించుకొని ఈ ఆర్టిఫిషియల్ లెగ్ పెట్టించుకున్నాను. అవిటితనాన్ని మరుగు పరిచా. అప్పటికి నా వయసు నలభై ఆ రేళ్ళు. లాయర్లకు పేరు రావటానికి చాలా కాలం పడుతుందిగా.

చాలాకాలం తర్వాత కాకినాడకు వచ్చాను. కాకినాడ వీధులలో తిరుగుతూ కాలేజ్‌ని ఒకసారి చూసుకొని ఎవరైనా తెలిసినవారు కనపడతారేమోనని వెతకసా గాను. సినిమా హాళ్ళ వీధిలోకి వెళ్ళాను. ఆ వీధిరూపులే మారిపోయాయి. నేను కాలేజ్‌లో చదువుకునే రోజుల్లో రిక్షాలుం డేవి. ఇప్పుడు అక్కడక్కడా ఉన్నాయి. ఓ రిక్షాఎక్కి టాప్‌తీసి తిరుగుతూ వుంటే పాత జ్ఞాపకాలు గుర్తుకొచ్చాయి. గణపతి నవరాత్రులకు, దేవీ నవరాత్రులకు ఏడెని మిది మేజువాణీలతో దేముడ్ని వీధమ్మట ఊరేగించేవారు. మేజువాణీలో పదిహేను, ఇరవైమంది ఆడవాళ్ళు ఉండేవాళ్ళు. మద్దెల, ఫిడేలు, డోలక్ వాయించేవాళ్ళు. దేవీ నవరాత్రులకు ప్రత్యేకంగా సరస్వతీ గానసభలో కచేరీలు కూడా జరిగేవి. అవన్నీ గుర్తొచ్చి నేను కూర్చున్న రిక్షా అతన్ని 'ఇప్పుడు అవన్నీ ఉన్నాయా' అని అడిగాను. 'ఇప్పుడు ఆ సంగీత కచేరీలు లేవండీ. రికార్డు డాన్సులు జరుగుతు న్నాయి. ఆ మేజువాణీలు, భోగంమేళాలు

## కొత్తగాలి... 

**చెట్టు**
**పూల తివాచీ పరచింది**
**నామీద నీడ దుప్పటి కప్పింది!**

*-కంచనపల్లి వేంకట కృష్ణారావు,*

*కర్నూలు*

కూడా బ్యాన్ చెయ్యడం మూలంగా ఎక్కడా జరగటం లేదండి. సరదా కావా లంటే గుంపుగా కాకుండా అక్కడక్కడ బాగా పాడేవాళ్ళు, ఆడేవాళ్ళు ఒక్కళ్ళిద్దరు ఉన్నారండి' అన్నాడు. 'ఇంకా ఉన్నారం టావా?' అని నేను రెట్టించాను. 'ఉన్నా రండి, కావాలంటే చూసొద్దాం పదండి' అంటూ రిక్షా తిప్పాడు. రిక్షా తొక్కుతూ ఆ సినిమాహాలు రోడ్డులో మసులుతున్న జనాన్ని చూసి రిక్షాతను నన్నో ప్రశ్నవే శాడు- 'బాబుగారు దేముళ్ళయితే మెళ్ళో పూలదండ వేస్తాము. నాయకులకూ మెళ్ళో వేస్తాము. దేశనాయకుల విగ్రహా లకు మెళ్ళోనే దండ వేస్తాము. చచ్చిపో యిన శవాలకు మెళ్ళోనే దండ వేస్తాం. మరి ఆడోళ్ళ పూలదండ మెళ్ళో వేసుకో కుండా తలలో పెట్టుకుంటారేంటి బాబూ?' అన్నాడు, రోడ్డు పక్కన నడిచే పూలు పెట్టుకున్న ఆడవాళ్లని చూస్తూ. ఎందుకు పెట్టుకుంటారు 'నువ్వే చెప్పు' అన్నాను, అతని పరిశీలనకి ఆశ్చర్యపోయి. 'ఏం లేదండీ, అలా తల్లో పువ్వులు పెట్టు కున్న ఆడమనిషిని మగాడు వెనకనుంచి చూసి బాగుందని, ఎదరింకా ఎంత బాగుంటుందో అని, ముందుకొచ్చి చూస్తా రనండి' అన్నాడు నవ్వుతూ. నాకూ నవ్వొ చ్చింది. 'భలే వాడివయ్యా. ఇలా ఎక్కడికి తీసుకెళ్తున్నావు?' అన్నాను. 'ఎక్కడికే టండి.. ఆ పాటకి, మాటకి పనికొచ్చే మడిసి యింటికి వెళదామనుకున్నాం కదండీ' అన్నాడతను. 'నేనెప్పుడన్నా నయ్యా.. వెనక్కిపోనీ హోటల్ కి' అన్నాను మొహమాటంగా. 'దగ్గరికొ చ్చేశాం.. మనం వెళ్ళగానే తలుపులు తెరు చుకుని కూచుంటారనుకున్నారా? లేదండీ బాబూ.. కిటికీ తలుపులు తెరచివుంటే, లోపల లైటు వెలుగుతూ వుంటేనే తలుపు కొట్టాలండే. లేకపోతే తిరిగి వెళ్ళిపోవడమే' అంటూ ఓ ఇంటి ముందు ఆపు చేశాడు. లోపల్నించి శ్రావ్యమైన సంగీతం విన్పి స్తోంది. అది కృష్ణుడిమీద ఎప్పుడో వచ్చిన గీతం. "యమునా తీరమున... సంధ్యా సమయమున... వేచి యున్నదీ రాధ" అంటూ విన్పిస్తోంది పాట. అతను వెళ్ళి తలుపు తట్టబోతుంటే పాట పూర్తి అయ్యే దాక ఆగమని ఆపుచేసాను. అంత బాగా పాడుతోంది ఆవిడ. ఆ తర్వాత అతను వెళ్ళి తలుపు తట్టాడు. తలుపు తీసింది. అతను, నేను లోపలికెళ్ళాము. గబగబా నా గురించి ఆమెకు పరిచయం చేస్తూ 'ఢిల్లీ నుంచి వచ్చారు ప్లీడర్ గారంట. మీ ఇంటికి వచ్చేసరికి నువ్వు పాడుతున్నావు. పాట అయ్యేదాకా తలుపు కొట్టద్దని ఆపు చేసారు నన్ను. పెద్దమనిషి, మంచి మనిషి జాగర్తగా చూసుకో' అని ఆమెకి చెప్పి, 'మరి నన్ను ప్రొద్దున్నే రమ్మం టారా.. రెండో ఆట సినిమా అయ్యేక వచ్చేమంటారా' అని అడిగాడు. ఇటువంటి అనుభవం లేక నేను కంగారుగా 'త్వర గానే వచ్చేయి' అన్నాను. 'మళ్ళీ నేను ప్రొద్దున్నే ద్రాక్షారామం వెళ్ళి భీమేశ్వరుడికి అభిషేకం చేయించుకోవాలి' అన్నాను. త్వరగానే వచ్చేస్తానని వెళ్ళిపోయాడు.

ఇంక ఆ గదిలో నేనూ ఆమె మిగిలాం. ఆమె కిటికీ తలుపు మూసేసింది. వీధి తలుపు మూసేసింది. ఆ గదిని ఆనుకొని ఇంకో రెండు గదులున్నాయి. ఆ తర్వాత నాకు ఎదురుగా కూర్చుని తన జడ

ముందుకు వేసుకుంది. ఆ జడలో బుట్టెడు మల్లెపూలు ఉన్నాయి. నాకు రిక్షా అతను వేసిన ప్రశ్న గుర్తుకు వచ్చింది. అదే ప్రశ్న ఆవిడను వేశాను. 'నిజంగా తెలీకే అడుగుతున్నాను' అన్నాను. ఆమె నవ్వుకొని 'ఆడవాళ్లు తలలో పూలు పెట్టుకునేది, తమ కోసం కాదు. ఒకరికొకరు అభిముఖంగా కూర్చుని భార్యభర్తలు మాట్లాడుకుంటే బాగానే ఉంటుంది. అలిసిపోయి ఒత్తిగిల్లి పడుకుంటే, వెనక పడుకున్న మగవాడికి స్త్రీ తలలో పూలు సేద తీరుస్తాయి' అంది. ఆమె సమాధానం నాకు నచ్చింది. 'ఫెంటాస్టిక్ రిప్లయ్' అని అభినందించాను. 'దటీజ్ వాట్ ఐ బిలీవ్, అది కరక్టు కాకపోవచ్చు' అంది ఆమె నవ్వుతూ. 'మీరు చదువుకున్నారా' అని అడిగాను. 'బి.ఎ. దాకా' అంది. 'బి.ఎ. చదువుకుని ఈ పని' అన్నాను. ఆమె నవ్వుకొని' ఏమీ అనుకోకపోతే మీరు బి.ఎ. బి.యల్ చదువుకొని ఇలా... ఇక్కడ?' అని ఆగింది. ఇద్దరం నవ్వుకున్నాం. బీరువా తెరచి ఇస్త్రీ పంచె నాకిస్తూ 'ఇది కట్టుకోండి కంఫర్టబుల్‌గా ఉంటుంది' అంది. నేను మొహమాటపడ్డాను. అది గమనించిన ఆమె నవ్వుతూ 'నేను అటు తిరిగి కళ్లు మూసుకుంటాను' అంది. నేను పంచె లుంగీలా కట్టుకున్నాను. నా వైపు తిరిగి నా చేతిలోని పాంటును తీసుకొని చక్కగా ఫోల్డ్‌చేసి హ్యాంగర్‌కి తగిలించింది. ఒక స్త్రీ చేసే సేవలో లాలిత్యం తొలిసారి చవిచూసాను. 'మీ పేరు' అన్నాను. 'పారిజాతం' అంది. నా పేరు భీమశంకరం. అని నేనే చెప్పాను. మా ప్రాంతం దేముడు పేరే అంది. నేను ఈ ప్రాంతం వాడినే... కాకపోతే ఢిల్లీలో స్థిరపడ్డాను. ఒకే ప్రాంతం అనగానే ఆమెలో కూడా నేనంటే ఏదో అభిమానం కన్పించింది.

'ఏం తీసుకుంటారు?' అని అడిగింది.

'నేను మిమ్మల్ని అడుగుదామనుకున్నాను' అన్నాను.

ఆమె పకపకా నవ్వింది. అది కాదండీ బాబూ కాఫీయా, పాలా, కూల్‌డ్రింక్స్ అనా" అంది.

'ఏం వద్దులెండి' అన్నాను.

ఆవిడ కింద ఓ చాపవేసి దుప్పటి పరచింది. ఓ మూలగా ఉన్న పందిరి పట్టి మంచం మీదకు వెళ్లి ఏదో తీయబోతుంటే నిలబడి చూశాను. ఒక రెండేళ్లలోపు పసిపిల్లను మంచం మీంచి లేవనెత్తబోతోంది. "పాపో, బాబో నిద్రపోనివ్వండి. పసిపిల్లలు దేముడితో సమానం అంటారు" అన్నాను. 'మనకి మంచం కావాలిగా?' అంది. 'మనమే కింద కూర్చుందాం ఆ చాప మీద. 'ఇంతకీ పాపా, బాబా?' 'పాపే' అంది నవ్వుతూ. ఉంగరాల జుట్టు అదే ఉంగరాల జుట్టు ముద్దొస్తోంది. 'వేసవికాలం కదా.. గ్రైప్‌వాటర్ పట్టండి. పిల్లలకి మంచిది.'

'మీకు పిల్లలా?' అంది.

'నాకు పెళ్లి కాలేదండి'

'మరి పిల్లల గురించి జాగ్రత్తలు చెబుతున్నారు' అంది నవ్వుతూ.

ఆమె పాట ఎంత తియ్యగా వుందో నవ్వు అంత తియ్యగా ఉంది.

అలా ఇద్దరం కూర్చున్నాం.

ఒక పదినిమిషాలు మాట్లాడుకున్నాం.

తన గతం తను చెప్పింది. బి.ఎ. దాకా చదివి ఇలా ఎందుకు దిగజారిందో చెప్పింది.

ఇంతలో ఎవరో తలుపు తట్టారు.

'నే వెళ్లి మాట్లాడి పంపిస్తాను. ఈ సమయంలో ఎవరూ తలుపు తట్టకూడదే' అంటూ వెళ్లి తలుపు తీసింది.

ఎదురుగా ఓ పోలీస్ ఇన్‌స్పెక్టర్, కానిస్టేబుల్.

ఆమె బిత్తరపోయింది.



'మీరు ఇదివరకెప్పుడూ ఇలా రాలేదు కదా? ' అంది.

'అయితే ఇప్పుడు రాకూడదా. ఇద్దరూ పోలీస్ స్టేషనుకు నడవండి' అన్నాడు ఇన్స్పెక్టర్.

'ఎందుకూ? ' అంది.

మళ్లీ 'ఇద్దరు మగాళ్లు ఒక గదిలో ఉంటే మీకు అభ్యంతరం లేదు. ఇద్దరు ఆడవాళ్లు ఒక గదిలో ఉన్నా మీకు అభ్యంతరం లేదు. ఆడా, మగా ఒకగదిలో ఉంటే మీకు అభ్యంతరమా? నేరమా? మీకెందుకు అభ్యంతరం? నేను గుమ్మంలో నిలబడి వీధిని వెళ్లే వాళ్ళని పిలవటం లేదు. నేను చెయ్యి పట్టుకు లాగటం లేదు. నా సొంత ఇంట్లో నా గదిలో ఇంకో వ్యక్తితోనే ఉన్నాను. వై షుడ్ ఐ కమ్ టు పోలీస్ స్టేషన్? ' అంది ఆవేశంగా.

'అమ్మో నీకు ఇంగ్లీషు కూడా వచ్చన్న మాట. అయితే ప్రమాదమే. పోలీసు స్టేషన్లో ఇద్దువుగాని లెక్చర్లు.. నడు, నడు' అంటూ ఆ ఇన్స్పెక్టర్ నా వైపు తిరిగాడు. అప్పటికే నేను సైలెంట్‌గా ప్యాంట్ వేసుకున్నాను. జేబులోంచి నా విజిటింగ్ కార్డు తీసి ఇన్స్పెక్టర్ చేతికి ఇచ్చాను.

ఇన్స్పెక్టర్ పైకి చదివాడు.

ఎన్. భీమశంకరం,

అడ్వొకేటు,



సుప్రీంకోర్టు,
న్యూఢిల్లీ.

'అయితే ఏంటంట? సుప్రీంకోర్టులో ఎంతోమంది అడ్వకేట్లు ఉంటారు. ముందు పోలీసు స్టేషన్‌కు నడవయ్యా.. అక్కడ మాట్లాడుకుందాం' అన్నాడు వెటకారంగా.

పారిజాతం కలగచేసుకొని 'హి ఈజ్ మై గెస్ట్. ఆయనెందుకు స్టేషన్‌కు? నేనొస్తాను, పదండి' అంది.

ఇన్‌స్పెక్టర్ ఆమెను తీక్షణంగా చూస్తూ 'మా డి.ఎస్.పి. లెవెల్‌లో మాట్లాడుతున్నావు.. ఒక్కటిచ్చానంటే మొఖం పచ్చడవుతుంది' అని చెయ్యెత్తాడు.

అప్పుడు నేను కలగచేసుకున్నాను.

పారిజాతాన్ని జబ్బపట్టుకుని నాదగ్గరకు లాగాను. ఆమె తలలో ఉన్న మల్లెపూలు పీకేశాను. జాకెట్టు వెనక, జబ్బమీద చింపేశాను.

ఇన్‌స్పెక్టర్ కంగారు పడుతూ 'ఏంటయ్యా అది? చదువుకున్న మనిషివి.. లాయర్ని అంటున్నావు. మాముందే ఏంటి న్యూసెన్స్? ' అన్నాడు.

అతని కళ్ళలోకి సూటిగా చూస్తూ 'ఈ న్యూసెన్స్ నేను చెయ్యలేదు. నేను రెండో ఆట సినిమా చూసి వీధివెంబడి వస్తుంటే అరుపులు వినపడ్డాయి ఈ ఇంట్లోంచి. ఏంటి అని నేనొచ్చేసరికి నువ్వూ, నీ కాని

స్టేబుల్ కలసి ఒంటరిగా వుండే ఆడదాన్ని ఇలా హింసిస్తున్నారు. ఆమె నన్నుచూసి హెల్ప్ హెల్ప్ అని అరిచింది. నేను లోపలికొచ్చాను. మీ ఇద్దరూ ఆగిపోయారు. నా మీదే తిరగబడ్డారు' అన్నాను.

ఇన్‌స్పెక్టర్ తెల్లబోయాడు.

'మమ్మల్ని ఇద్దరినీ బయటికి తీసుకెళ్తే రోడ్డు మీద జనానికి నే చెప్పే కథ ఇది. అసలే మన సమాజంలో మీకు మంచి గౌరవం ఉంది కదా? నేను ఈ కథ చెప్పిన తరువాత ఈమె నిజమేనని సాక్ష్యం చెబుతుంది. ఆ తరువాత జనానికి మీరు చెప్పే సమాధానం ఏమిటో ఆలోచించుకోండి. రేపు మమ్మల్ని కోర్టులో నిలబెట్టిన తరువాత ఆ జనమే నాకు సాక్ష్యం. ఈమె సాక్ష్యం.'

ఇన్‌స్పెక్టర్‌కి మాట రాలేదు.

కాసేపటికి తేరుకుని "మీరు పెద్ద లాయరు. మీలాగా చదువుకున్న వాళ్ళు కూడా ప్రాస్టిట్యూషన్‌ని ఎంకరేజ్ చేస్తే ఎలా సార్?" అన్నాడు నిస్పృహతో.

అప్పుడు నేను కూల్‌గా అతనికి చెప్పాను.

'చట్టాన్ని చేతుల్లోకి తీసుకునేందుకు ప్రయత్నం చెయ్యకు, చట్టాన్ని అమలు చేయడానికే ప్రయత్నం చెయ్యి. ఇమ్మోరల్ ట్రాఫిక్ ఆక్టు కింద ఒక స్త్రీపై కేసు పెడితే ఆమెకి శిక్ష విధించడంతో పాటు, ఈ రొంపిలోకి మళ్ళీ రాకుండా బతికే మార్గం చూపించాలి ప్రభుత్వం. అంతేకాని ఒకే వ్యక్తి మీద కేసుల మీద కేసులు పెట్టి జరిమానా వేస్తారు. ఆ జరిమానాలు ప్రభుత్వానికి సోర్స్ ఆఫ్ ఇన్‌కమ్, ఆ లంచాలు మీకు ఒక సోర్స్ ఆఫ్ ఎక్స్‌ట్రా ఇన్‌కమ్ కాకూడదు'.

'సరే సార్, మాతో గొడవెందుకు మీకు. పెద్దవారు' అంటూ ఇన్‌స్పెక్టర్, కానిస్టేబుల్ వెళ్ళిపోయారు.

నేనూ వస్తానని బయలుదేరాను. అయిదొందలు జేబులోంచి తీసి మంచం మీద పెట్టాను.

'ఆ డబ్బు దేనికి, మీకు నావల్ల కల్గిన ఇన్‌కన్వీనియన్స్‌కా? ' అంది ఆమె.

'కాదు మీ పాట విన్నందుకు. మీ సపర్యలు పొందినందుకు మీ నవ్వులను ఎంజాయ్ చేసినందుకు. ముఖ్యంగా నేను ఇక్కడ గడించుకున్న అనుభవానికి' అని కదలబోతుంటే.

'మళ్ళీ ఎప్పుడొస్తారు? ' అంది.

నేను వెనక్కి తిరిగి 'ఇలా అడగడం మీ సంప్రదాయమా? '

ఆమె నవ్వుకొని 'అది నాకు తెలీదు మీరు నా బిడ్డని మంచం నుంచి దించి చాపమీద పడుకోబెట్టబోతుంటే ఆపారు. దాని తల నిమిరి గ్రైప్ వాటర్ పట్టించమ

## మరంద మాధురి

సత్యసాయి నిలయంలో బాబాను ఓ రోజున కొందరు ప్రముఖులు దర్శించుకుని పూలదండలు సమర్పించారు. వారితో ఉన్న కరుణశ్రీ ఉత్తచేతులతోనే వచ్చారు. ఆయనను బాబా నవ్వుతూ చూశారు. ఆ నవ్వులో ఎన్నో భావాలు.



తర్వాత కరుణశ్రీ బయటకు వచ్చాక- 'పుష్పవిలాప కావ్యం రాసిన మీరు పూలను హింసించి దండను ఎలా తెస్తారు లెండి' అన్న భావన బాబా నవ్వులో నాకు కన్పించింది' అన్నారు ఆత్మీయులతో.

న్నారు. దాని తండ్రి ఎవరో ఖచ్చితంగా చెప్పలేను కానీ, మీలో ఒక మంచి మనిషిని కనిపించాడు. నా బిడ్డకో తండ్రిని మీలో చూసాను'

'సాధారణంగా ఇటువంటి చోటుకి పోలీసులు వస్తే మగవాళ్ళు పరువుపోతుందని గోడదూకి పారిపోవడం, మంచం కింద దూరడమో, పోలీసులకు లంచం ఇచ్చి తప్పించుకోవడమో చేస్తారు. అలా కాకుండా నా పక్కన నాకు అండగా నిలబడి వాళ్ళకి సమాధానం చెప్పారు. నన్ను కాపాడారు. దెన్ ఐ సా ఎ మాన్ ఇన్ యూ. నన్ను ముట్టుకోకుండానే నాకు డబ్బులిచ్చి నా పాటకు ఇచ్చారన్నారు. నా పాటకు ఓ విలువ ఉందని తెలియచెప్పారు. అందుకే మళ్ళీ ఎప్పుడు వస్తారని అడిగాను' అంది.

ఆమె మాటలు నన్ను ఆలోచింపచేశాయి.

నేను ఆమె ఎదురుగా నిలబడి 'నేను మళ్ళీ వచ్చినా, మళ్ళీ, మళ్ళీ వచ్చినా ఇక్కడ ఉండేవాణ్ణి కాదు. వచ్చి వెళ్ళేవాడినే. మీకు మీరే రక్షణ కల్పించుకోవాలి. మీలాంటి వాళ్ళకు మీరే రక్షణ ఇవ్వాలి. బి.ఎ. చదివారుగా, బి.యల్. చెయ్యండి. లాయర్ చదివి మీలాంటి వాళ్ళకోసం పోరాడదామనుకుంటే నేను సహాయం చేస్తాను. మీరు లాయర్ చదవటానికి సిద్ధమయితే సహాయం చేసి లాయర్‌ను చేయడానికి సిద్ధంగా ఉన్నాను' అన్నాను విజిటింగ్ కార్డు తీసి ఇస్తూ. కార్డు తీసుకొని 'థ్యాంక్యూ సార్' అంది.

'నేను ఎన్ని మెట్లెక్కినా నా గతం చెరిగిపోదు. నా గతం, నా వ్యవస్థ నా తోనే ముగిసిపోవాలంటే నా బిడ్డమీద నా ఛాయ పడకూడదు. మీకు పెళ్ళి కాలేదన్నారు. కనుక ఈ బిడ్డను తీసుకువెళ్ళి మీ బిడ్డను చేసుకొని పెంచుకోండి. దానికి ఓ కొత్త బ్రతుకును సమాజంలో ఒక గౌరవమైన అడ్రస్సును ప్రసాదించండి. నేను తన తల్లినన్న సంగతి దానికి ఎప్పటికీ చెప్పకండి. మీరే తండ్రిగా నిలబడండి. నన్ను లాయర్‌ను చేసినా నేను పారిజాతాన్నేనండీ ఈ హెల్ప్ చెయ్యండి' అంది. మరో ఆలోచన లేకుండా ఆ బిడ్డనెత్తుకొని నేను బయలుదేరాను. ఆమె నా విజిటింగ్ కార్డుకూడా నా జేబులో పెట్టేసి 'ఈ అడ్రసు కూడా నాకు వద్దు. ఎప్పుడైనా నా బిడ్డని చూడాలని నేను టెంప్ట్ అయితే దాని భవిష్యత్తుకే ప్రమాదం వుంది' అంది. నేను బిడ్డను తీసుకుని వచ్చేస్తుంటే నమస్కరిస్తూ నిలబడింది" అంటూ ముగించాడు భీమశంకరం.

ఎదురుగా కూర్చున్న రాయుడ్ని, సీతారామయ్యనూ మిగిలిన వారినీ చూసి మళ్లీ 'ఆనాటి ఆ పసిపిల్లే వేణు పక్కన నర్తించి రాష్ట్రస్థాయిలో కిరీటాన్ని దక్కించుకున్న శ్రావణి. ఈ భీమశంకరం కూతురు. ఒక న్యాయమూర్తిగా శ్రావణి నా కూతురు అవునో కాదో మీరే తీర్పు చెప్పాలి' అన్నాడు రాయుడికి నమస్కరిస్తూ.

క్షణకాలం పాటు కళ్ళు మూసుకుని మౌనం వహించాడు రాయుడు. భీమశంకరం కథ, శ్రావణి వృత్తాంతం అసాంతం విన్నాక రాయుడు ఆలోచనలో పడితే, సీతారామయ్య మాట పట్టింపు కోసం ఆవేశానికి గురయ్యాడు-

'ఎక్కడినించో తెచ్చి చిన్నప్పటి నుంచీ పెంచినంత మాత్రం చేత మీరక్తం పంచుకు పుట్టని బిడ్డ మీ బిడ్డ ఎలా అవుతుంది? తెలియని వారందరూ శ్రావణికి మీరు తండ్రి అన్నంత మాత్రాన శ్రావణి తండ్రి అవుతారా? ' అన్నాడు.

అప్పుడు నోరు విప్పాడు రాయుడు.

"మన జీవన గమనాన్ని నిర్దేశించేవి, మన ధర్మాన్ని సంస్కృతిని సంరక్షించేవి

మన ఇతిహాసాలు, పురాణాలే నాన్నా. భారతంలో నీ ప్రశ్నకు సమాధానంగా ఒక సంఘటన ఉంది. పాండురాజు మరణించిన తరువాత పంచ పాండవులు ఐదుగురూ గంగానదీ తీరాన స్వర్గస్థుడైన తన తండ్రికి పిండ ప్రదానం చేస్తున్నారు. అప్పుడు, శ్రేయోభిలాషి అయిన శ్రీకృష్ణ పరమాత్ముడు కూడా వారి వెంట ఉన్నాడు. ఒక వ్యక్తి శ్రీకృష్ణుని ఉద్దేశించి, 'ఈ పంచ పాండవులు పాండురాజుకు పుట్టినవారు కాదు. వీరు జరుపుతున్న ఈ పిండ ప్రదానం పాండురాజుకు దక్కుతుందా పరమాత్మా?' అని సందేహాన్ని వెలిబుచ్చాడు. అప్పుడు శ్రీకృష్ణుడు అతనికి చెప్పిన సమాధానమే నీకూ వర్తిస్తుంది. ఎవరి సంతానంగా సమాజంలో చలామణీ అవుతారో అన్ని కర్మలకు వారే ఆ వ్యక్తి సంతతి అవుతారు. పంచ పాండవులు వదిలే తర్పణం, పిండప్రదానం పాండురాజుకే చెందుతుంది. సంతానం లేనివారు దత్తత తీసుకొని పెంచుకుంటే ఆ దత్తుడు పెట్టిన పిండం దత్తతిస్తే కర్తకే చెందుతుంది. కారణం దత్తుడు ఆ స్వీకర్త బిడ్డగానే చలామణీ అవుతున్నాడు కనుక. అలా శ్రావణి నిర్వివివాదంగా భీమశంకరంగారి కుమార్తె. భీమశంకరం ఆమె తండ్రి. ఓ తల్లి తొమ్మిది నెలలు మోసి ఒక ఏడాది పెంచిన దాని కంటే ఒక వ్యక్తి ఇరవై యేళ్ళు పెంచి పెద్ద చేస్తూ విద్యాబుద్ధులు నేర్పిస్తూ తన ప్రభావమే ఆమె మీద పడేలా ప్రభావితం చేస్తే అలా పెంచిన బిడ్డకు అతను తండ్రికాదు. తల్లి కూడా" అన్నాడు రాయుడు.

సీతారామయ్య ఇంక మాట్లాడలేదు. తండ్రి చెప్పిన సమాధానంతో ఏకీభవించాడో లేదో కానీ మౌనం వహించాడు. రాయుడు భీమశంకరం వైపు తిరిగి తన కుర్చీలోంచి లేచాడు-

'మీరు ఒక సాంఘిక దురాచారానికి ఆ తరంతో తెరదింపటం కోసం ఆమె బిడ్డనే తెచ్చి పెంచారు. అభిమానించారు. ఆదరించారు. ఆ తల్లి నీడనే ఆ పిల్ల మీద పడనివ్వలేదు. చెప్పింది చేసినవాడు సంఘ సంస్కర్త. గతించిన వారి గురించి విన్నాం కాని మిమ్మల్ని కళ్ళముందు చూస్తున్నాం. మీ వయసు నాకు తెలీదు కాని, మీ నిజాయితీకి, మానవీయతకు మనస్ఫూర్తిగా నమస్కరిస్తున్నాను' అంటూ రాయుడు భీమశంకరం దగ్గరకు వెళ్ళి అభినందన పూర్వకంగా హత్తుకున్నాడు.

భీమశంకరం కళ్ళు చెమ్మగిల్లాయి. ఆర్ద్రతతో మాటలు కూడబలుక్కుంటూ "నేను పెంచి పెద్ద చేసినంత మాత్రం చేత ఈ సంస్కరణ పూర్తికాదు. శ్రావణి ఒక ఇంటి ఇల్లాలైనప్పుడే పారిజాతంతో ఆ తరానికి తెరపడినట్టు. శ్రావణితో కొత్త తరానికి మార్గం ఏర్పడినట్టు అవుతుంది" అన్నాను.

రాయుడు చిరునవ్వు నవ్వి "మీ మనసు నాకర్థమైంది. వేణు, శ్రావణి కూడా చదువుకున్నవారు, మేజర్లు. వాళ్ళ బతుకు గురించి నిర్ణయం తీసుకునే అధికారం వాళ్ళకుంది. ఈ వాస్తవాలు వేణు, శ్రావణిలకు కూడా తెలియచేస్తాను. వారు అంగీకరిస్తే పెళ్ళి జరిపించే బాధ్యత నాది" అన్నాడు రాయుడు తన కుటుంబ సభ్యులందరినీ పరికిస్తూ.

భీమశంకరం ఆనందంగా గాలి పీల్చుకున్నాడు. తన ఇరవైయేళ్ళ కృషికి ఫలితం దక్కిందని ఆనందించాడు.

రాయుడి ఇంట్లో జరిగిన చర్చంతా పనివాళ్ళ ద్వారా ఆదినారాయణ వర్ధనమ్మలకు తెలిసింది. వర్ధనమ్మ 'పారిజాతం వేశ్య. శ్రావణి దాని కూతురా?' అని దవడలు నొక్కుకుంది. ఈ పెళ్ళి ఆపడం పెద్ద

## కొత్తగాలి...

**పెరుగుట విరుగుట కొరకే**
**నాటి సామెత**
**పెరుగుట పెరుగుట కొరకే**
**నేటి ధరలమోత**

– సుందరి,
విశాఖపట్నం

కష్టం కాదనుకున్నాడు ఆదినారాయణ. శ్రావణి ఎవరో తెలిసిన తరువాత అసలు వేణూయే ఈ పెళ్ళి అంగీకరించకపోవచ్చు అనుకున్నాడు. ఈ నిజం ఇంతవరకూ శ్రావణికి వేణుకి తెలియదు కనక తెలియ జేస్తే రియాక్షన్ ఎలా వుంటుందో అనే ఆలోచనలో పడ్డాడు. అంతే కాకుండా శ్రావణిని కించపరుస్తూ 'ఇంత పెద్దింటి కోడలు అయ్యే యోగ్యత తనకు లేదని తాను వేణుని పెళ్ళి చేసుకుంటే ఆ కుటుం బానికే మచ్చ వస్తుందని, వేణుకు కూడా మచ్చని తెలియచేస్తే, శ్రావణి తనంతట తాను వేణు జీవితంలోంచి తప్పుకోవచ్చు కాని ఈ తతంగమంతా జరిపించడం ఎలాగో ఆలోచించాలి' అనుకున్నాడు.

ఆ రోజు సాయంత్రం వేణు, శ్రావణి బీచ్‌లో కలుసుకున్నారు. శ్రావణి ఎప్పుడూ ఉండేటంత హుషారుగా లేదు. ఆ సంగతి వేణు గ్రహించాడు.

'ఎందుకురా డల్‌గా వున్నావు? " అన్నాడు ముద్దుగా.

'డాడి ఇవాళ పొద్దున పాలెం చేరుకుని వుంటారు. ఇప్పటి వరకూ ఆయన నుంచి ఫోనులేదు. ఆయనా రాలేదు' అంది అను మానంగా.

వేణు నవ్వుకొని "పెళ్ళి ముహూర్తం పోస్ట్ పోన్ అయ్యిందనుకుంటున్నావా లేక ఆగిపోయిందని భయపడ్తున్నావా!" అన్నాడు.

ఆ మాటకు శ్రావణి కళ్ళలో నీళ్ళు తిరి గాయి. "పెళ్ళి ఆగిపోయింది అన్న మాట అనకు వేణు. నువ్వు లేకుండా నేను బత కలేను"

"నువ్వు లేకుండా నేను మాత్రం బతగ్గ లనా? " అన్నాడు వేణు.

ఆ మాటకు వారి పరిచయంలో మొట్ట మొదటిసారి శ్రావణి వేణూని కౌగలించు కొని అతనిలో ఒదిగిపోయింది.

ఆమెను సముదాయిస్తూ "లేనిపోనివి ఊహించుకోకు. నేను తాతగారికి ఫోన్ చేసి ఏమయ్యిందో కనుక్కుంటాను" అంటూ కళ్ళు తుడిచాడు.

ఇంతలో వేణు సెల్ మోగింది. చూశాడు "ఇంటినించే" అంటూ ఆన్ చేశాడు.

"నువ్వూ, శ్రావణి బయలుదేరి రేపు ఉద యానికి మనింటికి రండి. భీమశంకరం గారు కూడా ఇక్కడే ఉన్నారు".

"ఇప్పుడు మేం రావటం దేనికి నాన్నా"

"తాతయ్య మీ ఇద్దరితో ఏదో మాట్లాడా లట"

"ఆయన మాట నేనెప్పుడూ కాదనను కదా? "

"ఫోన్‌లో చర్చలెందుకు నాన్నా? తాతయ్య రమ్మన్నారు వెంటనే బయలుదే రండి" అని ఫోన్ పెట్టేశాడు.

వేణు, శ్రావణి ముఖా ముఖాలు చూసు కున్నారు.

'శ్రావణి ఎందుకు రమ్మనారో!' అను కుంది.

'ఏదో కారణం లేకుండా తాతయ్య రమ్మ నడు' అనుకున్నాడు వేణు. ఒక నిమిషం ఆలోచించాడు.

"మనమెందుకు ఆలోచించడం. వెళ్లేక తాతయ్యే చెబుతాడు" అన్నాడు వేణు.

"ఏదైనా గొడవ జరిగిందంటావా? "

అంది అనుమానంగా.

"తాతయ్య ఉండగా అలాంటివేవీ జరగవు. జరగనివ్వడు"

మనసు బాగోక ఇద్దరూ లేచి ఎవరి రూమ్స్‌కి వారు వెళ్లిపోయారు.

★ ★ ★

వేణు, శ్రావణి పాలెం చేరుకున్నారు.

కుశల ప్రశ్నలు అయిన తరువాత కుటుంబంలోని అందర్నీ ఉద్దేశించి "ఒక గంటలో మీరందరూ టిఫిన్స్ అవీ కానిచ్చి నా గదికి రండి. ఇది మన కుటుంబ సమస్య మనందరం కలిసి మాట్లాడుకోవలసిన విషయం" అన్నాడు రాయుడు.

అందరిలోనూ ఏం జరుగబోతోందన్న ఆత్రుత... రాయుడు ఆదేశానుసారం అందరూ ఆయన గదిని చేరారు.

ఒక్క క్షణం ఆలోచించి "భీమశంకరంగారిని కూడా పిలువు నాన్నా" అన్నాడు రాయుడు కొడుకుతో.

ఆయన రాగానే రాయుడు తన కుటుంబ సభ్యుల నుద్దేశించి "నిన్న ఉదయం నించీ జరిగిన చర్చలు మీ అందరికీ తెలిసినవే. వేణుకు, శ్రావణికి తెలీదు.." అని మొదలుపెట్టి భీమశంకరం చెప్పిన కథనంతా వివరించాడు. శ్రావణి ఒక వేశ్య కుటుంబంలోంచి వచ్చిన పారిజాతం కూతురు అనే నిజాన్ని కూడా చెప్పాడు.

వేణు మొహంలో ఏమీ మార్పు లేదు.

శ్రావణి షాకైంది. తర్వాత తల వంచుకుంది. తన జీవితం ఇక్కడ నించీ ఏం మలుపు తిరగనుందో అనుకుందామె దిగులుగా.

అంతా వివరించిన రాయుడు, వేణూ ముఖంలోకి చూస్తూ "ఇప్పటికీ శ్రావణి అంటే నీకు ఇష్టమేనా? ఆమెను పెళ్లి చేసుకోవడానికి సిద్ధమేనా? ఇదే ప్రశ్న నీకు కూడా వర్తిస్తుంది శ్రావణీ. ఇది మా కుటుంబానికి సంబంధించిన విషయమే అయినా నిర్ణయం మాత్రం మీ ఇద్దరిదే. ఈ ఇంటి గౌరవం, సాంప్రదాయం, పరువు ప్రతిష్టలు మీ కలయికకు అడ్డుగోడలు కావు. మీరు తీసుకున్న నిర్ణయం అమలు జరుగుతుంది" అన్నాడు.

ఒక నిమిషం ఆగాడు రాయుడు.

ఎవరూ మాట్లాడలేదు.

రాయుడు మళ్లీ చెప్పటం మొదలుపెట్టాడు.

"కుటుంబంలో సమస్యలు ఎదురైనప్పుడు సహేతుకంగా ఆలోచించి నిర్ణయం తీసుకోవాలి. అంతేగానీ పెద్దరికం అనే ముసుగులో ఎవరి హక్కుల్నీ ఎవరూ కాజేయటానికి ప్రయత్నం చెయ్యకూడదు" అని తన కొడుకు, భార్య, కోడలినుద్దేశించి అన్నాడు.

"నువ్వు చెప్పు తాతా? " అన్నారు వేణు నుద్దేశించి.

"ఒక మంచి సాంప్రదాయ కుటుంబంలో పుట్టి గతంలో ఎంతో కీర్తిగల వంశం నుంచి వచ్చి పతనమైపోయిన ఒక వ్యక్తి ఉందనుకోండి. సమాజపరంగానూ, వ్యక్తిగతంగానూ, వ్యవస్థాపరంగానో చెడ్డ పేరు సంపాదించుకున్న కుటుంబం నుండి వచ్చిన వ్యక్తి మంచిని సంతరించుకొని పవిత్రంగా బతుకుతోందనుకోండి. గతంలో గౌరవమైన కుటుంబమే కదా అని ఆ కుటుంబంలోంచి వచ్చినా కూడా చెడిపోయిన వ్యక్తిని స్వీకరించలేం కదా. శ్రావణి గత చరిత్రతో నాకు పనిలేదు. నాకు తెలిసిన శ్రావణికి ఏ మచ్చా లేదు. సమాజం అనుకుంటున్నది మచ్చ కాదు. పారిజాతం కూతురు శ్రావణి కావడం నా దృష్టిలో మచ్చే కాదు. శ్రావణి చరిత్రతో నాకనవసరం. శ్రావణిని వ్యక్తిగా ప్రేమించాను, పెళ్లాడతాను".

రాయుడు, వేణూని అభినందన పూర్వకంగా చూశాడు.

"నీ ఉద్దేశం ఏమిటమ్మా?"

శ్రావణి ఒక్క క్షణం ఆలోచించి "వేణుకి నేను అంటరానిదాన్ని అయితే, నాకు వేణు కూడా అంటరానివాడే. వేణు నన్ను తనకు కావాలనుకుంటే వేణూ నావాడే. ఇద్దరూ కలసి బతకటానికి జాలి ప్రాతిపదిక కాకూడదు. వ్యక్తిత్వాలు, నమ్మకాలే ఇద్దరూ కలిసి బతకటానికి ఆధారాలు కదా? ఒకరిపట్ల ఒకరికి గౌరవమే కలసి బతకటానికి ప్రాతిపదిక"

శ్రావణి వ్యక్తిత్వానికి భీమశంకరమే కాకుండా రాయుడు కూడ ఆనందించాడు. ముఖ్యంగా వేణు అంతటి ఆత్మవిశ్వాసం ఉన్నవాళ్లే అవసరమయితే సమాజాన్ని కూడా ఎదురు నిలిచి బతకగలరు అనుకున్నాడు.

సీతారామయ్య శ్రావణి ముఖంలోకి చూస్తూ 'నువ్వు పారిజాతం కూతురివని తెలిసి సిగ్గు పడుతున్నావామ్మా?' అన్నాడు. ఆ ప్రశ్నకు సమాధానం శ్రావణి నుంచి ఏం వస్తుందోనని అక్కడనున్న ప్రతి ఒక్కరూ ఎదురుచుస్తున్నారు.

శ్రావణి సీతారామయ్య కళ్ళలోకి చూస్తూ "నేను సిగ్గుపడటం లేదండీ. గర్వపడుతున్నాను. తొమ్మిది నెలలు మోసి ఏడాది పెంచి తననీడ నామీద పడకూడదని తన కుటుంబ చరిత్ర నా చరిత్ర కాకూడదని నన్ను దూరం చేసుకొని ఒక మంచి వ్యక్తి చేతుల్లో పెట్టి నన్ను మరచిపోగలిగింది మా అమ్మ. ఎందుకు? నా భవిష్యత్తు ఆశించి, ఆ త్యాగం చేసింది. నాతో తన ముద్దు ముచ్చట్లు తీర్చుకుంటూ అక్కడే పెంచి తన కూతురుగానే నన్ను పెద్ద చేస్తే నా చరిత్ర ఎలా తయారవుతుందోననుకుంది. ఎలాంటి స్వార్థానికి లోనుకాకుండా నా హితవు కోరి నాకోసం ఇంత త్యాగం చేసిన నా తల్లిని చూస్తే నాకెప్పుడూ గర్వమే. పారిజాతం నా తల్లి అని చెప్పటానికి నేను ఎప్పుడూ భయపడను' అంది ఆవేశంగా.

"భీమశంకరం వైపు చూస్తూ నా తల్లి త్యాగంలో కొంత స్వార్థం వుంది. కన్నబిడ్డ భవిష్యత్తు బాగుండాలి అనే ఆశవుంది. కాని ఈ మహానుభావుడు నాకు నాన్నయి ఇన్నేళ్లు పెంచేడు. ఎంత ఉన్నతమైన ఆలోచనలు ఇచ్చాడు. ఇంతదాన్ని చేశాడు. ఇంత ధైర్యాన్ని ఇచ్చాడు. ఈయన రుణం నేను ఎలా తీర్చుకోగలను? మరో జన్మ ఉంటే ఆయన కూతురుగానే పుట్టి నా రుణం తీర్చుకోవాలనుకుంటున్నాను" అంటూ వచ్చే దుఃఖాన్ని ఆపుకోలేక భోరున ఏడ్చింది. శోకం కట్టలు తెంచుకుని ప్రవహించింది. శ్రావణి బాధని చూడలేక పోయారు వారంతా.

మామగారితో విషయం తేల్చుకోవాలని గుమ్మందాకా వచ్చిన ఆదినారాయణ దంపతులు కూడా శ్రావణి మాటలకు కరిగిపోయారు.

వరలక్ష్మి ఆప్యాయంగా శ్రావణిని దగ్గరకు తీసుకొని సముదాయించింది.

భీమశంకరానికి కూడా కళ్ళలో నీళ్లు ఉబికాయి. శ్రావణి తల మీద చేతితో నిమిరి 'కూల్ డౌన్, కూల్ డౌన్. ఇది చాలా శుభసమయమమ్మా. నీ తల్లి ఎవరో నువ్వు తెలుసుకున్నావు. నువ్వు కోరుకున్న వ్యక్తికి భార్య కాబోతున్నావు. రాయుడిగారిలాంటి ఒక గొప్ప మనస్సున్న మహానుభావుడి కుటుంబంలోకి చేరబోతున్నావు. సాంప్రదాయాలు, సంస్కారం గల ఇంటి ఇల్లాలివి కాబోతున్నావు. ఆనందించాల్సిన సమయమమ్మా ఇది' అన్నాడు. లేచి బయటికి వెళ్లిపోయాడు. శ్రావణిని సముదాయించాడే కానీ శ్రావణి కృతజ్ఞతా భావానికి, అభిమానానికి అతను చలించిపోయాడు. శ్రావణినే తను పెంచి ఉండకపోతే నా అన్న వాళ్లు తనకు ఎవరు

న్నారనే ఆలోచన అతనికి రావటంతో కన్నీరు ఆగటం లేదు.

అక్కడ వాతావరణం తేలికపరచడానికా అన్నట్టు, రాయుడు అందర్నీ ఉద్దేశించి 'అతి దగ్గరలో పెళ్లి ముహూర్తం పెట్టించు నాన్నా. పెళ్లి భీమశంకరంగారికి అభ్యం తరం లేకపోతే మన వేణుగోపాలస్వామి ఆలయంలో జరిపిద్దాం' అన్నాడు.

'నాకేం అభ్యంతరం ఉంటుంది బాబూ గారూ. ఆ వేణుగోపాలుని సన్నిధిలో ఈ వేణుగోపాలరాయుడు ఆధ్వర్యంలో నా కూతురు పెళ్లి జరగటం కంటే నాకు ఆనందం ఏముంటుంది!' అన్నాడు భీమ శంకరం.

'మరో ముఖ్యమైన విషయం నాన్నా. ముహూర్తం నిర్ణయించగానే పెళ్లికి ముందు పారిజాతం కచేరి ఏర్పాటు చెయ్యి. కచేరీ అయిన తరువాత వివాహం. శ్రావణి తన కూతురేనని స్పష్టంగా పారిజాతానికి తెలు సుండకపోవచ్చు. స్వామి సన్నిధిలో భీమ శంకరంగారి సమక్షంలో తన కూతురిని పెళ్లి కూతురుగా చూసుకొని శ్రావణి తన కూతురేనని నిర్ధారణ చేసుకొని పెళ్లి కొడు కును, పెళ్లి కూతురిని ఆశీర్వదించి అక్షిం తలు వేస్తుంది. ఇరవై ఒక్క సంవత్సరాల తరువాత తల్లీ కూతుళ్ళ సమాగమం. ఇద్ద రికీ గొప్ప అనుభూతి. అందరికీ కన్నుల పండగే' అన్నాడు రాయుడు.

రాయుడు అనుకున్నట్టే అంతా సవ్యంగా వేణుగోపాలస్వామి సాన్నిధ్యంలో జరి గింది. శ్రావణి, వేణు ఒక్కటయ్యారు. మంగళసూత్రధారణ, ప్రమాణాలు, తలం బ్రాలు, తంతులన్నీ పూర్తయ్యాయి. పారి జాతం కంట ఆనందబాష్పాలు జాలువారు తున్నాయి. పెద్దలకు నమస్కరించి ఆశీస్సులు పొందటానికి సిద్ధమయ్యారు వధూవరులు. ముందుగా రాయుడు, వర లక్ష్మిలకు సమస్కరించారు. సీతారా మయ్య, సీతాదేవిలకు నమస్కరించారు.

## కొత్తగాలి...

**ముష్కరుల**
**రక్తదాహం**
**కీచక వినోదం**
**ముంబయి విషాదం**

*- విజయశ్రీ.జి, శ్రీకాకుళం*

రాయుడే వారిద్దరిని తీసుకువెళ్లి పారి జాతం ముందు నుంచోబెట్టాడు. ఆమెకు నమస్కరించారు. చివరకు భీమశంకరం దగ్గరకు వచ్చి ఇద్దరూ నమస్కరించారు.

ఆ తర్వాత ఏదో తెలియని అనుభూ తితో ఆగకుండా కారుతున్న కన్నీటితో పారిజాతం భీమశంకరం దగ్గరకు వచ్చి ఆయన ముఖంలోకి చూసి ఎన్నో కృతజ్ఞ తలు చెప్పుకోవాలని ఉన్నా మాటలు రాక మౌని అయిపోయింది. అతని పాదాలకు మనస్ఫూర్తిగా నమస్కరించింది. ఆమె కన్నీటి బొట్లు అతని పాదాలమీద పడ్డాయి. అతను ఉలిక్కిపడ్డాడు. 'లేవండి' అన్నాడు కానీ భుజాలు పట్టుకొని లేప లేదు. ఈ సంఘటన చూస్తూ వేణు, శ్రావణి ఒకరి ముఖాలు ఒకరు చూసుకు న్నారు. చిన్నగా నవ్వుకున్నారు. రాయుడు అంతరంగంలో ఏదో తియ్యని అనుభూతి. సీతారామయ్య, రాయుడు ఏదో తెలియని ఉద్వేగంతో ఒకరినొకరు చూసుకున్నారు. ఆడవాళ్లు వరలక్ష్మి, సీతాదేవిల పరిస్థితీ అలాగే వుంది. అంతా ఆనందం. వారి మనసులన్నీ ఏదో తెలియని వింత ఆనం దానుభూతితో తేలియాడిపోతున్నాయి. ఇదేనేమో జాతి సంస్కృతికి ప్రతిరూపం.

రంగరంగ వైభవంగా జరిగిన ఆ పెళ్లికి ఊరంతా ఆహ్వానితులే.

అందరి ముఖంలోనూ ఆనందం పరవ శ్లు తొక్కుతోంది.





# సనాతనంలో అధునాతనం శరత్ చంద్రీయం

నివాళి

**ఆయన భారత నవలా వినీలాకాశంలో ధ్రువతార. ఆయన రాసిన పతేర్‌దాబి (భారతి) నవల స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొంటున్న యువ కిశోరాలకు బైబిల్‌గా ఉండేది. ఫలితంగా బ్రిటిష్‌వారు దాన్ని నిషేధించారు. శ్రీకాంత్, గృహదహనం, శేషప్రశ్న, చరిత్రహీనులు తదితర రచనలు ఆనాడే దేశ విదేశాల్లో ప్రాచుర్యం పొందాయి. రాజీలేని స్వాతంత్ర్య పోరాటాన్ని బలపరిచిన ఆయనే ప్రముఖ బెంగాలీ నవలాకారుడు శరత్ చంద్ర ఛటర్జీ.**

మనదేశంలో స్వాతంత్ర్యోద్యమం ఉధృతమవుతున్న కాలంలో శరత్‌చంద్ర సాహితీవేత్తగా బెంగాల్‌లో ఆవిర్భవించారు. ఆనాడు మతంతో రాజీపడుతూ దిగజారిన మానవతావాదంతో, హిందూమత ధోరణితో సాగుతున్న జాతీయవాదంతో శరత్ విభేదించాడు. మానవతావాదపు అత్యంత సమరశీల, నవయవ్వనభరిత, లౌకిక వాద ధోరణిని తన రచనల్లో ప్రతిబింబించాడు. అత్యంత స్థిరంగా, ధైర్యంగా ఉదాత్తమైన సామాజికోద్యమ పతాకాన్ని సాహితీరంగంలో ఎగరేసి పోరాడాడు.

శరత్‌చంద్ర సాహిత్యాన్ని మూల్యాంకనం చేసే కొద్దిమంది మేధావులు అతడిని పక్షలార్(మేధోపరమైన అంశాలు లోపించిన) సాహితీవేత్తగా చెప్పడం కద్దు. అందుకే వారు 'ఆ సాహిత్యంలో ఏముంది? కన్నీళ్లు, ఇంత పాదధూళి తప్ప' అన్న చవకబారు వ్యాఖ్యానాలు చేశారు. ఆ రకంగా జాతికోసం పాటుపడిన మహనీయుల కృషిని గుర్తించడంలో విఫలమైనారు. ఫలితంగా గత సాంస్కృతిక ఒరవడి నుండి మనల్ని మనం తెగ్గొట్టుకోవడంతో ఆధార రహితంగా తయారయ్యాం. స్వాతంత్ర్యోద్యమంలో సాధించిన ఉన్నత సాంస్కృతిక స్థాయిని నిలబెట్టుకోవడంలోనూ విఫలమయ్యాం. మన సొంతగడ్డపైనే పుట్టిన ఉన్నత సాంస్కృతిక శృతితో లింకును కోల్పోయాం. మనం ప్రగతిబాటలో పయనించాలంటే శరత్ సాహితీ విలువను, అందులోని సారాన్ని అవగతం చేసుకోక తప్పదు.

శరత్‌చంద్ర పతేర్‌దాబి(భారతి) నవలలో కథానాయకుడు డాక్టర్‌బాబు(సవ్యసాచి)- స్వాతంత్ర పోరాటానికి ఏది అవసరమో అదే పథేర్‌దాబి(విప్లవసంస్థ)కి కూడా అవసరమవుతుంది, కాబట్టి అదే సవ్యసాచికి సత్యంగా ఉంటుంది - అంటాడు. అలాగే 'నిరంతరం మారుతున్న ఈ ప్రపంచంలో అఖండమైన లేదా శాశ్వతమైన సత్యాన్ని గ్రహించడం ఉండదు. అది ఉనికిలోకి వస్తుంది.. పోతుంది. ఒక యుగం నుండి మరో యుగానికి అది మార్పులకు గురవుతుంది. మానవ సమాజ అవసరాలకు తగినట్లుగా నూతన రూపాలనూ సంతరించుకుంటుంది. గతకాలం సత్యాన్నే ప్రస్తుత కాలంలోనూ పాటించాలనే నమ్మకం తప్పవుతుంది. అలాంటి భావం మూఢనమ్మకమవుతుంది' అని చెబుతాడు. అలాగే "నా అభిప్రాయంలో సత్యాసత్యాలు, మంచీ చెడులు పథేర్‌దాబి ఆవశ్యకతను బట్టి నిర్ణయించాలి. ఇది నా విశ్వాసం. నా జీవితానికిదే మార్గదర్శకం. ఇది నా ఉనికి విధానం. ఇదే నా నిజమైన గుర్తింపు. నీవు అంతిమ సత్యం, శాశ్వత సత్యం అంటావు. ఈ అర్థరహిత, పసలేని పదాలకు ఎనలేని విలువ ఉందని అంటావు. అయితే అజ్ఞానులను మోసగించడానికి ఇంతకంటే పెద్ద చిట్కా ఉండబోదు. నేనెన్నడూ

అబద్ధమాడను. అయితే ఆవశ్యకత నిర్దేశించినపుడు సత్యాన్ని సృష్టిస్తాను" అంటాడు. ఈ విషయాన్ని చెప్పిన మరుక్షణమే "స్వాతంత్ర్యంకోసం రక్తం ఏరులై పారాల్సివుంటుంది. దానికోసం అవసరమైతే చంపడానికీ వెనుకాడను. అయితే గుర్తుంచుకో! సవ్యసాచి ఆవశ్యకత, బ్రజేంద్రుడి (విప్లవద్రోహి)ఆవశ్యకత ఏమాత్రం ఒకటి కాదు" అంటాడు. ఇక్కడ సామాజిక ఆవశ్యకతకు, వ్యక్తి సంకుచిత ఆవశ్యకతకు మధ్య వ్యత్యాసాన్ని శరత్ చూపించదలిచాడు.

"అన్ని మతాలూ మోసాలే- పూర్వకాలంనాటి మూఢనమ్మకాలే. మానవాళికి ఇంతకంటే పెద్దశత్రువు లేదు" అన్నాడు. 'శ్రీకాంత్' నవలలో రైల్వే లైన్ నిర్మాణం గురించి వర్ణించేటప్పుడు శ్రీకాంతుడు అక్కడ మురికివాడలో కార్మికులతో ఓ రాత్రి గడపాల్సివస్తుంది. వారి దౌర్భాగ్య స్థితిని గమనించి అతడిలో పెల్లుబికిన యాదృచ్ఛిక ఆగ్రహమనేది మానవతావాద ఆలోచననేగాక మరింత ఉన్నతమైన దాన్ని ప్రతిబింబించింది. "అయితే మీరు! ఆధునిక నాగరికత నిర్మాతలైన మీరు చనిపోతున్నారు. మీరు చనిపోండి! మీ జీవితాన్ని ఇలా తయారు చేసిన ఈ క్రూర నాగరికతను ఏమాత్రం క్షమించవద్దు. దానిని మీరు మోయాల్సివస్తే వేగంగా దాని సమాధిలోని అగాధపు లోతుల్లోకి మోసుకెళ్లిపోండి!" అంటాడు. దీంతో శరత్ మానవతావాద ఆలోచనా పరిధిని దాదాపు అధిగమిస్తున్నట్లుగా తెలుస్తుంది.

**నైతిక మాతృత్వం- స్త్రీ పురుషుల సంబంధాలు**

శరత్ రచనల్లో మహిళా పాత్రలు రక్తసంబంధం లేకపోయినా తాము ఎవరినైతే సొంతబిడ్డలుగా పరిగణించారో వారి అన్ని బాధ్యతల్ని నిర్వర్తించడం కనిపిస్తుంది. వ్యక్తిగతాతీత మాతృత్వంలోని అనుభూతిని వారు పొందారు. అతడి కథల్లో మహిళల గౌరవానికి సంబంధించి చిత్రించిన అవగాహన మనల్ని ముగ్ధుల్ని చేస్తుంది. 'మేజ్ దీదీ' నవల చదివితే తాము హేమాంగిని లేదా నారాయణిలా నైతిక ప్రమాణాలను సాధించాలనే తీవ్రమైన తపన సాధారణ మహిళల్లో రేకెత్తుతుంది. మహిళా జాగృతికి సంబంధించి నిజమైన వెల్లువను ఇది సూచిస్తుంది. 'వైకుంఠుని వీలునామా'లో సవతి తల్లికి, గోకుల్‌కి మధ్య అనుబంధాన్ని శరత్ చక్కగా చిత్రించాడు. సవతి తల్లి తనకు వ్యతిరేకంగా కుట్ర చేస్తోందని అమాయకుడైన గోకుల్‌ను భార్య, మామ నమ్మిస్తారు. కానీ చివరకు వారి ప్రయత్నం బెడిసికొడుతుంది. తల్లి 'గోకుల్' అని పిలువగానే సర్వం మరచిపోయి 'చెప్పు అమ్మా!' అని ప్రతిస్పందిస్తాడు. 'నిష్కృతి' నవలలో సిద్ధేశ్వరి ఉమ్మడి కుటుంబంలోని పిల్లల్ని స్వపర విచక్షణ లేకుండా ప్రేమగా చూస్తుంటుంది.

శరత్ తాను సృష్టించిన వితంతు పాత్రలలో ఎవరికీ వివాహం జరిపించలేదు. చరిత్రహీన్‌లోని సావిత్రి, పల్లీసమాజ్‌లోని రమ, బడదీదీలోని మాధవి- వీరెవరికీ వివాహం కాదు. ఆనాటి సామాజిక పరిస్థితుల్లో సావిత్రి సతీష్‌లకుగాని, రమ రమేష్‌లకు గాని, మాధవీ సురేంద్రనాథుడికిగాని వివాహం జరిపించడు. అలా జరిపించాలంటే వారిని సమాజం నుండి బయటికి తీసుకుపోయి ఏదో ఒక హోటల్‌లోనో, ఇంకెక్కడో వారిని ఉంచుతూ చెత్తసినిమాల్లోలాగా చిత్రించాల్సివస్తుందని శరత్‌కు తెలుసు. ఎందుకంటే ఆనాటి సమాజం వారి వివాహాన్ని సంతోషంగా స్వీకరించేది కాదు. సమాజంలో గౌరవస్థానాన్ని సాధించకుండా ప్రేమ దానికదే తన సౌందర్యాన్ని, ఆకర్షణను నిలబెట్టుకోలేదు. అందుకనే ఆయన కథా నాయికలైన వితంతువుల్ని అసాధారణ సౌందర్యం, గుణగణాలు, చతురత గల పాత్రలుగా మలిచాడు. వారి మధ్య సౌందర్యభరితమైన సంబంధాన్ని చూపిస్తూ ఆయన ఇలా అడగదలిచాడు, "ఓ పాఠకులారా! ఇప్పుడు చెప్పండి. ఇది అనైతికంగా కనిపిస్తుందా? వారు వితంతువులే. కానీ ఆయా సంబంధాలనుంచి వికసించిన అందం, సోయగం అసహ్యకరంగా ఉన్నాయా? ఈ ఉదంతాలు మిమ్మల్ని బాధకు గురిచేస్తున్నాయా? సంప్రదాయ వైవాహిక జీవితాన్ని గడుపుతున్న మీ ప్రేమ సంబంధాల వంటివేనా ఇవి? లేక వాటికంటే ఉన్నతమైనవా? వారు హుందాగా గౌరవప్రదమైన జీవితాన్ని గడపాలని మీరు నిజంగా కాంక్షిస్తే అప్పుడు ఈ హిందూ సమాజాన్ని సమూలంగా మార్చాల్సివుంటుంది."

మనుషుల్ని అమానవీయంగా మారుస్తూ వారి బాధ్యతలను విస్మరించేటట్లుచేసి, భావోద్వేగాలను ఇంకి పోయేలాచేసే మతాచారాలను, మూఢనమ్మకాలను, కులపట్టింపులను, అంటరానితనాన్ని వదిలివేస్తే మంచిదనేలా ఆయన పాత్రలను చిత్రీకరించాడు. దీంతో పాఠకుల్లో దుఃఖాన్ని కలిగించడం ద్వారా వారిలోని ఆర్ద్రతను మేల్కొల్పుతూ దురాచారాలకు వ్యతిరేకంగా శరత్ పోరాడాడు.

*(జనవరి 16 శరత్ వర్ధంతి)*

– కె.రఘు

చతుర కథ

# రిహార్సల్

-కె.లక్ష్మీకాంతమ్మ



"నిజంగా మీ అంత ఘోరమైన మనిషిని నేనెక్కడా చూళ్లేదండీ..." అంది అవంతి.

"అంటే? " అన్నాడు చంద్రకాంత్.

"నేను మిమ్మల్నేమన్నా మణులడిగానా? మాన్యాలడిగానా? ఒకే ఒక్క పట్టుచీర అడిగాను. దానికిన్ని సాకులు చెవుతున్నారంటే- హూ౦... నిజంగా ఏం మనిషండీ? " పుటుక్కున మెటికలు విరుస్తూ భర్తకేసి మిర్రిమిర్రి చూసింది అవంతి.

"సాకులు కాదవంతీ! ఉన్న విషయం చెపుతున్నాను. పోయిన్నెల్లోనేగా ఓ పట్టు చీర కొనుక్కున్నావ్! మళ్లీ ఈ నెల్లో కూడా ఇంకో పట్టుచీరంటే నేనెందులో పడి చావను? నేను చేస్తున్నది జూనియర్ అసిస్టెంట్ ఉద్యోగం. అంతే తప్ప మీ బాబులా కమర్షియల్ టాక్స్ ఆఫీసర్ని

# న్యూడ్ బెడ్‌ఫెలో




అమెరికాలోని మిచిగన్ రాష్ట్రంలోని హేండెల్ పార్క్ అనే ఊర్లో ఇరవై ఎనిమిదేళ్ల ఓ యువతి ఉదయం నిద్ర లేచేసరికి తన పక్కన నగ్నంగా ఉన్న ఓ అపరిచిత వ్యక్తి నిద్రిస్తుండటం చూసింది.



అతడు టీనేజ్ కుర్రాడు. బాగా తాగి ఉన్నాడు. అతడి బ్లడ్ ఆల్కహాల్ లెవెల్ చాలా ఎక్కువగా ఉంది. ఆ యువకుడ్ని లేపితే అతడు ఆమెకు తనతో సెక్స్‌లో పాల్గొనడానికి 14 డాలర్లు, కొంత డ్రగ్స్ ఆఫర్ చేశాడు. దానికామె వెంటనే పోలీసులని రప్పించింది. ఆమె వేశ్య అని ఆ కుర్రాడు ఆరోపించాడు. ఆమె అది అబద్ధమని చెప్పింది. నిజానికామె ఓ అడల్ట్ నైట్ క్లబ్‌లో వెయిట్రెస్‌గా పనిచేస్తోంది.

కాను..." అన్నాడు చంద్రకాంత్.

"అంటే ఏంటి మీ ఉద్దేశం? మా నాన్న బాగా లంచాలు మెక్కుతున్నాడనా? "

"అందులో సందేహం దేనికి? జగమెరిగిన సత్యం కదా? లంచాలు మెక్కకపోతే అంత ఆస్తి ఎలా సంపాదించాడంటావ్? నాకు అయిదు లక్షలు కట్నం ఎలా ఇవ్వగలిగాడంటావ్? " చంద్రకాంత్ పిడికిలి బిగించి గాల్లో చెయ్యూపుతూ నిగ్గదీస్తున్నట్టుగా అడిగాడు ముక్కు పుటాలు అదురుతుండగా!

"ఎలాగోలా సంపాదించాడు! మీకు లెక్కలు చెప్పాల్సిన అవసరమేంటి? మీరేవన్నా ఇన్‌కంటాక్స్ ఆఫీసరా ఇవన్నీ అడగటానికి? అయినా కాకపోయినా మా నాన్నని అనాలసలు! మరో రెండు లక్షలు పారేస్తే ఏ డాక్టరో, ఇంజనీరో వచ్చుండేవాడు! అలాంటిది మీరు వాళ్ల ఫ్రైండ్ కొడుక్కదాని అన్ని లక్షలు పోసి అన్యాయంగా నాగొంతు కోశారు..." పైటచెంగు నడుం చుట్టూ ఓ తిప్పుతిప్పి బొడ్లో దోపుకుంటూ అంది అవంతి.

"ఏదో యుద్ధానికి ప్రిపేరవుతున్నదానికి మల్లే ఏంటా ఫోజు? ఆ మాటకొస్తే అన్యాయమైపోయింది నేను..."

"ఏవిటట తవరన్యాయమైపోయింది? "

"ఫ్రెండిషిప్‌ని అడ్డంగా పెట్టుకునీ..."

"ఊఁ... పెట్టుకుని... మిమ్మల్ని కొరుక్కు తిన్నారా? "

"నన్ను చీప్‌గా కొట్టేశాడు మీనాన్న"

"చీపా? చాల్లే ఊర్కోండి... మానాన్న అమాయకుడు కాబట్టి మీ మొహానికి అన్ని లక్షలుపోశారు! అసలెవరిస్తారు మీకు అన్నేసి లక్షలు? "

"అంటే... నా విలువ ఎంతని నీ ఉద్దేశం? "

"అన్ని లక్షలు దండగన్నది వాస్తవం!"

"అవంతీ !" చంద్రకాంత్ ఆవేశంగా అరిచాడు. "కనీసం గౌరవం కూడా లేకుండా నువ్ చాలా టూమచ్‌గా..."

"అవసరమైతే త్రీమచ్‌గా కూడా మాట్లాడతాను..." పెడసరంగా అంది అవంతి. "పెళ్లాం ముండకి రెండు పట్టుచీరలు కొనివ్వలేరు గానీ పౌరుషానికి మాత్రం లోటు లేదు..."

"ఛీ ! నువ్వింత సంస్కారహీనురాలివను కోలేదు..."

"ఊఁ దిగాడండీ... సంఘ సంస్కర్త! ఉన్నమాటనడం సంస్కారం లేకపోవడమా? "

"అంతా నాఖర్మ! నా ప్రారబ్దం..." నెత్తి బాదుకున్నాడతను.

"అవి నేననాల్సిన మాటలు..."

"ఛ... ఛ..."

"నేనేం కుక్కని కాదు... చీదరించితే సహించేది లేదు..."

"ఏం చేస్తావేంటి? "

"ఏం చేస్తాను? మిమ్మల్ని కట్టుకున్న పాపానికి శుభలగ్నంలో ఆమని లాగా ఏడుస్తూ కూర్చుంటాను..."

వాళ్లిద్దరూ అలా కీచులాడుకుంటుంటే- నాకు చెప్పలేనంత ఆశ్చర్యం వేసింది.

నిండా ఓ ఆర్నెల్లయినా కాలేదు వాళ్లకి పెళ్లయ్యి! అప్పుడే ఇంతలా కీచులాడుకుంటున్నారంటే ముమ్ముందు వాళ్ల కాపురం మరెంత అధ్వాన్నంగా ఉంటుందో కదా!

ఆ సమయంలో లోనికి వెళ్లడం బావుండదేమోననిపించి ఆగాను- కానీ, నన్ను చూసైనా వాళ్లు పోట్లాడుకోవడం మానేస్తారేమోనని అనుకుని- నా ఉనికిని తెలియజేస్తూ ఓ పొడిదగ్గు దగ్గాను- పెద్దగానే!

"మీరా ఆంటీ. రండ్రండి..." అంది అవంతి నన్ను చూసి కొంచెం సిగ్గుపడుతూ.

చంద్రకాంత్ కూడా బిడియంగా నవ్వాడు.

"ఈ గిన్నెలో కాస్త మంచి నూనె ఉంటే ఇస్తావూ? తేగానే మళ్లీ ఇచ్చేస్తా..."

"అలాగే ఆంటీ..." అంటూ నా చేతిలోంచి గిన్నెని అందుకుంది అవంతి. అదే చిరునవ్వుతో.

ఆమె కిచెన్‌లోకెళ్ళి- గిన్నె నిండా నూనె నింపుకొని వచ్చింది.

దాన్నామె నా చేతికందిస్తూంటే.."పెద్దదాన్ని కాబట్టి అడుగుతున్నాను..మీరప్పుడే ఏదో కీచులాడుకుంటున్నట్టున్నారు? " అనడిగాను ఇబ్బందిగా ముఖం పెట్టి.

దానికా మొగుడూ పెళ్ళాలిద్దరూ చప్పున తల దించుకున్నారు.

నేను నా చేతిలోని నూనె గిన్నెను టీపాయ్ మీద పెట్టి... ఓ కుర్చీలో సెటిలైపోయాను.

"చూడు అవంతీ- ఏమనుకోకు! మీకు పెళ్లయ్యి నిండా ఆర్నెలలు కాలేదు. ఇప్పట్నుంచే ఇలా కీచులాడుకుంటే ఎలా? భార్యాభర్తలన్నాక ముమ్ముందు ఇలాంటివన్నీ ఎలాగూ తప్పదు! కానీ, పెళ్ళయిన కొత్తల్లోనన్నా కొన్నాళ్లపాటు సంతోషంగా ఉండాలి కదా! మీ అంకుల్ ఇప్పుడంటే పేకాటరాయుడిగా మారిపోయారు గానీ- మా పెళ్ళయిన కొత్తలో ఓ రెండేళ్లదాకా నా కొంగు వొదిలేవారు కాదు. నేను కూడా ఆయన్ని చాలా ప్రేమగా చూసుకునేదాన్ని... అలాంటిది మీరిప్పట్నుంచే ఇలా తయారైతే... ముందు ముందు ఇంకేం సుఖపడతారమ్మా? ఏవయ్యా- చంద్రకాంతూ! నువ్ కూడా ఏంటయ్యా ఇది? అప్పుడే కొత్త పెళ్ళాం మీద మోజు తీరిపోయిందా నీకు? " అన్నాను ఇద్దరికీ హితవు చెబుతూ!

"అబ్బే- మేమేం కీచులాడుకోలేదాంటీ!" అన్నాడు చంద్రకాంత్- చేతులు నలుపు

## డిసెంబరు-08
# చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.




1. వై.శ్రీకాంత్ - కానూరు, విజయవాడ
2. మచ్చారామారావు - గోకినపల్లి, ఖమ్మం జిల్లా
3. డి.ఎస్.సునందబాయి - రాజీవ్‌నగర్, మదనపల్లె
4. పి.ఈశ్వరబాబు - నందికొట్కూరు, కర్నూలు జిల్లా
5. రామకూరు నాగేశ్వరరావు - జి.టి. రోడ్, శ్రీకాకుళం

### సరైన జవాబులు

1. కమలమ్మ 2. సుదర్శన్ 3. బంటు ఎల్లయ్య 4. బొర్రెంకయ్య 5. చారి 6. అశోక్‌చోప్రా 7. లక్షన్నర 8. ది గ్రేట్ డిక్టేటర్ 9. జి.కళ్యాణరావు 10. ఉంగరాలు

---

కుంటూ.

"అవునాంటీ..." అంటూ భర్తకి వంత పాడింది అవంతి.

"ఎందుకర్రా అబద్ధాలాడతారు? నేను వరండా మీదనుంచి మీ తగువంతా విన్నాను మరి..." అన్నాన్నేను.

"కానీ అది కీచులాట కాదాంటీ..." చంద్రకాంత్ గొంతు గమ్మత్తుగా పలికింది.

"అవునాంటీ..." అంటూ మళ్లీ భర్తకు వంత పాడింది అవంతి.

"బుకాయింపులైనా ఓ అర్థం ఉండాలయ్యా! ఒకపక్క నానా గొడవగా అరుచు కుంటూనే లేదంటారేం? " కించిత్ కోపంగా అన్నాను నేను. నన్నే బురిడీలు కొట్టిస్తున్నారే- అన్న ఇదితో.

"సారీ ఆంటీ! నిజంగానే మాది కీచులాట కాదు. మీరు మరోలా అనుకోనంటే నిజం చెప్పేస్తాను..." అన్నాడు చంద్రకాంత్ కొంచెం ముందుకొస్తూ.

"అనుకోన్లే చెప్పు" అన్నాను కుతూహలంగా.

"మాది ఉత్తుత్తి కీచులాట..."

"ఉత్తుత్తా? అదేం కీచులాట? దేనికలాగ? "

"మీరూ అంకుల్‌గారూ రోజూ పోట్లాడు కుంటుంటే వింటూ ఉంటాం కదా! భవిష్యత్తులో మేం కూడా ఒకవేళ మీలా తయారైతే మా లైఫ్ ఎలా ఉంటుందా అని, ఊరికే తమాషాకి చిన్న రిహార్సల్ లాంటిది వేస్తున్నాం... మాది కీచులాట కాదు... భవిష్యత్తాట!" అన్నాడు చంద్రకాంత్ గుంభనంగా నవ్వుతూ!

"అవునాంటీ... నిజంగా నిజం..." అంటూ భర్తకి మళ్లీ మళ్లీ వంత పాడింది అవంతి.

కొత్త దంపతుల అనురాగ సరాగాల్లో ఇదీ ఒక భాగమే కాబోలనుకున్నాను నేను.

పెంకులా మాడిపోయిన నా ముఖాన్ని దాచుకుంటూ, టీపాయ్ మీద పెట్టిన నూనె గిన్నెని తీసుకుని వడివడిగా బయటకు అడుగులు వేశాను! 

## కథ వెనుక కథ



# కల్లోలిత అంతరంగ ఆవిష్కరణ శారద

-డాక్టర్ సి.ఆనందారామం

**డాక్టర్ సి. ఆనందారామం సుప్రసిద్ధ రచయిత్రి. అరవైకి పైగా నవలలు, మరెన్నో కథాసంపుటాలు, అనువాదాలు ఆమె కలం నుండి జాలువారినా.. తన రచనలన్నింటిలో 'శారద' అంటే తనకెంతో ఇష్టమన్నారామె. 'చతుర' కోసం సదరు 'శారద' కథ వెనక కథను ఇలా ఆసక్తికరంగా వివరించారామె. అదేమిటో ఆమె మాటల్లోనే చదవండి..**

'ఎప్పుడో 70లలో వచ్చిన 'శారద' నవల అటు తర్వాత ఆరుసార్లు ముద్రణ పొందింది. ఎమెస్కో సంస్థే దాన్ని రెండుమార్లు ప్రచురించింది. ఇంకో పర్యాయం ముద్రించాలనీ ఆలోచిస్తోంది. నన్ను రచయిత్రిగా నిలిపిన ఆ రచనంటే నాకెంతో ఇష్టం. ఏ పద్ధతికీ, సూత్రానికీ కట్టుబడకపోవడమే ఆ కథ ఇతివృత్తం. కాబట్టే 'శారద'ను నేను విపరీతంగా అభిమానిస్తాను. అదీగాక తెలుగులో వచ్చిన కొన్ని నెలల వ్యవధిలోనే అది కన్నడలోకీ అనువాదమవడం మరో విశేషం' అంటారామె ఆ రోజుల్ని గుర్తుతెచ్చుకుంటూ.

**అసలు పేరు అది కాదు**

'విచిత్రమేమంటే- ఆ నవలకు మొదట పెట్టిన పేరు 'నానృషి కురుతే కావ్యం' ఆ పేరు పలకడం కష్టమని తర్వాత అందులోని కథానాయిక పేరైన 'శారద'ను ఖాయం చేశాం' అని వివరించారు ఆనందారామం. తర్వాత ఆమె ఆలోచనల్లోకి వెళ్లిపోతూ-

'అంతా నాదే అనుకుంటాం. అన్నిటికీ నేనే అంటాం. ఎన్ని అనుకుంటున్నా, పైకి ఇంకెన్ని అంటున్నా అసలు మనిషంటూ లోపల ఉంటాడు. ఆ వాణి ఎప్పుడూ మనకు వినిపిస్తూనే ఉంటుంది. ఏం మాట్లాడుతున్నామో, ఏది చేస్తున్నామో మనందరికీ తెలుసు. తప్పు-ఒప్పు, మంచి-చెడు ఎప్పటికప్పుడు గ్రహించగలం. అటువంటి రెండు పరిస్థితులు; బాహ్య, అంతరాల్లోని 'రెండు నేను'ల మధ్య సంఘర్షణలు సాగడాన్నే జీవితం

అనుకుంటాం. దాన్ని సమర్థంగా వ్యక్తపరిచేవారే కవులు, కళాకారులు. మరి ఆ ప్రయత్నంలోనే నా నవలానాయిక శారద తీవ్ర అశాంతికి లోనైంది. అలా భంగపాటుతో కుంగిపోయే సగటుజీవి అంతరంగాన్నే ఆ రచనలో ఆవిష్కరించాను' అన్నారామె సాలోచనగా.

**ఉగాది నవలల పోటీలో బహుమతి**

'మూడు దశాబ్దాలనాటి మాట. 'ఆంధ్రప్రభ' వారపత్రిక నుంచి ఓ రోజు నాకో టెలిగ్రాం వచ్చింది. తాము నిర్వహించిన పోటీల్లో నా శారద నవలకు మూడో బహుమతి వచ్చిందని సారాంశం. ఎవరో కొద్దిమందికి తప్ప, నా రచనాంశం అందరికీ నచ్చదని అప్పటిదాకా అనుకునేదానిని. అయినా నేను రాయడం, దానికే పురస్కారం రావడం నిజంగా సంభ్రమం కాదూ? ఆ వార్త చాలా సంతోషం కలిగించింది.

నాకిప్పుడు 70 ఏళ్ల పైమాటే. రాయడమనేది చిన్నప్పటినుంచీ ఉంది. అనుకోకుండా కొంతకాలం విరామం వచ్చింది. తర్వాత '62 నుంచి నవలలు రాస్తూనే ఉన్నా. 'సంపెంగ పొదలు', 'చీకటి కడుపున కాంతి', 'ఆత్మబలి' వంటివి ఎన్నో రాసి కొన్నింటికి బహుమతులూ అందుకున్నా. బోధనలో నాది మూడు దశాబ్దాల అనుభవం. సమాజ సాహిత్యం, కుటుంబ జీవితం, నవలా ప్రక్రియ, విమర్శనాంశాల మీద లెక్కకు మిక్కిలి పరిశోధనా పత్రాలు సమర్పించాను. మహిళల అణచివేత, అంటరానితనం, విద్యార్థుల్లో అశాంతి, మూఢనమ్మకాలు.. ఇలా ఎన్నిటిపైనో కలంతో కదనం సాగించాను. మనస్తత్వ విశ్లేషణ, శాస్త్రాల శోధన, సృజనాత్మక వ్యాసంగం కొనసాగిస్తూనే ఉన్నాను. ఇప్పటికి ఐదు నవలలు సినిమాలుగా వచ్చాయి. రచనాపరంగా ఎంత విస్తరించినా, భిన్నకోణాల్లో ముందడుగు సాగించినా నా ఓటు మటుకు నాన్నృషి..(శారద)కే.

**కథ, విధానం**

నాన్నృషి కురుతే కావ్యం.. అంటే అర్థం.. రుషి కానివాడు కావ్యం రాయలేడని. అసలు రుషంటే ఎవరు? తపస్సంటే ఏమిటి? అడవిలోకి వెళ్లి చేసే తపానికి,




కావ్యసృష్టికీ సంబంధమెంత? ఇదంతా నాలోని ఆలోచనా స్రవంతి. ముందే అన్నట్లు- అంతర్వాణికి, బాహ్య వ్యక్తిత్వానికి పొంతన కుదిరితేనే రుషిత్వం సిద్ధిస్తుంది. లేదంటే భంగపాటే. నా నవలా నాయకురాలు శారద సాధారణ రచయిత్రి. ఆకట్టుకునే రచనలు చేయగలిగినా, తరచూ తీవ్రంగా స్పందించే తత్వం.

తనను తానే మరిచి బతుకుబాటలో పరుగులు తీసే స్వభావం. ఆమెలోని మంచి గుణం.. స్వయం విశ్లేషణ. రచనారంగంలో తనకు పరిపక్వత లేదనే అశాంతితో రగిలిపోతుంటుంది. ఉత్తమంగా రాయాలనే ఆ తపనను ఎంతోకొంత గమనించిన వాడు రావు. విమర్శకుడిగా పేరున్న అతడిని ప్రేమించినా, లోపలి తత్వాన్ని




మాత్రం అవగతం చేసుకోలేకపోయింది. బిడ్డకు అమ్మకాగలిగిందే కానీ, వాత్సల్యంతో దరిచేరలేని స్థితి! ఆడబిడ్డ పరిమళంటే ప్రత్యేకించి ద్వేషమేమీ లేదు. కానీ పాపకు తనకన్నా ఆమెపైనే ప్రేమ ఎక్కువవడాన్ని శారద అస్సలు భరించలేదు. అందుకనే అక్కసు పెంచుకుంది.

ఎన్ని సమస్యలున్నా, రచనను వదులుకోలేదామె. రావుకి నచ్చిమెచ్చేదాకా రాయాలనేదే తన పట్టుదల. రాణింపచేసుకునే యత్నంలో మళ్లీ సంఘర్షణ. వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకునే తాపత్రయంలో పడుతూ లేస్తూ ఉంటుంది. అశాంతిగా తనను తాను నిందించుకుంటూ, అహంతో ఎందరినో తిరస్కరిస్తూ.. అదే ఘర్షణను తనకు తెలియకుండానే కాగితంమీద పెడుతుంటుంది. సరిగ్గా అప్పుడే రావు మెప్పు లభిస్తుంది. లోపాలను ఎత్తి చూపినా.. 'నువ్విలాగే కొనసాగిస్తే మంచి రచయిత్రివి కాగలవు' అంటాడతను. చివరికి తెలుసుకుంటుందామె. ఏమని? దేనికీ లొంగనిది, లోలోపలి నుంచి వెలికివచ్చేదే ఉత్తమ రచన అని. తనను అసంతృప్తి నుంచి బయటపడేసేది రావు ప్రేమేనని తెలుసుకుంటుంది. తన రచనలను మొహమాటం లేకుండా విమర్శించే అతనే ఆలంబన అనే నిశ్చయానికొస్తుంది.

మానవ సమాజమిది. నిరంతరం మారుతుంటుంది. ఇన్ని మార్పులొస్తున్నా ప్రేమ, ద్వేషం; దయ, స్వార్థం; కామం-త్యాగం వంటి ప్రాథమిక స్వభావాలు మటుకు ఎన్నడూ మారవు. అన్ని కాలాల్లోనూ అవి ఒకటే. వాటన్నిటి వెనకా ఏముంది? సంచలిస్తున్నట్లు కనిపిస్తూనే, తన అస్తిత్వాన్ని సదా కాపాడుకునే మనిషి తత్వం. దాన్నే, ఆ స్వభావాన్నే ఒడిసి పట్టుకోగలిగితే చాలు..' అంటూ ముక్తాయించారు ఆనందారామం.

ఆనందారామం నవల 'శారద'ను భీమారావు కన్నడంలోకి అనువదించారు. తర్వాత హిందీలోకీ అనువాదమైంది. ప్రస్తుతం ఆమె రామాయణంలోని అహల్యా పాత్రను సప్రమాణంగా విశ్లేషించే పనిలో ఉన్నారు. అదీ అంతరంగ చిత్రీకరణే కావడం విశేషం. అధ్యాపకురాలిగా వృత్తి విరమణ చేసిన ఆమె ఇప్పుడు సికింద్రాబాద్‌లోని మారేడుపల్లిలో ఉంటున్నారు.

సేకరణ: జంధ్యాల శరత్‌బాబు

# ఓ పెద్ద కుర్ర డాక్టర్!

సౌత్ కరోలినాలోని కుర్రాడు నైబర్స్‌కు ఎనిమిదో ఏట క్యాన్సర్ వచ్చింది. కానీ చిత్రంగా అది మాయమయింది. క్యాన్సర్ ఆ పిల్లాడిని చంపకపోయినా అతడి ఎదుగుదలను మాత్రం చంపేసింది. 37 ఏళ్ల జానీ నైబర్స్ చూడటానికి ఎనిమిదేళ్ల పిల్లవాడిగానే కనిపిస్తాడు.

గైనకాలజిస్ట్‌గా పనిచేసే నైబర్స్‌ని చూసి రోగులు 'ఇతనికేం తెలుసు?' అని భయపడతారు? 'డోంట్ వర్రీ.. నేను కనిపించేదానికన్నా పెద్దవాడిని' అని అతడు ధైర్యం చెప్తాడు.

క్రిస్టిన్ అనే అతడికన్నా పొడుగైన ఆమె జానీని వివాహం చేసుకుంది. వారికి ఓ కూతురు కూడా పుట్టింది.




ఆ పాప ఎదుగుదల మామూలుగానే ఉంది.

ఎనిమిదో ఏట లింఫ్‌గ్లాండ్స్ క్యాన్సర్ సోకినప్పుడు పిల్లలకు ఇచ్చే ఆరువారాల రేడియేషన్ వల్ల జానీ ఎదుగుదల ఆగిపోయింది. అదీకాక ఓ రకం కీమోథెరపీ మందును ప్రయోగాత్మకంగా జానీకి ఇవ్వడంవల్ల కూడా అతడి ఎదుగుదల ఆగిపోయింది. దాంతో ఆ మందును పిల్లలకు ఇవ్వడం విరమించుకున్నారు. అతడి మొహం మాత్రం చిన్న పిల్లవాడిలానే ఉంటుంది. ఈ వ్యాధితో ఈ రకం సమస్యను ఎదుర్కొన్న వ్యక్తి ప్రపంచంలో జానీ నైబర్స్ ఒక్కడే. క్యాన్సర్‌కు చికిత్స కనిపెట్టాలన్న పట్టుదలతో అతడు వైద్యవిద్యను అభ్యసించాడు. అయితే చివరికి గైనకాలజిస్ట్ అయ్యాడు.



కాలాతీతం

# డయానా ఆఫ్ ది క్రాస్‌వేస్

-జార్జి మెరెడిత్

డయానా ఆఫ్ ది క్రాస్‌వేస్ 1855లో వెలువడింది. మెరెడిత్ రచనల్లో అత్యంత పాఠకాదరణ పొందిందిదే.

ఆనాటి సొసైటీ లేడీ కారొలిన్ నార్టన్‌తో రచయితకున్న స్నేహమే కథానాయిక 'డయానా వార్విక్' పాత్రకు ప్రేరణ అంటారు. అనేకమంది సమకాలీన ప్రము ఖుల జీవితాలను స్ఫురింపచేసే ఈ నవ లకు, "ఇది కేవలం కల్పన. ఇందులోని పాత్రలకూ, నిజజీవితంలోని వ్యక్తులకూ పోలికలు కన్పిస్తే అది యాదృచ్ఛికమే" అని ఒక డిస్‌క్లెయిమర్ కూడా వుంటుంది.

ఈ నవలలో ప్రస్తావించిన రాజకీయ పరిణామాలు రాబర్ట్‌పీల్ కాలంలో జరి గాయి. విదేశాలనుండి మొక్కజొన్నలు చవకగా దిగుమతి చేసుకొనటం వల్ల ఇంగ్లీషు రైతులు నష్టపోతున్నారని విధిం చిన 'దిగుమతి సుంకమే' కార్న్ లాస్ (Corn laws). స్వేచ్ఛా వాణిజ్యానికి అవ రోధంగా వున్నాయని వీటిని 1845లో రద్దు చేశారు.

పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్ధంలో మిసెస్ వార్విక్ గురించి వినని వాళ్లులేరు. ఇంగ్లండ్‌లోని అనేక మంది ప్రముఖుల డైరీలలో, లేఖలలో ఆమె ప్రస్తావన వుంటుంది. నిజంగా ఆమె అంత అందమై నదా? అంత తెలివైనదా? అదంతా నిజమే అయితే అంతటి కీర్తికి, అభిమానా



నికి ఆమె అర్హురాలే. ఆకర్షణ, బుద్ధి చతురత ఉన్న స్త్రీల వ్యక్తిత్వాన్ని గురించి మనకెప్పుడూ సందేహాలే. అందువల్ల అలాంటి మిసెస్ వార్విక్ గురించి స్కాండల్స్ ప్రచారం కావడంలో ఆశ్చర్యం లేదు.

లభ్యమవుతున్న వివిధ కథనాల ప్రకారం-

సమాజం అనుమతించిన స్వేచ్ఛా పరిమితుల్ని దాటిందామె ప్రవర్తన. ఉదాహరణకు ఆమె నవ్వు. పురుషులు ఎంత బిగ్గరగానైనా నవ్వవచ్చు. కాని స్త్రీల నవ్వులో విధేయత, సిగ్గరితనముండాలి. 'స్త్రీకి స్వంత ఆలోచనా జ్ఞానముంది. ఇష్టానుసారం జీవించగలదు' అనే హక్కుకోసం పోరాటం చేసింది. అయితే సమాజం అప్పటికింకా ఆమె ప్రవర్తనను ఆమోదించగలిగిన దశకు ఎదగలేదు.

'ఎంత పురోగతి సాధించినా, కొన్ని విషయాల్లో పురుషులవి ఇంకా తాతలనాటి అభిప్రాయాలే' అందామె. మిసెస్ వార్విక్, రొమాన్స్ నవలల్లోని హీరోయిన్ కాదు. నిరంతరం శ్రమిస్తూ, ఆత్మవిమర్శ చేసుకుంటూ తన లక్ష్యాలను తానే అధిగమించాలనే స్వభావం ఆమెది. 'మైనపు బొమ్మల్లాంటి స్త్రీలంటే పురుషులకిష్టం. అల్లికలు, కుట్లతో కాలక్షేపం చేసే మహిళలు ఆరాధ్య దేవతలు. లావా ఎగిసిపడుతుందనే భయంతో అగ్ని పర్వత సొరంగాన్నే మూసేయాలనుకుంటారు. ఆ తర్వాత బద్ధలయ్యిందని గగ్గోలు పెడతారు' అంటుంది డయానా వార్విక్.

ఇంతకూ ఆమె ఎలాంటి స్త్రీ? అగ్ని పర్వతమా? ఆనాటి పత్రాలు చదివితే అవుననే అనిపిస్తుంది.

డబ్లిన్‌లో జరిగిన ఓ పార్టీలో తొలిసారిగా ఆమెను హై సొసైటీ గుర్తించింది. కెప్టెన్ సర్ లూకిన్, డన్‌స్టేన్, లేడీ డన్‌స్టేన్‌లాంటి ప్రముఖులు ఆహూతులైన ఆ విందులో, "ఆమె ఎవరోగానీ గులకరాళ్ల




మధ్య మరకత మణిలా వెలిగిపోతున్నది" అంటూ కళ్లార్పకుండా చూశాడు లార్డ్ లారియన్.

"ఆమెను చూస్తే సైనికుడికి కూడా కవిత్వం వస్తుంది. డయానా ఆంటోనియా అందం అలాంటిది. పందొమ్మిదేళ్లు కూడా నిండలేదు. తనలో ఎంత ఆత్మ విశ్వాసమో" అంది లేడీ డన్‌స్టేన్.

ఆ తర్వాత సర్‌లూకిన్ తన బాల్య మిత్రుడు థామస్ రెడ్‌వర్త్‌కు ఆమెను పరిచయం చేశాడు. తొలిచూపులోనే రెడ్‌వర్త్ మనసును దోచుకుంది డయానా. కాని చాలీచాలని ఆదాయంతో ఆమెను సుఖపెట్టలేనని అతడికి తెలుసు. ఆ రోజుల్లో డయానాతో నాట్యం చెయ్యటానికి యువకులెందరో పోటీపడ్డారు.

పదిహేను రోజుల తర్వాత ఆమెను తన అతిథిగా 'సర్రే'కు ఆహ్వానించింది లేడీ డన్‌స్టేన్. ఇద్దరూ కలిసి చరిత్ర పుస్తకాలు తిరగేశారు. "ఐర్లాండ్ పరాధీనతకు కారణం ఎవరు? రాజకీయ నాయకులెందుకిలా మన్నుదిన్న పాముల్లా ఉపన్యాసాలకే పరిమితమవుతారు? ఏ వీరపురుషుడో బ్రిటీష్ వాళ్ల తలలు వంచి తన మాతృదేశానికి తిరిగి గత వైభవం తీసుకురాకుడదా?" అంటూ ఆవేశంగా మాట్లాడింది డయానా.

ఆమెకు క్రాస్‌వేస్‌లో ఓ యిల్లుంది. దాన్ని ఖాళీగా వుంచటం యిష్టంలేక వా

# జార్జి మెరెడిత్

## 1823 - 1909

ఇంగ్లండ్‌లోని పోర్ట్స్‌మౌత్‌లో జన్మించాడు మెరెడిత్. అయిదేళ్ళప్పుడే తల్లి మరణించింది. పద్నాలుగో ఏట న్యూలైడ్ (జర్మనీ)లో వున్న మొరేవియన్ స్కూల్లో చదివాడు. న్యాయశాస్త్రంలో పట్టభద్రుడైనా, తన ప్రవృత్తికి 'లా' నచ్చక జర్నలిస్టుగా బతకాలనుకున్నాడు. కవిత్వం రాశాడు. 1849లో ప్రముఖ వ్యంగ్య రచయిత, కవి షెల్లీకి మిత్రుడు థామస్ లవ్ పీకాక్ (1785-1866) కూతురు మేరీ ఎల్లెన్ నికాల్స్‌ను పెళ్లాడాడు. ఆమెకు 30, అతడికి 21.

1851లో తొలి కవితా సంకలనం వెలువడింది. భార్య ఒక చిత్రకారునితో లేచిపోయింది. ఈ అనుభవాన్ని చిత్రించిన మెరెడిత్ తొలినవల 'ది ఆర్డియల్ ఆఫ్ రిచర్డ్ ఫెవరెల్' 1862లో వెలువడింది.

1864లో మేరీ వులియామీని వివాహమాడి సర్రేలో స్థిరపడ్డాడు. ఈయన హాస్యరసం గురించి రాసిన 'ఎస్సే ఆన్ కామెడీ' (1877) ప్రామాణిక లక్షణ గ్రంథంగా గుర్తింపువుంది.

మెరెడిత్ రాసిన ముఖ్యమైన నవలల్లో ఒకటి ది ఈగోయిస్ట్ (1879).

కేవలం రచనలతో సంసారం గడవటం కష్టమే. చాప్‌మాన్ అండ్ హాల్ (ప్రచురణ కర్తలు) వద్ద పాఠకుడు/సంపాదకుడుగా చేరాడు. ఇంత కీలకమైన వుద్యోగంలో చేరిన మెరెడిత్‌కు సహజంగానే సాటి రచయితల సాన్నిహిత్యం, గౌరవం లభించాయి. ఆనాటి సాహితీ వేత్తలు డాంటే గేబ్రియల్ రోజెట్టీ, స్విన్‌బర్న్, లెస్లీ స్టీఫెన్, రాబర్ట్ లూయీ స్టీవెన్ సన్, జె.ఎం. బారీలు మెరెడిత్‌కు మిత్రులు. రచయితలు జార్జి గిస్సింగ్, థామస్ హార్డీలను 'డిస్కవర్' చేసిన ఘనత కూడా ఈయనకు దక్కుతుంది.

ఆస్కార్‌వైల్డ్, ఆర్థర్ కానన్ డాయల్‌లు తమ రచనల్లో మెరిడిత్ పేరు ప్రస్తావించటం ఒక అపూర్వమైన సాహితీ గౌరవం. అనేక కవితా సంపుటాలు కాక ఆయన నవలలు, 'ది షేవింగ్ ఆఫ్ షాగ్‌పాట్' (1856), ఫారినా (1857), ఎవాన్ హరింగ్టన్ (1861), రోడా ఫ్లెమింగ్ (1865), 'విట్టోరియా' (1967), 'అడ్వెంచర్స్ ఆఫ్ హారీ రిచ్మండ్' (1871), 'బ్యూచాంప్స్ కెరీర్' (1877), 'ది ట్రాజిక్ కమెడియన్స్' (1871), 'ది అమేజింగ్ మారేజ్' (1895) వగైరాలు కూడా పాఠకుల మన్ననలు పొందాయి.

ర్విక్ దంపతులకద్దెకిచ్చింది. క్రమంగా పరిచయం పెరిగి వాళ్ల సమీప బంధువు, ఒక చిరుద్యోగి అయిన ఆగస్టస్ వార్విక్‌ను పెళ్లి చేసుకుంది. ఆగస్టస్‌లాంటి సాదా సీదా వ్యక్తిని ఆమె చేసుకున్నందుకు రెడ్‌వర్త్ ఆశ్చర్యపోతాడు. ఎలాగైనా డబ్బు సంపాదించాలని ఆగస్టస్ రైల్వేలలో పెట్టుబడి పెడతాడు. లాభాలు రావటమే తరువాయి. "నిజానికి, దయానా లాంటి అనాథకు వరుడు దొరకటమే అదృష్టం!" అంటూ వ్యాఖ్యానిస్తాడొక సజ్జనుడు.

ఆవిడ నిజంగా 'అనాథా?' స్పష్టమైన ఆధారాలు లభించలేదు.

'ఆగస్టస్‌లో ఆమె ఏం చూసిందా?' అని పరిశోధన కొనసాగించాడు రెడ్‌వర్త్. అందమూ లేదు. డబ్బూలేదు. ఈ

సుందరి తొందరపడింది. ఆమెకు తగిన భర్త యింకా పుట్టలేదని అంటారు మిత్రులు. డయానాతో స్నేహం కొనసాగిస్తాడు రెడ్‌వర్త్.

రెండేళ్లు గడుస్తాయి. ఆగస్టస్‌కు రైల్వేల్లో నష్టం వస్తుంది. అతికష్టం మీద మరో చిన్న గవర్నమెంటు ఉద్యోగం సంపాదించుకుంటాడు. 'ఇక కష్టాలు తీరినట్టే' అని బంధువులకు వుత్తరాలు రాస్తుంది డయానా.

డయానా కష్టాలు సరిగ్గా అప్పుడే ప్రారంభమయ్యాయి.

డయానా దంపతుల యింటికి ఒక ప్రముఖ వ్యక్తి, కేబినెట్ మినిస్టర్ లార్డ్ డానిస్ బర్గ్ వస్తుంటాడని భార్యతో చెప్పాడు సర్ లూకిస్. అందరికీ తెలిసిన కారణం 'డిన్నర్' చెయ్యటానికి. మనం పెడర్థాలు తీయక్కర్లేదు. కాని అందమైన వివాహిత స్త్రీని, పలుకుబడి వున్న 'ఘరానా' వ్యక్తి పొగడ్తలతో ముంచెత్తుతున్నాడంటే 'స్కాండల్' కాకుండా ఆపటం ఎవరితరం?

డయానా, ఒక లేఖలో 'ఆడవాళ్లం మేం పాసివ్ వర్మ్సు లాంటి వాళ్లం. ఏక్టివ్‌గా పుట్టటం నా దురదృష్టం' అని రాసింది. మరోసారి లార్డ్ లారియన్, లార్డ్ డానిస్‌బర్గ్‌ల గురించి మాట్లాడుతూ, "నాకు పాత వస్తువులంటే యిష్టం. ముఖ్యంగా ప్రాచీన కళాఖండాలు. లార్డ్ డానిస్ బర్గ్‌కు నా 'తండ్రికున్నంత' వయసుంటుంది. అయినా అతడంటే నాకు చాలా యిష్టం" అంది. మనసులో కల్మషం లేనప్పుడు లోకం కోడై కూసినా భయపడవలసిన అవసరం లేదు.

ఒకనాడు లార్డ్‌డానిస్‌బర్గ్‌తో కలిసి డిన్నర్‌కెళ్లింది. భర్త వెంటరాలేదు. స్నేహం హద్దులు మీరిందా అని సందేహించారు. ఆతర్వాత, మరికొద్ది రోజులకే అనుకున్నంతా అయింది. మరో 'విఐపి'తో చెట్టాపట్టాలేసుకుని తిరిగింది. భర్త విడాకుల కోసం ప్రయత్నిస్తాడు. తను చేసిన తప్పేమిటో అర్థంకాని డయానాకు భర్త ప్రవర్తన మూర్ఖంగా కనిపిస్తుంది. తన అమాయకత్వాన్ని నిరూపించుకోవలసిన అవసరమేమిటి? స్త్రీలెప్పుడూ పురుషులు గీసిన గిరి దాటకూడదన్నమాట. భర్త తప్ప మరో మగాడితో తను స్నేహంగా, సన్నిహితంగా మెలగకూడదా? ఈ హిపోక్రైట్ లోకం తననో హిపోక్రైట్‌గా చూడాలనుకుంటే తనందుకు సహకరించదే. స్త్రీ స్వేచ్ఛ కోసం జరిగే పోరాటంలో తొలిత్యాగం తనదే.

సమాజం నిర్దేశించిన విలువల్ని ధిక్కరించి తన పద్ధతిలో బతకాలనుకుంది డయానా. బతికింది కూడా. 'భర్త', 'బంధువుల రక్షణ'లాంటివి తనకు సరిపడవు. తన కాళ్లమీద తాను నిలబడుతుంది. తన 'టర్మ్స్' మీద లోకాన్ని ఎదుర్కొంటుంది.

లండన్‌కెళ్లి చవకబారు లాడ్జింగ్‌లో నివాసం ప్రారంభించింది. పనిమనిషి డాన్వర్స్ తప్ప వెంట మరెవరూ లేరు. తెచ్చుకున్న కొద్దిడబ్బూ ఖర్చయిపోయింది. ఒకప్పుడు మినిస్టర్ ఆఫ్ స్టేట్‌కూ, యితర పెద్దలకూ విందులిచ్చిన స్త్రీ వీధుల్లో ఒంటరిగా నడిచింది. లార్డ్ లారియన్ ఆమెకో న్యూఫౌండ్‌లాండ్ జాగిలాన్ని బహుమతిగా యిచ్చాడు. అదామెకు బాడీగార్డుగా వుంటుంది. ఆమె నిర్ణయాలను సమర్థించిన సర్ లూకిన్ 'నిరాధారమైన, నీచమైన ఆరోపణలు చేస్తున్నాడు ఆగస్టస్ వార్విక్' అన్నాడు. కొందరు మేధావులు, సజ్జనులు ఆమె పక్షం వహించారు. ఎన్ని సమస్యలెదురైనా డయానా చిరునవ్వు చెరగలేదు. మాటల పదును తగ్గలేదు. ఆగస్టస్‌తో సహజీవనానికి అంగీకరించలేదు. రెడ్‌వర్త్ లాంటివాళ్లు చొరవ తీసుకుని ప్రయత్నించినా సుముఖత చూపలేదు. వ్యక్తికి నిజాయితీ ముఖ్యం. ఆత్మసాక్షి అబద్ధం

చెప్పదు. ఎవరెంత సానుభూతి చూపించినా, మీదపడిన మచ్చ మాత్రం తొలగిపోదు.

విడాకుల కేసు కొనసాగింది. ఆగస్టస్ తన ఆరోపణలను రుజువు చేయలేకపోయాడు. ఇద్దరిలోనూ తప్పుందన్నారు కొందరు.

ఆ తర్వాత డయానా కొంతకాలం విదేశీ పర్యటన చేసివచ్చింది. భర్తకు తనమీద అనుమానం ఎందుకొచ్చిందో అర్థం కాలేదని మిత్రులందరికీ చెప్పింది. అయితే యిలాంటి స్వభావం ఆగస్టస్ ఒక్కడికే వుందని కాదు! 'వివాహవ్యవస్థ' గురించి ఉన్న సామాజిక భావనలోనే పరస్పర వైరుధ్యాలున్నాయి. స్త్రీ పురుషులు స్నేహితులుగా వుంటే అసూయ, స్వంతం అనే భావనలు కలుగవు గదా? ఈ దశలో రెడ్‌వర్త్‌తో ఆమెకు సాన్నిహిత్యం పెరిగినప్పటికీ, అతణ్ణి 'మిస్టర్' అనే సంబోధించింది. వ్యక్తుల మధ్య 'ఎడం' వుండటం అవసరమని ఆమె అభిప్రాయం. రెడ్‌వర్త్ త్వరలో పార్లమెంట్‌లో ప్రవేశిస్తాడని తెలుసు. స్త్రీ స్వేచ్ఛకు సరిహద్దులు నిర్ణయిస్తున్న చట్టాలను మార్చటానికతడేం చేస్తాడా? అని ఆసక్తిగా గమనించింది. మరో యువకుడు పెర్సీ డేసియర్ (లార్డ్ డానిస్‌బర్గ్ మేనల్లుడు) కూడా ఆమెతో పరిచయం పెంచుకున్నాడు. "మన యువకులు, మన సీనియర్లే మన ఆశ. మధ్యవయస్కులు యథాతథవాదులు" అంటూ ఒక స్టేట్‌మెంట్ కూడా యిచ్చిందొకసారి. తన జీవితకాలంలో ఈ సమాజం మారే అవకాశం లేదు. అయినా ప్రయత్నాలు కొనసాగించక తప్పదు.

డయానా తొలినవల అచ్చయినప్పుడు, డేసియర్‌కు ఒక ధనిక యువతి మిస్ ఆస్పర్‌తో పెళ్లి కుదిరింది. (ఆమె ఒక షిప్ యజమానికి బంధువు). రాజకీయాల్లో ఎదగాలంటే డబ్బు అవసరం ఎంతైనా వుంటుంది. అందువల్ల డేసియర్ సంపన్నులతో సంబంధం పెట్టుకోకతప్పదు.

డయానా విదేశాల్లో వున్నప్పుడే లార్డ్ డేనిస్‌బర్గ్ అనారోగ్యంతో బాధపడుతున్నాడని తెలిసింది. మరిన్ని వివరాలకోసం డేసియర్‌కు లేఖలు రాసింది. తన అవసరం వున్న పక్షంలో తక్షణమే లండన్ వస్తానంది. ఆ తర్వాత డేసియర్ వైఖరిలో మార్పు గమనించింది. తాను రాకపోతేనే మంచిదని పరోక్షంగా సూచించాడతడు.

ఆంటోనియా(డయానా) రాసిన 'ది ప్రిన్సెస్ ఎగెరియా' ప్రచురణకు ఆర్థిక సహాయం చేశాడు రెడ్‌వర్త్. ఎడిటర్లకూ, విమర్శకులకూ ప్రత్యేక సమావేశాలు ఏర్పరచి మరీ పబ్లిసిటీ యిచ్చాడు. రెడ్‌వర్త్ పెట్టుబడి లాభాలనార్జించింది. అతడు 'రేల్వేకింగ్' కావటం తథ్యమన్నారు మార్కెట్ విశ్లేషకులు. 'ప్రిన్సెస్ ఎగెరియా' రచయిత్రి ఒక సొసైటీ లేడీ అని తెలిసి దానికి మరింత ప్రాచుర్యం వచ్చింది. ఆ నవలలోని పాత్రలకూ, నిజజీవితంలోని కొందరు వ్యక్తులకూ పోలికలు కన్పించాయి. ఆంటోనియా మరెవరో కాదు, మిసెస్ డయానా వార్విక్' అని కూడా తెలిసింది. డయానాకు డబ్బు సమస్య తీరినట్టే.

లండన్‌లో ఇల్లుకొని ఆధునిక ఫర్నిచర్‌తో అలంకరించింది. హై సొసైటీ వ్యక్తులందర్నీ మళ్లీ ఎంటర్‌టెయిన్ చేసింది. రెట్టింపు పట్టుదలతో రచనా వ్యాసంగం కొనసాగించింది. ఆమె పార్టీలకు తరచూ వచ్చినవాళ్లలో డేసియర్ ముఖ్యుడు. అప్పుడప్పుడే కవిగా గుర్తింపు తెచ్చుకుంటున్న ఆర్థర్ రోడ్స్ కూడా ఆమె అతిథుల్లో ఒకడు. ప్రతిరోజూ డిన్నర్ టేబుల్‌వద్ద మేధోపటిమకు పదును పెట్టే చర్చలు సుదీర్ఘంగా జరిగాయి.




## కుక్కగారి కోసం



క్యాలిఫోర్నియాలోని లాన్‌డేల్‌కి చెందిన బ్రాండన్ ఫ్రెంచ్ (8), జేసన్ ఫ్రెంచ్ (12)ల పెంపుడు కుక్క తప్పిపోయింది. వాళ్ళు దాని కోసం పత్రికలో ప్రకటన కూడా ఇచ్చారు.

'కుక్క దొరికింది' అన్న ఇంకో ప్రకటనలోని కుక్క తమ కుక్క 'కౌన్సీ' అయిఉండచ్చని ఆ పిల్లల తండ్రి ఆ ప్రకటనదారుడు ఎడ్డీ వాల్విక్‌ని కలిసాడు. కాని ఆమె వారే తనకి దొరికిన కుక్క యజమానులని విశ్వసించలేదు. ఫలితంగా ఆ పిల్లల తండ్రి జో ఫ్రెంచ్ కోర్టు మెట్లెక్కాడు. 'కుక్కని తిరిగి ఇవ్వు లేదా పోయిన ఆస్తిని దాని యజమానికి ఇవ్వనందుకు గాను 150 రోజులు జైల్లో గడుపు' అని ఎడ్డీపై తీర్పు ఇచ్చారు.

ఎడ్డీ తిరిగి ఇవ్వకుండా ఆ కేసుని అప్పీల్ చేసింది. ఆ కేసుపై ఇరుపక్షాలకి అయిన ఖర్చు 30,000 డాలర్లు.

ఆ వేసవిలో మరణానికి ముందు లార్డ్ డానిస్‌బర్గ్ తన మృతదేహాన్ని డయానా ఓ గంటసేపు చూడాలని ఓ వింత కోరిక వెలిబుచ్చాడు. ఎవరేమనుకున్నా సరే, గత స్నేహానికి చిహ్నంగా ఆయన చివరి కోరిక తీర్చిందామె.

ఈ సంఘటన డయానా గురించిన స్కాండల్స్‌కు మళ్లీ ప్రచారం కల్పించింది. ఆమె ప్రవర్తనకు లేడీస్ అందరూ ముక్కుమీద వేలేసుకున్నారు. 'ఆమె భర్త (ఆగస్టస్) ఎంత మంచివాడో! పాపం, అతడి జీవితం నాశనం చేసింది' అంటూ గాసిప్ ప్రారంభించింది ఒకామె.

ఆంటోనియా మరో నవల 'ది యంగ్ మినిస్టర్ ఆఫ్ స్టేట్' అచ్చయినప్పుడు పుకార్లు దావానలంలా వ్యాపించాయి, అందులోని హీరో డాసియర్ తప్ప మరెవరూ కావటానికి వీల్లేదన్నారు సమీక్షకులు. అవును, ఇద్దరికీ వున్న సాన్నిహిత్యం అలాంటిది. పార్కుల్లో, సంగీత కచేరీల్లో ఎక్కడ చూసినా వాళ్లే. పాఠకాదరణతో పాటు డయానాకు మిత్రబృందం పెరిగింది. ఖర్చులూ పెరిగాయి. మరింత ఎక్కువగా రాయక తప్పదు. క్రమంగా కీర్తి యినుమడించింది. ఆమె గురించి పత్రికలు, వార్తా కథనాలు ప్రచురించాయి. కలం కదిలితే కనకవర్షం. ఆమె కొత్త పుస్తకం 'కాంట్రాట్రిస్' విడుదలైంది. ఆర్థర్ రోడ్స్ దాన్ని ఆకాశానికెత్తాడు. కొందరికందులో రెడ్‌వర్త్ కనిపించాడు.

డబ్బూ, హోదా సంపాదించిన డేసియర్ 'పెళ్ళి చేసుకుందా'మంటూ డయానాకు ప్రపోజ్ చేశాడు. ఆమెలో కూడా వుత్సాహం తగ్గిందేమో, యిదివరకులా రాయలేదు. చట్ట ప్రకారం విడాకులు రావటానికి ఎన్నాళ్లు పడుతుందో తెలియదు. డేసియర్ లేకుండా తనూ వుండలేదు. ఇద్దరూ కలిసి దూరంగా వెళ్లిపోవాలనుకున్నారు.

ఎనిమిదింటికి స్టేషన్‌లో పారిస్ వెళ్లే రైలెక్కాలి. అప్పుడు ఆమె యింటి తలుపు తట్టిన రెడ్‌వర్త్ "తక్షణం వెంట రా" అంటూ లాక్కెళ్లాడు. లేడీ డన్‌స్టేన్‌కు పెద్ద ఆపరేషనైందట. సేవ చెయ్యాలి. ప్రేమ కన్నా స్నేహం ముఖ్యమనుకున్న మనిషాయె.

స్టేషన్‌లో డేసియర్ రాత్రంతా నిరీక్షించాడు.

డయానాకు ఆర్థిక సమస్యలు పెరిగాయి. లండన్‌లో తన మీద ఆధారపడిన

వాళ్లను పోషించాలి. 'కాంటాట్రిస్' అమ్ము డుపోలేదు. రెడ్‌వర్త్ సహాయం చేస్తాన న్నాడు. ఆమె నిరాకరించింది. ఇటీవలే తను ఓ 'గని'లో పెట్టుబడి పెట్టింది. తరు వాత తెలిసింది ఆ గని ఖాళీగా వుందని. రాజకీయ మిత్రుల రాక తగ్గింది. తనకోసం యింకా నిరీక్షిస్తున్నది డేసియర్ ఒక్కడే.

ఎటుచూసినా అప్పులు. రోజువారీ ఖర్చు లకు కూడా డబ్బుల్లేవు.

డయానా తన పట్ల సుముఖంగా ఉందని తెలుసుకున్న డేసియర్ రోజూ ఆమె కోసం వచ్చేవాడు.

"ఎవరేమనుకుంటే నాకేం? నువ్వెప్పు డైనా నా యింటికి రావచ్చు" అంటూ అతణ్ణి మరింత ప్రోత్సహించిందామె.

ఒకనాడు ఒక పార్టీ తర్వాత, అలసి వచ్చిన డేసియర్,

"మన ప్రధాని ఒక విప్లవాత్మక చట్టాన్ని చేయబోతున్నారు. త్వరలో పార్లమెంటులో బిల్లు ప్రవేశపెడతారు. కార్న్ లాస్ రద్దు చేసే ప్రయత్నం ప్రారంభమైంది" అంటూ ఆమె చెవిలో వూదాడు.

"అద్భుతం. తుఫాను గాలిలో పందు టాకు కూడా పక్షిలా ఎగరగలదు" అంది డయానా ఆనందాతిరేకంతో.

ఆమె మిత్ర బృందంలో ఎడిటర్ టోనన్ కూడా వున్నాడు. ఇతరులకన్నా ముందు తామే వార్తలు ప్రచురించాలని ప్రతి పత్రికా సంపాదకుడూ కోరుకుంటాడు. డేసి యర్ తనకు చెప్పింది రహస్యమని డయా నాకు తెలియదు. పైగా కొద్ది రోజుల్లో ఎలాగూ అందరికీ తెలుస్తుంది. రాజకీయ నాయకులతో పరిచయం ఉన్నా ఒక్క వార్తా తనకు చెప్పలేదని టోనన్ ఎన్నో సార్లు డయానాతో నిష్ఠూరంగా మాట్లా డాడు. ఈ రోజు అతనికి సహాయం చెయ్యా గలదు. నేరుగా టోనన్ ఆఫీసుకు బయల్దే రింది డయానా.

★ ★ ★

తెల్లవారి పత్రిక తిరగేసిన డేసియర్, పతాక శీర్షిక చూసి దిగ్భ్రాంతి చెందాడు. ఇంకేముంది? తన కేబినెట్ పోస్ట్ వూడి నట్టే. టోనన్‌కి వార్త ఎలా చేరింది? నాయకుడు తనను నమ్మి చెప్పాడీ రహస్యం. తను 'ఆమెకు' తప్ప మరెవరికీ చెప్పలేదు.

"అదంత రహస్యమా?" అంటూ ఆశ్చర్యం ప్రకటించింది డయానా.

అలాంటి ప్రశ్నలకు జవాబుండదు. ప్రై మ్ మినిస్టర్‌కూ, తనకూ తప్ప మరెవరికీ తెలియని స్టేట్ సీక్రెట్ అది.

జరిగిందంతా పూసగుచ్చినట్టు చెప్పింది. టోనన్ వెంటనే ప్రచురిస్తాడని వూహించలే దామె. డబ్బులవసరమై అతణ్ణి కలిసింది.

ఆ తర్వాత డేసియర్ మళ్ళీ ఎప్పుడూ ఆమె యింటికి రాలేదు. మిస్ ఆస్పెర్ అతడి అవసరాలు తీర్చింది. ఇద్దరూ పెళ్ళి కూడా చేసుకున్నారు.

డయానా మళ్ళీ కలం ముట్టుకోలేదు. అధిక శ్రమతో జబ్బు పడిందని చెప్పాడు ఆర్థర్ రోడ్స్.

మంచం పట్టిన డయానాకు సేవ చేసి మళ్ళీ మామూలు మనిషిని చేసింది లేడీ డన్‌స్టేన్.

అందమూ, తెలివి తేటలూ ఉన్న స్త్రీలను దేవుడు కూడా శిక్షిస్తాడనటానికి డయానా జీవితమే ఒక నిదర్శనం.

ఆర్థర్ రోడ్స్, రెడ్ వర్త్‌లే ఆమెకింకా మిగిలిన మిత్రులు.

"స్త్రీ సమస్యలకు పెళ్ళి తప్ప మరో పరి ష్కారం లేదా?" అని అడిగింది డయానా.

చివరికి, తన గురించి పూర్తిగా తెలిసిన ఏ భ్రమలూ లేని, ఏ డిమాండ్స్ చెయ్యని రెడ్‌వర్త్‌ను పెళ్లి చేసుకుంది.

– ఎం.వసంత

# కుక్కలకూ వేల వేల సమాధులు



అమెరికాలో పెంపుడు జంతువులను ముఖ్యంగా కుక్కలను పెంచుకోవడం అలవాటు. అక్కడి జీవన విధానంలోని ఒత్తిడిని తొలగించుకోవడానికి పెంపుడు జంతువులను పెంచుకుంటుంటారు. హాలీవుడ్ స్టార్స్ కూడా దీనికి భిన్నంకాదు.

లాస్ ఏంజెలెస్‌లో జంతువులను పాతిపెట్టడానికి 1928లోనే ఓ సెమెట్రీని ఆరంభించారు. దానిపేరు 'ది లాస్ ఏంజెలెస్ పెట్ మెమోరియల్ పార్క్'. హాలీవుడ్ స్టార్స్ అనేకులు మరణించిన తమ కుక్కలను ఇక్కడే



ఖననం చేస్తుంటారు. ఇక్కడ నలభైవేలకు పైగా కుక్కలకు సమాధిరాళ్లు కూడా ఉన్నాయి. ఆసక్తిగల సందర్శకులు తరచూ ఇక్కడికి వచ్చి సమాధిరాళ్లను పరిశీలించి, వాటిలో ఏవి హాలీవుడ్ స్టార్స్‌వో కనుక్కుంటూ ఉంటారు. కొందరు గైడ్లు సరాసరి అక్కడికి తీసుకెళ్తారు.

ప్రఖ్యాత దర్శకుడు స్టీవెన్ స్పీల్‌బర్గ్ తన రెండో భార్య కేట్‌తో వచ్చి తమ పెంపుడు కుక్క కింగ్ చార్లెస్‌ను ఇక్కడ ఖననం చేశాడు. అంతకు మునుపే తన మొదటి భార్య, నటి ఎమీ ఇర్వింగ్‌తో వచ్చి మరణించిన పెంపుడుకుక్కను ఖననం చేశాడు. ఈ సెమెట్రీకి ఎక్కువసార్లు వచ్చిన హాలీవుడ్ సెలబ్రిటీ స్పీల్‌బర్గే. శవపేటిక రంగు, సమాధి రాయి ఆకారం ఎంతో శ్రద్ధగా అతను ఎన్నుకుంటాడని సెమెట్రీ మేనేజర్ సేండీ డోనా చెబుతుంది.

చార్లీ చాప్లిన్, హంఫ్రీబోగర్ట్‌లాంటి పాతకాలపు సెలబ్రిటీస్ కుక్కల సమాధుల్ని కూడా ఇక్కడ చూడవచ్చు. ఇంకా గాయని డయానా రాస్, నటి టోరీ స్పెల్లింగ్, ఎలిజబెత్ టేలర్, గాయకుడు టోనీ ఆర్లండో, స్టార్‌ట్రెక్‌స్టార్ విలియం షాడ్నర్ మొదలైనవారి కుక్కల సమాధుల్ని ఇక్కడ చూడవచ్చు. అమెరికన్ పెట్ ప్రాడక్ట్ మాన్యుఫ్యాక్చరర్స్ అసోసియేషన్ పెంపుడు జంతువుల యజమానులతో జరిపిన సర్వే ప్రకారం అమెరికాలో 6.8కోట్ల పెంపుడు కుక్కలు ఉన్నాయి. అంటే ప్రతి పావువంతు మందికి రెండు కుక్కలు, 13 శాతం మందికి మూడు లేదా అంతకంటే ఎక్కువ పెంపుడు కుక్కలు ఉన్నాయి. సగటున ప్రతి కుక్కమీద ఏడాదికి రెండువందల పదహారు డాలర్లను వాళ్లు ఖర్చుచేస్తారు.

# మళ్లీ అమ్మ దగ్గరకి

సాయంత్రం ఏడు దాటింది. అల్లంతదూరంలో ట్యాంక్‌బండ్‌మీద మినుకు మినుకుమంటూ వెలుగుతున్న లైట్లను చూస్తూ కూర్చున్నాడు సారంగపాణి. లుంబినీపార్కులో పడవలు ఆగే చోటనున్న బెంచీమీదకు అతనొచ్చి రెండుగంటలు దాటింది. వచ్చేప్పటి హుషారు ఇప్పుడతనిలో లేదు. మనసంతా అమ్మ ఆలోచనలతో నిండి భారంగా తయ్యారైంది..

అవును అమ్మ!

అమ్మ అని కూడా చూడకుండా ఎన్నిసార్లు తిట్టాడో తను.

'ఎప్పుడు చస్తావే నువ్వు? మనశ్శాంతి లేకుండా చేస్తున్నావే పాడుముండా!' అనేవాడు తరచూ.

ఆమె కూడా తక్కువ తినలేదు.. తనూ తిట్టిపోసేది.

'ఆకలవుతోంది రా వెధవా? తొందరగా కుంభం పడేయ్‌రా దరిద్రుడా' అనేది.

పదేళ్లక్రితం బాత్‌రూమ్‌లో జారిపడింది అమ్మ. అప్పటికే ఆవిడ వయసు డెబ్బై అయిదు! కాళ్లు విరిగాయి.. తలకు నీళ్లపంపు బలంగా తాకడంతో మెదడు దెబ్బతింది. విరిగిన కాళ్లకు కట్లుకట్టిస్తే గాయాలు మానాయి కానీ కాళ్లు రాలేదు. అప్పటినుంచీ అన్నీ మంచంలోనే. మెదడు పనిచేయక పోవడంతో తనేం మాట్లాడుతోందో? ఏంచేస్తోందో ఆవిడకే తెలిసేదికాదు.. నోటికి ఎంతొస్తే అంతే!

ఆవిడ తిట్లు, చేష్టలు భరించలేక ఏ పని మనిషీ రెండురోజులకన్నా ఎక్కువ చేసేది కాదు. తన భార్యాపిల్లలు కూడా ఆ పనులు చేయలేక చీదరించుకునేవారు.

'తీసుకెళ్లి ఎక్కడన్నా వదిలేసిరా. లేదంటే నువ్వే చూసుకో.. చేసుకో' కరాఖండిగా తేల్చి చెప్పేశారోనాడు.

'మా అమ్మ పరిస్థితే రేపు నాకొస్తే బయటపారేస్తారా?' బాధగా అన్నాడు తను.

'భరించలేనప్పుడు ఎవరు మాత్రం ఏంచేస్తారు?' అని సన్నాయి నొక్కులు నొక్కింది భార్య. ఆ నొక్కులకు వంతపాడారు కన్నబిడ్డలు.

చేసేదేంలేక ఎలాగో రిటైరయ్యాడు కనుక అమ్మ బాధ్యత తనే తీసుకున్నాడు. పొద్దున్నే తనే మలమూత్రాదులు ఎత్తిపార బోయడం, ఒళ్లు శుభ్రంచేయడం, బట్టలు మార్చడం, అన్నం కలిపి నోట్లో పెట్టడం అన్నీ తనే చూసేవాడు. మతిలేని మనిషి కావడంతో చాలా ఇబ్బంది పెట్టేది. నోట్లో పెట్టిన అన్నం ముద్దను తీసి ముఖంమీదే గిరాటేసేది. చేతిలో ఏదుంటే దాన్ని విసిరికొట్టేది.. అప్పుడు తనకూ కోపం వచ్చి తిట్టేవాడు.

బట్టలన్నీ తడిసి ఉండేవేమో చలికి తట్టుకోలేక తెల్లారుతూనే ఏడవడమో.. తిట్టడమో చేస్తుండేది. అవి మార్చేవరకూ గోలే!

తనకు చిరాకు ముంచుకొచ్చేది.. ఛీ ఏం బతుకు? ఒక పూజ చేసుకునే రాతలేదు. ఓ పుస్తకం చదువుకునే యోగం లేదు. హైదరాబాద్‌లో ఉంటూ కూడా ఓ సాహిత్య కార్యక్రమంగానీ, సంగీత కార్యక్రమంగానీ చూళ్లేకపోతున్నాడు. అంతెందుకు? పట్టుమని పదినిముషాలు నిద్రపోయే భాగ్యం లేకపోయింది. ఉద్యోగం చేసినన్నాళ్లూ అలా.. ఇప్పుడిలా.. ఈ ముసల్దాని సేవతోనే తన జీవితం అంతం అయిపోతుందేమో అనుకునేవాడు.

కొద్దిసేపటికే తనతప్పు తను తెలుసుకునేవాడు. ఇప్పుడు అమ్మకు చేస్తున్నవన్నీ అమ్మ తనకు ఒకప్పుడు చేసినవే! ఇప్పుడు తను




అనుకున్నట్లే అప్పుడు అమ్మ అనుకుంటే అసలు ఇప్పటిదాకా తనుండేవాడా? అదీగాక తన సేవలన్నీ ఆమె ప్రేమతో చేసింది.. ప్రాణం పెట్టుకుని చూసుకుంది.. మరి తనో? !

ఇప్పుడంటే అమ్మను చూస్తుంటే శిథిల సామ్రాజ్యంలా ఉంది కానీ ఒకప్పుడు ఎంత అందంగా ఉండేది? ఆమె ఒడి తనను సేద తీర్చే చల్లని పొదరిల్లు. అదే తనకు సింహాసనం కూడా! ఆమె కౌగిలి తనకు ఉక్కుకవచంలా ఉండేది.

తడిగుడ్డతో అమ్మ ఒళ్లు తుడిచేటప్పుడు ఎండుతప్పల్లా వ్రేలాడుతున్న ఆ పాలిండ్లను చూసి అతని కళ్లు చెమ్మగిల్లేవి. తనగోటి రక్కుల్ని తట్టుకుంటూనే పాలిచ్చి తన ఆకలి తీర్చిన అమృత కలశాలివే కదా? అన్పించేది. వాలిపోయిన ఆ వెన్ను తనను ఉప్పుమూట ఎక్కించుకుని తిప్పింది కదా అన్పించేది.

తనను నిలబెట్టడానికే అదలా వంగి పోయిం దన్పించేది.

ఒక్కోసారి చాకిరీ చేయలేక విసుగెత్తి అమ్మమీద విరుచుకు పడేవాడు. ఆమెకు ఏం తెలియదని తెలిసీ, అన్నీ తెలిసిన తను అమానుషంగా తిట్టేవాడు. 'నువ్వు చచ్చిన నాడేనే నాకు విముక్తి.. ఆ రోజు ఎప్పుడొ స్తుందా అని చూస్తున్నా! దానికోసం కోటి మంది దేవుళ్లకు మొక్కుతున్నా..' అనేవాడు.

ముఖ్యంగా నగరంలో గొప్ప సాహిత్య కార్యక్రమాలు జరుగుతున్నప్పుడు వెళ్లలేని తన అశక్తత, ఆక్రోశం ఆ తిట్ల ద్వారా వెళ్ల గక్కేవాడు తను.

పాపం పిచ్చిది.. నవ్వేది. ఎందుకు నవ్వేదో.. ఎందుకు ఏడ్చేదో ఆవిడకు తెలిస్తే కదా? అయితే ఆ నవ్వులో తనకు ఎన్నో అర్థాలు స్ఫురించేవి. 'ఓరి వెధవాయీ.. నీ చిన్నప్పుడు నేనూ ఇలాగే అనుకుంటే నువ్వుండేవాడివా? ' అన్నట్లుండేది.

అవును అమ్మ బాగున్నప్పుడు తరచూ చెబుతుండేది. నాలుగేళ్ల వయసులోతనకు పెద్దజబ్బు చేసిందట. డాక్టర్లు పెదవి విరిచా రట. అప్పుడు అమ్మే ఏడుకొండలవాడికి మొక్కుకుందట. 'నా బిడ్డకు తగ్గితే మా ఊరి నుంచి తిరుపతికి నడిచొస్తాను స్వామీ! నీ గుడిచుట్టూ పొర్లుదండాలు పెడతాను తండ్రీ' అని.

తనకు జబ్బు తగ్గిపోయాక మూడువం దల మైళ్లు నడిచి తిరుపతి చేరింది. అప్ప టికే కాళ్లు రోళ్లయ్యాయట, పైగా చంకలో నేను. తర్వాత తడిబట్టలు కట్టుకుని గుడి చుట్టూ పొర్లుదండాలు పెట్టింది.

అందుకే స్నానం చేయించేటప్పుడు సన్నగా గోగు పుల్లల్లా ఉన్న ఆమె కాళ్లను కళ్లకు అద్దుకునేవాడు తను. సున్నితంగా పెదవులతో ముద్దాడేవాడు. గిలిగింత అన్పిం చేదేమో పకపకా నవ్వేసేది అమ్మ.

అలాంటి అమ్మ- పదిహేను రోజుల క్రితం కనిపించని లోకాలకు వెళ్లిపోయింది.

కార్యక్రమాలన్నీ యథావిధిగా జరిపించి ఇవ్వాళే వీధిలోకి వచ్చాడు తను. ఇప్పుడు తను స్వేచ్ఛాజీవి. ఎక్కడికైనా వెళ్లిరావచ్చు. అనుకుంటూ ఏదో సభ జరుగుతుంటే రవీం ద్రభారతికి వచ్చాడు. కానీ ఎక్కువసేపు కూర్చోలేకపోయాడు. కారణం అమ్మ ఆలోచ నలు!

అక్కడినుంచి నడుచుకుంటూ లుంబినీ పార్కుకు చేరుకున్నాడు. అక్కడికీ వదల కుండా వచ్చాయి అమ్మ ఆలోచనలు!

ఆవిడ తిట్లు, చేష్టలు అప్పట్లో చిరాకన్పిం చినా ఇప్పుడవే తీయగా అన్పిస్తున్నాయి. పదేపదే కావాలన్పిస్తున్నాయి.

ఎనిమిదిన్నరైంది..

మెల్లిగా ఇంటిముఖం పట్టాడు సారంగ పాణి. ఇంటికిచేరాక అమ్మమంచం ఉండాల్సి నచోటు ఖాళీగా కన్పించడంతో గుండె కలు క్కుమంది. అక్కడే కూలబడిపోయాడు. 'అమ్మా మళ్లీ తిరిగిరావే అమ్మా! తిట్టకుండా కళ్లలో పెట్టుకు చూసుకుంటానమ్మా' అంటూ బావురుమంటూ ఏడ్చాడు.

భార్యవచ్చి ఓదార్పుగా భుజంమీద చేయి వేసింది. కొడుకులు, కోడళ్లూ వచ్చి చుట్టూరా నిలబడ్డారు.

'పోయిన అమ్మ తిరిగి ఎలా వస్తుం దండీ.. కంట్రోల్ చేసుకోండి.'

'ఎందుకు రాదు.. అమ్మరాకపోతే నేనే వెళ్తాను..' అన్నాడు అతను ఆవేశంగా.

అంతా ఉలిక్కిపడ్డారు కానీ అంతలోనే సర్దుకున్నారు.

మర్నాడు పొద్దున్నే సారంగపాణి ఆచూకీ తెలియక ఇంటిల్లిపాదీ కంగారు పడ్డారు. రెండురోజుల తర్వాత వారికి అతని ఆచూకీ తెలిసింది.

ఊరిబయట వృద్ధాశ్రమంలో తనతల్లి వయసు అమ్మలకు శుశ్రూషలు చేస్తూ న్నాడని.

—చంద్రప్రతాప్

# మనసున ఉన్నదీ...



★ డిసెంబరు చతురలో శంకరమూర్తి... కారు రిజిస్ట్రేషన్ 'అపార్ట్‌మెంటాలజీ'లో కడుపుబ్బ నవ్విస్తే 'దేవుని రాజ్యం' ఆద్యంతం ఆర్ద్రత నింపింది. రైతు సమస్యలను చక్కగా విశదీకరించారు. జ్ఞాపకాల వసంతం, కాలాతీతం, చార్లీచాప్లిన్‌కు నివాళిగా అందించిన కథనం ఆసక్తికరంగా సాగాయి. నవ్వుల రాజు లోతైన భావాల్ని తెలియచెప్పాయి. ట్యాంక్ బండ్ కథ ఆకట్టుకుంది. కొత్తగాలులన్నీ బాగా వీచాయి.

–పి.సూర్యనారాయణరాజు, హైదరాబాద్

★ ఎలికట్టె శంకరరావు 'దేవుని రాజ్యం' రైతుల పట్ల ప్రభుత్వ విధానాన్ని ఎండగట్టింది. కనీసం ఇటువంటి నవలలు చదివి ఓటుహక్కున్నవారు ఆలోచించి నేతలను ఎన్నుకుంటే సమస్యకు పరిష్కారం దొరకవచ్చు అన్నలొచ్చి కట్టేసి కొట్టినంత మాత్రాన సమస్య పరిష్కారం కాదు. చార్లీచాప్లిన్‌కు నివాళి బాగుంది. హాస్యస్ఫూర్తికి అందమైన నజరానా కోసం ఆత్రుతతో జనవరి సంచిక కోసం ఎదురు చూస్తున్నాం.

– అక్కినపల్లి రామారావు, విశాఖపట్నం

★ అందమైన అమ్మాయి చిరునవ్వు ముఖచిత్రంగా వెలువడిన డిసెంబరు చతురలో ఎలికట్టె శంకరరావు 'దేవుని రాజ్యం' అనేక విమర్శలకు తెరతీసేలా ఉంది. సామాజిక స్పృహ రేకెత్తించేలా ఉన్నప్పటికీ కొన్ని అంశాల్లో కాస్త మోతాదు ఎక్కువయింది. కొన్ని ప్రాంతాలవారిని పాత్రలద్వారా విమర్శించడం ఎంతవరకు సబబు అనిపించింది.

– నేమాన, శ్రీకాకుళం

★ మే నెలలో వచ్చిన 'నేల నవ్వింది' నవలలాగే మంచి ఇతివృత్తంతో డిసెంబరు చతురలో 'దేవుని రాజ్యం' నవల నడిచింది. ఈ రెండు నవలలూ బాగున్నవే. అయితే 'దేవుని రాజ్యం'లో వాడిన మాండలికాలు కాస్త ఇబ్బంది పెట్టాయి. దీంతో రెండు మూడుసార్లు చదవాల్సి వచ్చింది. మాండలికాలు వాడినప్పుడు కొంతలో కొంత అందరికీ అర్థమయ్యే పదాలు వాడితే బాగుండేది.

– శైలూషి, శ్రీకాకుళం

★ 'దేవుని రాజ్యం' అద్యంతం ఉత్కంఠభరితంగా నడిపిన ఎలికట్టె శంకరరావుగారికి అభినందనలు. అందం ఆరోగ్యం గురించి ప్రియాంక చెప్పిన కబుర్లు బాగున్నాయి. మహానియంతను ఆటపట్టించిన చార్లీచాప్లిన్ ధైర్యానికి జోహార్లు. 'చతుర ప్రపంచం' సంచికకే వన్నెతెస్తోందనడంలో సందేహం లేదు.

–రమ్య, హైదరాబాద్

★ రాజకీయాలు రైతు వెన్నును విరుస్తున్న తీరుపై ధ్వజమెత్తుతూ ఎలికట్టె శంకరరావు అందించిన 'దేవుని రాజ్యం' అందరినీ ఆలోచింపచేసే నవల. ఇలాంటి నవలలు రావాల్సిన అవసరం చాలా ఉంది. అన్నివిధాలా ఇది బహుమతికి అర్హమైనదే అన్పిస్తుంది. యర్రంశెట్టిగారి అపార్ట్‌మెంటాలజీ పదునైన వ్యంగ్యంతో పరుగులు తీస్తోంది. ఈసారి ఆర్టీఏ వారిని ఉతికి ఆరేసిన తీరు సుపర్బ్. కల్యాణరావుగారి 'అంటరాని వసంతం' కథవెనక కథ డిసెంబరు సంచికకే తలమానికం.

– వెంకటలక్ష్మి, అనంతపురం

★ చతుర ప్రవేశిక, విపుల వినోదిని కూపన్లను ఒకేకవర్‌లో పంపచ్చని సూచించడం సంతోషం కలిగించింది. మాకు నెలనెలా ఐదు రూపాయలు ఆదా చేశారు. డిసెంబరు నవల 'దేవుని రాజ్యం' నేటి పాలకులపై విసిరిన కొరడా! అయితేనేం? ఇలాంటి వాళ్లకు పదవుల్ని కట్టబెడుతున్న మనమే ముందు కళ్లు తెరవాలన్న ఆవశ్యకతను ఈ రచన తేల్చి చెప్పింది. హ్యాట్స్ ఆఫ్ టూ మిస్టర్ శంకరరావుగారూ..

– రావిపాటి సూర్యనారాయణ, నరసరావు పేట

చిరునామా: మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ –500 082

ఈ మెయిల్ చిరునామా: chatura@eenadu.net

